# ప్రవేశపెడుతున్నాం
# జై కిసాన్
# సామ్రాట్
# 18:46:0




**మీ పంటలను ఉవ్వెత్తున పెరిగేటట్లు చేసేందుకు అత్యధిక ఫాస్ఫేట్ గలది.**

* 18% నత్రజని, 46% ఫాస్ఫేట్ (డీఏపీ) జోరుగా, తొందరగా పెంచగల బలవర్ధకమైన సంకీర్ణ రసాయనిక ఎరువు.
* వరి, చెరకు, ప్రత్తి, నూనె గింజలు, పప్పు ధాన్యాల్లాంటి పంటలు బాగా ఏపుగా పెరగటంకోసం, అధికంగావున్న ఫాస్ఫేట్ తోడ్పడుతుంది.
* నీటిలో పూర్తిగా కరుగుతుంది—దాని పూర్తి లాభం మీ పంటలకు అందుతుంది.
* అత్యధిక పోషక పదార్థాలు....అతి తక్కువ ఖర్చులో!
* నత్రజని పూర్తిగా అమ్మోనియా రూపంలో ఉండటంవల్ల, నష్టపోవడం అంటూ ఏమీ ఉండదు.

# జై కిసాన్ ఎరువులు

**అత్యధిక దిగుబడుల కోసం అత్యధిక పోషణ.**

**జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా.**

సికింద్రాబాదు, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగపూర్, పుణె, జువారీనగర్.

LINTAS 2UA 112 2315 TL

## ముఖచిత్రం

కం. ఆపిలు పండును కొరుకుచు
చూపులలో చిలిపిదనపు సొంపులు నింపెన్
అపె అనూరాధయి! 'మీ'
'మా'పత్రిక ముందు బొమ్మ మనసును దోచెన్.

బాపట్ల వెంకటేశ్వరసాయి, చెరువు.

## పద్మిని కొల్హాపురి

హిందీనటి పద్మిని కొల్హాపురి ముఖచిత్రంతో వెలువడిన ప్రత్యేక సంచిక మమ్మల్ని అయస్కాంతంలా ఆకర్షించింది. మా వారందరినీ ఆకర్షించిన ఒక్క ప్రత్యేక సంచిక "ఆంధ్ర సచిత్ర వారపత్రికయే." ఈ పత్రికలో వచ్చే ప్రతీ కథలు, సీరియల్ నవలలు, లోకం—పోకడ, ఫాలాకునిడైరీ, డాక్టరు సలహాలు, వారఫలాలు, ప్రశ్నావళి మొదలగునవి మమ్మల్ని చాలా ఆకర్షిస్తున్నాయి. మేమందరమూ హిందీ సూపర్ స్టార్ "అమితాబ్ బచ్చన్" ముఖ చిత్రంతో మా సంచికను చూడాలని ఆకాంక్షిస్తున్నాము.

కె. తారకేశ్వరస్వామి, ఇతరులు, హావురా (ప. బె.)

## సీరియల్స్

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్ కలంనుండి వెలువడిన "స్వప్న భంగం" సీరియల్ మొదటి నుండి చివరివరకు మాకు నచ్చింది. అయితే ముగింపు– ఇంత త్వరలో అయిపోవడం మాకు బాధ కలిగించింది.

గవర శంకరరావు, రాణి, ఇతరులు, కిచ్చాడ.

* * *

"ఉదయ సంధ్య" మరియు "కర్మయోగి" సీరియల్స్ చదువుటకు చాలా ఆశక్తికరముగా వున్నాయి. మీకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనములు. సూర్య—చంద్రులున్నంత కాలము మా (మీ) పత్రిక చిరస్థాయిగా వుండాలని నా ఆకాంక్ష!

ఎమ్. వి. ఎన్. మూర్తి, ఐ. డి. పి. ఎల్., హైద్రాబాదు

* * *

జీవన సరళిలో తీయని రవళి మొదట్లోనే నా మనసులో తీయగా ఉంది.

కె. శివరామకృష్ణప్రసాదరావు, రావికంపాడు (తెనాలి తాలూకా)

* * *

ఆంధ్ర సచిత్రవారపత్రికలో ప్రచురించిన సీరియల్ 'ఊరానికదేతాళం' చాలా ఇంట్రస్టింగ్‌గా సాగింది. అప్పుడే సీరియల్ అయిపోయినందుకు చాల బాధగా ఉంది.

యం. డి. షబీనా, తాడేపల్లిగూడెం






## కథలు

సుఖదుఃఖమయమైన జీవితంలో మనిషికి సేదతీర్చేది మరో మనిషితోడు (అంటే స్నేహం) మాత్రమే. అది స్త్రీ పురుషుల మధ్య దాంపత్య రూపంలో సంపూర్ణంగా లభిస్తుందని తెలియ జెప్పేకథ ఇది. పెళ్లికి అర్థం కేవలం శారీరక భోగం మాత్రమేకాదని కథలో వృద్ధుల వివాహం ద్వారా గురజాడ శోభా పేరిందేవిగారు చాల చక్కగా నిరూపించారు.

కె. యాదగిరి, వరంగల్లు.

* * *

"అనూరాధ" ముఖచిత్రంతో వెలువడిన సంచిక ఆకర్షణీయంగా వుంది. మీరు ప్రచురించిన "సంగమం" కథలో రాఘవరావు కొడుకు చేతన టెక్నాలజీ ఎంట్రన్స్‌లో మంచి మార్కులు వచ్చినప్పటికి యూనివర్శిటీ సీటురాదని సందేహించడం హాస్యాస్పదంగా వుంది.

ఎంట్రన్స్‌లో వచ్చిన మార్కులను బట్టి రాంక్ యిస్తారు. రాంక్‌ల ప్రకారం యూనివర్శిటీలో సీటు యిస్తారు. ఇంటర్వ్యూలో ప్రశ్నలంటూ ఏమీ అడగరు. రచయిత గమనించ ప్రార్థన.

రాకుర్తి సత్యనారాయణ, శ్రీనివాస్, కాకినాడ.

* * *

1–6–84—"అనూరాధ" ముఖసంచిక లోని కథలు--వక్రరేఖ, గురుదక్షిణ, సంగమం బావున్నాయి! మాకు సామాజికస్పృహను కల్గించాయంటే నమ్మండి!

గుమ్మనూరు పూర్ణశ్రీ, గుమ్మనూరు స్వర్ణశ్రీ, ఆలూరు.

* * *

25-5–84 వారపత్రికలో ప్రచురించిన శ్రీ భమిడిపాటి భాస్కర రామారావుగారి 'బానిస' కథ చదువుతూంటే, అది నిజంగా జరిగినట్లు తోచుచున్నది. ఇప్పుడు కూడా అట్టి కర్కశ హృదయులు వున్నట్లు వున్నది. ఈ కథ అట్టి వారికి గుణపాఠము.

బి. మునిరత్నం, పుత్తూరు.

## పొగమేడలు

అయోధ్యారెడ్డి గారి "పొగమేడలు" మాకు చాల నచ్చింది.

యం. జి. నాథ్, కువయిట్.

[66 వ పేజీ చూడండి]


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
వాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]

శుక్రవారం : 29–6–'84
శ్రీ రక్తాక్షినామ సం. జ్యేష్ఠ బ. అమావాస్య

**సంపుటము 76 : సంచిక 42**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

విడి ప్రతి వెల రు. 1-80
ఆరు మాసాల చందా రు. 46-80
పోస్టులో ఏడాదిచందా రు. 101-40

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**
గాంధీనగరం. విజయవాడ-520 003.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం :

'ఇల్లాలు ప్రియురాలు'లో సుహాసిని

**కథలు :**



**సీరియల్ నవలలు :**



**వ్యాసాలు,శీర్షికలు :**

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# మతకలహాలా? రాజకీయ యుద్ధాలా?

రెండు నెలలు ముందు నన్నెవరయినా అడిగితే చెప్పేవాడిని – ''భివాండీలో గొడవ వస్తుంది'' అని. నేనింత దాకా భివాండీ వెళ్ల లేదు. గుంటకల్‌కీ, మొరాదాబాద్‌కీ, భివాండీకి తేడా చెప్పమంటే తడుముకోవలిసి వస్తుంది నేను, కాని ఒకనాడు సాయంత్రం బొంబాయిలో టి. వి. చూస్తున్నాను. శివాజీ జయంతి ఊరేగింపుని వీడియో టేపు చేసి చూపిస్తున్నారు ఆ రోజు. 10–12 సంవత్సరాల కాలంలో జరిగిన మొదటి శివాజీ జయంతి ఊరేగింపు ఇదే. భివాండీ వీధుల వెంబడి ఉల్లాసంగా వెళ్లింది ఆ ఊరేగింపు. నేను కలర్ టి. వి. చూస్తున్నాను. హటాత్తుగా ఒక వ్యక్తితో ''ఇంటర్‌వ్యూ'' చేశారు టి. వి. వాళ్లు. ఆయన గడ్డం గీసుకున్నట్లు లేదు, దుస్తులు కూడా నలిగి ఉన్నాయి. విలేఖరితో ఆయన అన్నాడు ''జయంతి ఉత్సవాలు చేసుకునే పద్ధతి ఇది కాదు!'' అని. ఆయన ఉద్దేశం ఏమిటో నాకు అర్థం కాలేదు కాని ఆయన మొహంలో అసంతృప్తి, కోపం కనిపించాయి. అప్పుడే అనుకున్నాను, ''భివాండీలో గొడవ వచ్చేస్తుంది!'' అని. ఆరువారాలలో నేను అనుకున్నదంతా జరిగింది. ఆ పెద్ద మనిషి కానివ్వండి, ఆయన స్నేహితులు కానివ్వండి, ఇంకెవరయినా కానివ్వండి—అనుకున్నంత పని చేశారు. అయితే వాళ్ల అంచనాలు తప్పినట్లుతోస్తుంది. ఎందుకంటే, ''ఇక మళ్లీ 10 ఏళ్లదాకా భివాండీలో మతకలహాలు చెలరేగవు'' అని నాకు కొందరు చెప్పారు. వాళ్లు అలాగ అన్నారుకాని బొంబాయిలో అధికారులు భయపడ్డారంటే, వచ్చే ఏడాది శివాజీ జయంతి ఊరేగింపుని నిషేధించారంటే మాత్రం ఏమి జరుగుతుందో చెప్పటం కష్టం.

భివాండీలో అనండి, ఇంకెక్కడయినా అనండి గొడవలు మతానికి సంబంధించినవికావు. అవి రాజకీయపు కొట్లాటలు. ఈ దేశంలో కొందరు మహమ్మదీయులకి ఇంకా అర్థంకాని యదార్థం ఇదీ–''బ్రిటిషువారు వెళ్లిపోయారు. ఈ దేశం ఎవరిదో వారికే అది సంక్రమించింది. ఇందులో ఎన్నో భాషలు మాటలాడేవారు ఉన్నారు కాని ఇందులో ఎన్నో జాతుల వాళ్లు లేరు. ఎన్నో సంస్కృతులవాళ్లు లేరు. మనం అంతా హిందువులమే. ఈ హిందువులలో కొందరు మహమ్మదీయులూ, క్రయిస్తవులూ, యూదులూ ఉండవచ్చుకాని అంతా భారతీయులే. మహమ్మదీయులు ఎక్కడయినా అల్పసంఖ్యలో ఉంటే వాళ్లు రాజకీయాధికారం, హిందువులకి వెళ్లిందని అర్థం చేసుకుంటారు. అది అంతే అని అర్థం చేసుకుంటారు. కాని వీళ్లు ఎక్కడయిన అధిక సంఖ్యలో ఉంటే, లేదా అధిక సంఖ్యకి దగ్గిరలో ఉంటే (మొరాదాబాద్, భివాండీ, జలగావ్‌లలోలాగ) వాళ్లు యదార్థాలని విస్మరించి ప్రవర్తిస్తారు. అరాఫత్‌కి వచ్చిన కష్టం ఇదే. కాలం మారిందని వారు గ్రహించరు. ఇలాంటివాళ్లకి శివాజీ గతంలోనుంచి వచ్చి ప్రత్యక్షమయ్యే దెయ్యంలాగ కనిపిస్తాడు. ఈ శివాజీ ఎవరు? ఆయన కుటుంబంవాళ్లు ఒకప్పుడు మొగల్ సామంతులు కారా? మొగల్ ప్రభువులకి ఎదురుతిరిగి, తన సొంత రాజ వంశాన్ని నెలకొల్పి, విదేశీయులని తరిమివేశాడా లేదా?

పయినే అన్నానుకదా? కొందరిని రాజకీయ స్మృతి మాత్రమే ఉంటుంది, వాళ్లకి మతానికి సంబంధించిన స్మృతి తక్కువ. ఎక్కడో ఒక మసీదు పోయిందని బాధపడరు వాళ్లు. వాళ్ల బాధ ఏమిటంటే, రాజకీయాధికారం పోయిందని. ఈ రాజకీయ యుద్ధాలకి మతం రంగుపూస్తారు. ఇస్లామ్ కేవలం ఒక మతం మాత్రమే కాదు అది రాజకీయాలకి వ్యాపించే వ్యవస్థ. రాజకీయాధికారం పోవటమే కాకుండా దానిని రక్షించుకునే శక్తి లేకపోతే కోపం వస్తుంది. తమని తాము రక్షించుకోలేని రాజ్యాలకి చెందినవాళ్లు ఎప్పుడూ ఇంతే.

భారతదేశం ఒక హైందవ దేశం. భారత దేశం ఒక హైందవ రాజ్యం. హైందవ అంటే హిందువులకి సంబంధించినది అనికదా అర్థం? నా నమ్మకం ఏమిటంటే హిందువులు ఒక మతానికి చెందినవారు కాదు. ఒకజాతికి చెందిన వారు, అని. అందుకనే నేను ''భారతీయులు అందరూ హిందువులే, వాళ్లు ఏదయినా ఒక శాఖకి చెందినాసరే!'' అంటూ ఉంటాను. భారతదేశంలోని కొన్ని మతాలవాళ్లు మారుతున్నారు. వాళ్లు యదార్థాలని అర్థం చేసుకున్నారు. ''లియాన్'' అనే పేరుపోయి ''మోహన్'' అనేది ఆదరణ పొందుతోంది. ''లెయిలా'' బదులు ''లీల'' అనే పేరు పెట్టుకుంటున్నారు. క్రమంగా జాన్సన్, విల్సన్ లాంటి ఇంటి పేరులుకూడా అదృశ్యమవుతాయేమో! డిసూజాలూ, పింటోలూ ఇప్పటికే తగ్గిపోతున్నారు కదా! క్రయిస్తవులయినంత మాత్రన అమ్మాయిలు స్కర్టులు వేసుకుంటున్నారా? లేదే! ప్రపంచంలోని ప్రతి దేశంలోనూ. కొన్ని సాంస్కృతిక పరిణామాలు ఉంటాయి. ఒక సంస్కృతి ప్రభావాలు, లేక గుణాలు తెలియకుండా ఇంకొక సంస్కృతిలోకి ప్రవేశిస్తూ ఉంటాయి. చిన్న (సంఖ్యలో) సమాజాలకి చెందినవారు పెద్ద (సంఖ్యలో) సమాజానికి చెందినవారిలాగ మారటం సహజం. ఇలాగ జరగకపోతే పేచీలు తప్పవు. ఇవి మత



# లోకం పోకడ....ఊమెన్













జాతీయ నాయకుడి లక్షణాలు ఎన్.టి.ఆర్.కి ఉన్నా ప్రాంతీయ తత్వం ఆయన్ని కట్టి పడేస్తుంది. ఈ సమస్యని ఆయన ఎలా పరిష్కరిస్తారు?

## న్యూఢిల్లీ లేఖ

కలహాలు అనుకోవటం పొరపాటు, అవి రాజకీయ కలహాలు.

శివాజీ, అవురంగజేబుల మధ్య పేచీ మతానికి సంబంధించినది కాదు రాజకీయాలకి సంబంధించినది. అలాగే జిన్నా–గాంధీ–నెహ్రూ పోట్లాటలు మత కలహాలు కావు. జిన్నా మాత్రం గడుసువాడు కనుక తన ప్రయోజనాల కోసం మతాన్ని వాడుకున్నాడు. ఆయన లక్ష్యాలు రాజకీయ లక్ష్యాలే. గాంధీ, నెహ్రూలకి ఒక విషయం అర్థం కానేలేదు ! తాము ఎవరితో, ఎప్పుడు, ఏ రకం యుద్ధం చేస్తున్నారో వారు తెలుసుకోలేకపోయారు. ఇద్దరూ నేరుగా బ్రిటిషు వాళ్ల వలలో, జిన్నా వలలో పడ్డారు. అసలు యుద్ధం రాజకీయస్థాయిలో జరుగుతూ ఉంటే వాళ్లు ఇద్దరూ మత ప్రశ్నలలో చిక్కుకు పోయారు. చివరిదాకా నెహ్రూకి తను జిన్నా చేత ఓడించబడ్డానని తెలియలేదు. ఆయనని జిన్నా రాజకీయాల యుద్ధంలో ఓడగొట్టాడు. తను మత కలహాల ఫలితంగా ఓడిపోయానని పండిట్ నెహ్రూ అతి తెలివిగా చెప్పేవాడు గాంధీ, నెహ్రూలు అపజయం పొందింది మతోన్మాదుల చేతకాదు– తమకన్నా తెలివికల రాజకీయవాది చేత. ఆ రాజకీయవాది జిన్నా. అందుకనే నెహ్రూ అభిమానులు గొంతు చించుకుని ''నెహ్రూ తత్వం కాదు ఓడిపోయింది మన రాజకీయాలు!'' అని అరుస్తూ ఉంటారు. ఇది నిజంకానే కాదు. పండిట్ నెహ్రూ ఎప్పుడూ యదార్థాన్ని ఎదుర్కొనే వాడుకాదు. ఆయన తన కాల్పనిక ప్రపంచం లోకి తప్పించుకునేవాడు "లౌకిక విధానం" అంటూ చిత్తుగా అపజయం పొందాడు ఆయన. భారతదేశం యొక్క విభజన గాంధీ, నెహ్రూలు జిన్నా, బ్రిటిష్‌వాళ్ల వద్ద పొందిన అపజయానికి నిదర్శనం.

మనదేశంలో నెహ్రూవాదులు ఇంకా ఉన్నారు. చంద్రశేఖర్ ఇటువంటి వాళ్లలో ఒకడు. షాబుద్దీన్ వంటివాళ్ల ఎత్తులు వాళ్లకి అర్థం కావు. షాబుద్దీన్ మతోన్మాదా ? ఏమో, కాని ఆయన ఆడుతున్న ఆట వేరు. ఆయన ఆడేది రాజకీయరంగంలో ఒక ఆట. గాంధీ, నెహ్రూలు ఇంకా యదార్థాన్ని అర్థం చేసుకోక ముందు జిన్నా ఆడిన ఆట ఇదే. జిన్నా మనుషులే భివాండీలో ఈ ఆటని ఇంకా ఆడుతున్నారు. బనాట్‌వాలా, షాబుద్దీన్ లాంటి వాళ్లు జిన్నా తత్వానికి అవశేషాల వంటి వాళ్లు. వాళ్ల సంఖ్య అంత తక్కువ ఏమీ కాదు. జిన్నా నెహ్రూని ఓడగొట్టాడు. ఒక నెహ్రూ రకం లౌకికవాది చంద్రశేఖర్‌ని షాబుద్దీన్ ఓడగొట్టినా ఆశ్చర్యం లేదు. నెహ్రూ మరణించినా నెహ్రూ తత్వం సజీవంగానే ఉంది. ఆది బతికి ఉన్నంత కాలమూ ఈ దేశానికి సంరక్షణలేదు. 

# లోపలి మనుషులు

## కన్నెపల్లి గోపాలకృష్ణ



మార్చి ఎనిమిది —

విమెన్స్ డే.

సాయంత్రం ఐదున్నరకు —

విమెన్స్ లిబ్ క్లబ్బంతా సందడిగా ఉంది.

క్లబ్ మెయిన్ హాల్లోని కుర్చీల్లో చాలామంది ఆడవాళ్ళు కూర్చుని కబుర్లు చెప్పుకొంటున్నారు.

కొంతమంది పని లేకపోయినా అటూ యిటూ హడావిడిగా తిరుగుతున్నారు.

ఖరీదైన చీరల గరగరలతో ఆ వాతావరణ మంతా స్త్రీత్వం నింపుకొంది.

కుర్చీల్లో కూర్చున్న ఆడవాళ్ళు పనులమీద తిరుగుతున్నవాళ్ళని పలకరించి కూర్చోబెట్టేస్తున్నారు. కబుర్లు మొదలెడుతున్నారు.

క్లబ్బునంతటినీ రంగురంగుల దీపాలతోనూ, బ్యానర్లతోనూ అందంగా అలంకరించారు. సెంట్రల్ హాల్లో డయాస్, దానిమీద మూడు కుర్చీలు, ఒక టేబిలు. టేబిల్పైన రంగు బుడ్లు. లోపల చమ్కీ ద్రవం, పైన రంగుల పువ్వులు.

కుర్చీల వెనుక, కాస్త ఎత్తుగా ప్రేక్షకులకి కనబడేటట్లు ఒక పెద్ద గుడ పైన — విమెన్స్ లిబ్ క్లబ్ ఆరవ వార్షికోత్సవం — స్త్రీ జనోద్ధరణ సంస్థ అని వుంది.

గోడలకు అక్కడక్కడా తగిలించిన బ్యానర్లలో మచ్చుకి కొన్ని —

''ఇంకా స్త్రీని బానిసగా చూస్తే తిరుగుబాటు తప్పదు.''

''ఆడది మీ వంటింటి కుందేలు మాత్రమేనా ? తానూ మనిషే !''

''ఇంటిపని మగవారు కూడా చేయాలి.''

''సమానత్వం మా హక్కు. స్వేచ్ఛ మా ఊపిరి.''

ఆ సమావేశానికి మగవారికి ప్రవేశార్హత లేకపోయినా నినాదాలు మాత్రం వారిని ఉద్దేశించినవే.

విచిత్రం ఏమిటంటే అక్షరాల్లో అభ్యుదయ భావాలున్న ఆ ఆడవాళ్ళు కుర్చీల్లో కూర్చుని మాట్లాడుకుంటున్న పోసుకోలు కబుర్లు విందామా ! !

''మా పనిమనిషికేం పోయేకాలం వచ్చిందో గాని, నాలుగు రోజుల నుంచి అజా పాజా లేదు. పనంతా చేయలేక ఛస్తున్నాననుకో !''

''అనపకాయ ఆవకాయకి ఏ పాళ్ళు వేయాలో కాస్త వ్రాసిద్దురూ.''

''ఏవండోయ్ వదినగారూ, ఈ చీరనెక్కడ తీసుకున్నారు ? నేషనల్ టెక్స్టైల్సా ? బోంబే డైయింగా ? ఆకుల చిరంజీవులా ?''

''ఆ వనజాక్షి మాట్లాడుతుంటే చూద్దూ, మూతెలా వంకర తిరుగుతోందో! అబ్బ ఆ ముడీ, చీరా... ఒకటే డోకు.''

''మీటింగెప్పుడు పూర్తవుతుందో ఏంటో? అసలే మావారు ఆకలికి ఆగలేరు.''

కబుర్లమీద కబుర్లు పేరుస్తూ కాలాన్ని కరిగించేస్తున్నారు. క్లబ్బు బయట లాన్లో చేతులు తిప్పుతూ, చుట్టూచేరిన ఆడవాళ్ళకి ఉపన్యాసమిస్తోంది కామాక్షమ్మ.

''అబ్బ, ఈ కార్యక్రమాలన్నీ నడిపించలేక ఛస్తున్నాననుకో ! మన స్త్రీజాతిని మనం అనుకోకూడదు గానీ పనికి సాయం చెయ్యరు ఒక్కరూ. మీటింగుల కంటె చక్కగా కుందన బొమ్మల్లా టింగురంగా అని తయారు. పని చెయండర్రా అని ఎంత చెప్పినా వినిపించుకోరే !

అక్కడికీ మావారంటూ ఉంటారు. నీకేం లోటని కామాక్షీ ఈ అనవసర జంఝాటం. నీకు లేని స్వేచ్ఛేదీ ఈ ఇంట్లో ? అని. అయ్యో, నాకొక్కదానికే స్వేచ్ఛ ఉంటే సరిపోతుందా ? తోటి స్త్రీలు కూడా సమాన హక్కులు అనుభవించినప్పుడు కదా నాకసలైన ఆనందం అనుకుంటూ అనవసరంగా వీధిన పడుతున్నాను. ఇల్లూ, ఒళ్ళూ గుల్లైపోగా నాకేం పేరు దక్కుతోందో తెలుసా ? నేనేదో క్లబ్బు సొమ్ము దోచేసుకుని, ఇంట్లో పోసేసుకుంటున్నానని కొంతమంది ఏబ్రాసులు అంటున్నారని విన్నాను.

నాకేం ఖర్మ పట్టింది ఈ ముష్టి క్లబ్బు సొమ్ము తినడానికి? మా ఆయన లక్షాధికారి. మా ఇంట్లో పారేసిన తిళ్ళతో ముగ్గురు మనుషుల కడుపు నిండుతుంది. అలాంటిది నన్ననడానికి ఎన్ని గుండెలు? అయినా ఈ దిక్కుమాలిన సెక్రెటరీ పోస్టు నాకెందుకులెద్దూ! రాజీనామా చేసి పారేస్తాను.'' విరక్తి నటిస్తూ అందామె.

పక్కనే ఉన్న భజన బృందంలో ఓ స్త్రీ అందుకొంది.

''అమ్మమ్మ, అలా అనకండి కామాక్షమ్మ గారూ మీరు. స్త్రీ లోకాన్ని ఉద్ధరించాల్సిన మీరే ఇలాటి మాటలంటే మా గతి ఏమిటి? ఏవో ఊరకుక్కలు అరుస్తున్నాయని పన్లు మానేస్తామా మనం? మీరు ఈ ఏడాది కూడా సెక్రటరీగా కొనసాగాల్సిందే ...'' కొడుక్కి ఎలాగైనా కామాక్షమ్మ ఫేక్టరీలో ఉద్యోగమిప్పించాలనే తాపత్రయమామెది.

''ఏదో నీలాటివాళ్ళైనా నా శ్రమనర్థం చేసుకొంటున్నారు కాబట్టే ఈ క్లబ్బుకి సెక్రటరీగా సాగాలనుందిస్మీ'' ఈ ఏడాది కూడా సెక్రట్రీ అయితే ఇంకో పట్టు చీర కొట్టెయ్యాలన్న ఆశ కామాక్షమ్మది. ఆస్తులెన్ని ఉన్నా, మొగుడెంత సంపాదించి తెస్తున్నా ఇలా సంస్థల సొమ్మని సొంతఖాతాలో జమ కట్టుకోవడం కొందరి హాబీ.

కార్యక్రమాన్నంతా పర్యవేక్షిస్తూ, ఏర్పాటన్నీ చకచకా పూర్తయ్యేటట్లు చేసిన మధ్యతరగతి మహిళ సుగుణ అక్కడకి వచ్చింది.

''మీరందరూ ఇంకా అలానే నిలబడి ఉన్నారా? ఆరుగంటలకు మీటింగనుకొన్నాం కదా! ఏడుగంటలవ వస్తోంది. ఇంకా స్టార్ట్ కాకపోతే ఎలా? పై ఊర్లనుంచి వచ్చిన డెలిగేట్లకి ఇంకా భోజన ఏర్పాట్లూ అవీ చూడాలి కదా! మీరిక్కడ తీరిగ్గా కబుర్లాడుకుంటున్నారు. అవతల పన్లన్నీ చేయలేక ఛస్తున్నాం మేం. చూడండి సెక్రట్రీ గారూ! మీ ప్రెసిడెంటెప్పుడొస్తుందో ఏమో? సభ కానిచ్చేద్దామా మనం?'' గడగడ అంది.

నోరెత్తలేదెవరూ. ఎదుటివారిలో తప్పులుంటే నిర్మొహమాటంగా ఖండించే సుగుణ అంటే హడల్ అందరికీ.

ఆమె లోపలికి వెళ్ళిపోయాక కామాక్షమ్మ నోరు విప్పింది.

''మరీ బడాయిలు పోతోంది సుగుణ. అక్కడికి తనొక్కర్తే పెద్ద పని చేసేస్తున్నట్లు, మనమంతా గోళ్ళు గిల్లుకు కూర్చుంటున్నట్లూ. ప్రెసిడెంటుగారికి స్వాగతం చెప్పడంకోసం నిలబడ్డామా? ఊరికే నిలబడ్డామా? ఇలాటి వాళ్ళవల్ల మహిళాలోకం బాగుపడదు. చేసే ప్రతి మంచిపనికీ అడ్డుపుల్లలు వేస్తారు వీళ్ళు. వీళ్ళని చెప్పులతో బాదాలి.''

''ఆహా, ఏం చెప్పారండీ! మీ ఆవేశం, ఉద్రేకం చూస్తుంటే లక్ష్మీబాయే గుర్తుకొస్తోంది సుమండీ'' అందుకున్నాయి భజన కంఠాలు.

ఇంతలో జర్రున తెల్లటికారొచ్చి ఆగింది.

పరిగెట్టుకెళ్ళి బ్యాక్‌డోర్ తలుపు తెరిచింది కామాక్షమ్మ.

ఠీవిగా దిగింది మీనాక్షమ్మ. ఆ వెనుక జాయింట్ సెక్రటరీ సులోచన–యువర్స్ మోస్ట్ ఒబీడియంట్‌లా మీనాక్షమ్మ హాండ్ బ్యాగ్ మోసుకొస్తూ.

''నారీలోకాన్ని ఉద్ధరించడానికి వెలసిన మీనాక్షమ్మగారికిదే సుస్వాగతం'' దారి చూపుతూ నాటక ఫక్కీలో అంది కామాక్షమ్మ.

చుట్టూ చేరినవాళ్ళ చప్పట్లు.

అడుగు ముందుకేసింది మీనాక్షమ్మ.

ఆమె ఆ క్లబ్బు ప్రెసిడెంటు మాత్రమే కాదు జిల్లాలో పేరు మోసిన సంఘ సేవిక. ఆమె ఎరగని రాజకీయ నాయకుడు లేడు. ఆమె చెప్తే నిముషాలమీద పనులు జరిగిపోతాయని ప్రతీతి. ఆమెను త్వరలో ఎమ్మెల్సీ చేస్తానని ఓ మంత్రి పుంగవుడు హామీ ఇచ్చాడు కూడా.

మీనాక్షమ్మవల్ల చాలా ఉపకారాలు పొందింది కామాక్షమ్మ. ఫాక్టరీవర్కర్ల స్ట్రైకుని పోలీసుల జులుంతో అణచడంలోనూ, మొగుడు ఇన్‌కమ్‌టాక్స్ దాడుల్లో పట్టుబడితే తప్పించడంలోనూ, కొడుక్కి ఇంజనీరింగ్‌సీటు సంపాదించడంలోనూ మీనాక్షమ్మ సహాయాలు పొందిందామె. అందుకే ఆమె అంటే ఎంతో భక్తి కామాక్షికి.

జాయింట్ సెక్రట్రీ సులోచన అక్కడే ఓ మహిళా కళాశాల లెక్చరరుగా పని చేస్తోంది. త్వరలో ప్రిన్సిపాల్ కావడానికి కృషి చేస్తోందామె. ఆ కాలేజి మేనేజిమెంటు కమిటీ ప్రెసిడెంట్ మీనాక్షమ్మని అన్ని రకాల కాకాలు పడుతోంది సులోచన.

హుందాగా సెంట్రల్ హాల్లో అడుగు పెట్టింది మీనాక్షమ్మ. హాల్లోని ఆడవాళ్ళకబుర్లు ఆగిపోయాయి. అప్రయత్నంగా అందరూ లేచి నిలబడ్డారు. వాళ్ళందర్నీ కూర్చోమన్నట్లు సైగలుచేస్తూ ముందువరస కుర్చీలో కూర్చుందామె. పెంపుడు కుక్కలా పక్కనే కామాక్షమ్మ చేతులు కట్టుకు నిలబడి ఉంది.

వేదిక మీదికి వెళ్ళింది సులోచన. ఓసారి మెడలో లాకెట్‌ని సుతారంగా లాక్కొని, ఎదమీదకి వేసుకొంది.

''ఈ రోజు మనం మహిళా దినోత్సవాన్ని జరుపుకొంటున్నామని మీ కందరికీ తెలుసు. ఎన్నో శ్రమలకోర్చి జిల్లా నలుమూలల నుంచి సోదరీమణులొచ్చినందుకు సంతోషం. మన మహిళాలోకం ప్రస్తుతం అనేక రకాల సమస్యలు ఎదుర్కొంటోంది, ఈ సమస్యలని ఎదుర్కోవడానికి సమర్థవంతమైన నాయకత్వ మవసరం మనకి. పురుషలోకం పైన, దురహంకారం పైన విరుచుకుపడే ఒక శక్తి కావాలి. అటువంటి మహాశక్తి, భద్రకాళి, పురుష ప్రపంచాన్ని చీల్చి చండాడగల అతివా సింహమైన శ్రీమతి మీనాక్షమ్మగారి నాయకత్వం లభించడం మన అదృష్టం. ఆవిడ నాయకత్వంలో మహిళాలోకం పురోగమించాలని కోరుతూ వేదిక మీదకి విచ్చేసి, మనకి కర్తవ్యబోధ చేయమని మన సంఘం తరపున సవినయంగా మనవి చేస్తున్నాను.'' రుమాలుతో మొహం తుడుచుకుంటూ ఎమోషనల్‌గా అంది సులోచన. కరతాళధ్వనులు విన వచ్చాయి.

మత్తగజంలా లేచింది మీనాక్షమ్మ. ఆ వెనుకే ఆమె బ్యాగ్ పట్టుకు కామాక్షమ్మ.

మీనాక్షమ్మ అందరినీ కలియజూస్తూ కుర్చీలో కూర్చోబోతుండగా ఆమె మెడలో గులాబిదండ వేసింది సులోచన. ఆ వెనుకే మరొకామె కామాక్షమ్మకో మల్లెపూల దండ వేసింది. ముందు వరుసలోంచి చప్పట్లు.

''ఊపిరిసలపని ఎన్నోకార్యక్రమాలుంటున్నా మన క్లబ్బుకి ప్రెసిడెంటుగా ఉండి, మనకు మార్గదర్శకత్వం వహిస్తున్న ప్రముఖ స్త్రీ జనోద్ధారిణి మీనాక్షమ్మగారికి చంద్రునికో నూలు పోగులా ఈ చిరుకానుకసమర్పిస్తున్నాను''అంటూ పట్టుచీర నందించింది కామాక్షమ్మ. మళ్లీ చప్పట్లు.

లైట్ల వెలుగుకి గులాబీరంగు పట్టుచీర జిగేలుమంది. అరచెయ్యి మందాన వెండిజరీ తళ తళ లాడుతోంది. కళ్ళతోనే ఖరీదు కట్టిన అనేక జతల కళ్ళు అసూయతో రెప రెపలాడినాయి.

చీరనందుకున్న మీనాక్షమ్మ క్షణకాలంలోనే

## [అసా] మాన్యుడు!

సమాజం
అనే రోడ్డు నిండా
గతుకులు
రాళ్ళుప్పులే
వాటిని
దాటుకుని
పోవాలనుకునేవాడు
సామాన్యుడు!
పూడ్చి
చదునుచేసి
నలుగురూ
నడవడానికి
వీలుగా
బాగుచేసి
పోయేవాడే
మాన్యుడు!!

— 'సింహం'







క్వాలిటీని అంచనా వేసుకొంది. ఆమె కళ్లు సంతృప్తిగా మెరిసాయి.

మైకు దగ్గరకెళ్లింది సులోచన. "ప్రముఖ సంఘ సేవిక, అబలోద్ధారిణి అయిన శ్రీమతి మీనాక్షమ్మగారు తీరిక చేసుకొని మన ఫంక్షన్‌కి వచ్చినందుకు మరోసారి కృతజ్ఞతలు తెలియజేసుకొంటున్నాను. తన అమూల్యమైన సందేశాన్ని ఇవ్వవలసిందిగా కోరుతున్నాను" అంది.

"మాయలాడి. సంగనాచి వేషాలు వేస్తోంది మరీ. మీనాక్షమ్మగారికి తానే దగ్గరైపోవాలని మరీ పొగిడేస్తోంది. తనని కనీసం మైకు దగ్గర కన్నా పిలవలేదు. తానేం మాట్లాడలేదని కోపగించుకొంటుందో ఏమో మీనాక్షమ్మగారు" తల్లడిల్లి పోసాగింది కామాక్షమ్మ.

కామాక్షమ్మ అవస్త చూస్తూ నవ్వుకొంది సులోచన.

"దెబ్బకి డౌనైపోయింది కామాక్షి. మరీ ఆవిడతో గొప్పగా భుజాలు రాసుకొంటూ తిరుగుతోంది. ఈ దెబ్బన మీనాక్షమ్మగారి ఆంతరంగికురాలైపోదూ తాను! ఇక ఆ ప్రిన్సిపాల్ పోస్టు చేతిలో ఉన్నట్లే."

వీళ్ళ వాలకాలు క్రీగంట కనిపెడుతోంది మీనాక్షమ్మ. మైకు దగ్గర కెళ్ళింది. "మన క్లబ్బు ఇలా పురోభివృద్ధి పొందడం నాకు చాలా సంతోషంగా ఉంది. ఈ దినదినాభివృద్ధికి కారణమైన మన సెక్రెటరీ శ్రీమతి కామాక్షమ్మగారు ముందుగా మాట్లాడితే సముచితంగా ఉంటుంది. ఆవిడని మాట్లాడమని కోరుతున్నాను –" అంటూ కూర్చుంది.

సులోచనకి మండిపోయింది. కామాక్షమ్మ ముఖం వెలిగిపోయింది.

ఆమెకి ఛాన్సివ్వడంలో మీనాక్షమ్మ ఎత్తు వేరు. తాను క్లబ్బుకి ఎప్పుడో సంవత్సరానికోసారి చుట్టంలా వచ్చిపోతోంది. మెంబర్లకి మరి తన ఘనత గురించి ఎలా తెలియడం? ఇలాటి వేదికలే కదా మనిషి అంతస్తును పెంచేవి, గొప్పతనాన్ని చాటేవి. ఈ కామాక్షమ్మ తనని బాగా ఎరుగును. తనవల్ల ఎన్నో ఉపకారాలు పొందిందామె. ఇక పొగడక ఏం చేస్తుంది ? తన గురించి వీళ్ళందరి మనస్సుల్లోనూ గొప్పగా ముద్ర పడుతుంది.

మైకు దగ్గరకెళ్ళి నిలబడింది కామాక్షమ్మ. కట్టుకున్న పట్టుచీరజరీ అందరికీ బాగా కనబడాలని భుజం చుట్టూ తిప్పుకొంది. అంతలోనే మెడలో రాళ్ళనెక్లెసు జనానికి ఎక్కడ కనబడకుండా పోతుందోనని పైట యధా ప్రకారంగా వేసుకొంది. గొంతు ఓసారి సర్దుకొని, మీనాక్షమ్మగారి వైపోసారి చూసి, చిరునవ్వు నవ్వి ప్రారంభించింది.

"నేనేదో ఈ క్లబ్బుని అభివృద్ధి చేశానని మీనాక్షమ్మగారంటుంటే నాకు వళ్ళు సిగ్గుతో చచ్చిపోతోంది. చేసేదెవడు, చేయించేదెవడు అని ఆ శ్రీకృష్ణపరమాత్మ అన్నట్లు మనని అందరినీ వెనకనించి నడిపించే ఒక మహామహిమాన్వితమైన శక్తి ఉంది కదా ! ఆ శక్తి రూపమైన శ్రీమతి మీనాక్షమ్మగారి సహాయం లేకపోయినట్లయితే ఈ సంఘం అంగుళమైనా ముందుకు కదిలేది కాదని మీ అందరికీ నేను మనవి చేస్తున్నాను. ఇదిగో, మన మహిళలకు అన్యాయం జరిగిపోతోంది. మగవాళ్ళ ఆగడాలు రోజు రోజుకీ మితిమీరిపోతున్నాయి. ఓ స్త్రీ సంఘాన్ని స్టార్ట్ చేయి. కావలసిన సహాయం నేను చేస్తాను అంటూ వెన్నుతట్టి నన్ను రంగంలోనికి దింపి, మహిళాలోకానికి మణిపూసలా నిలిచి, ఈ క్లబ్బుకి రాష్ట్రస్థాయిలో ఒక గుర్తింపుని తెచ్చిపెట్టినది శ్రీమతి మీనాక్షమ్మగారే అని చెప్పడానికి నేను గర్వపడుతున్నాను..." ఆయాసంగా ఆగింది కామాక్షమ్మ.

సభంతా కరతాళధ్వనులు.

తిరిగి ప్రారంభించింది కామాక్షమ్మ. "అసలావిడ పుట్టడంతోనే స్త్రీ జనోద్ధరణకు కంకణం కట్టుకొంది. గులాబి అంటు సరిగ్గా పాతలేదని పనివాడ్ని కర్రతోకొట్టి, తద్వారా పురుష ప్రపంచం మీద తిరుగుబాటు ప్రకటించింది ఆవిడ ఆరేళ్ళ వయసులోనే. ఆవిడ చిన్నప్పటినుంచీ నాకు తెలిసినందుకు గర్వపడుతున్నాను. ఈ మధ్యనేదో ఆవిడ గురించి తెలుసుకొని, తెలిసీ తెలియని మిడిమిడిజ్ఞానంతో అన్నీ తమకే తెలిసినట్లు మాట్లాడితే సరిపోయిందా? మీనాక్షమ్మగారితో ఇంత చనువుగా వుంటూ తిరుగుతున్న నాకే ఆవిడ చేస్తున్న పరోపకారంలో శతసహస్రపు వంతైనా సరిగ్గా తెలియదే! అలాటిది, నిన్నగాక మొన్న పరిచయమైన వాళ్లకి ఏం తెలుస్తుంది..." దెబ్బ కొట్టానన్నట్లు సులోచన వంక చూసింది కామాక్షమ్మ.

సులోచన ముఖం మాడిపోయింది. కామాక్షమ్మ వర్గీయుల చప్పట్లు.

"మన స్త్రీలోకానికే కిరీటమైన శ్రీమతి మీనాక్షమ్మగారు తమ పన్నెండో ఏటనుంచే మగవారిని దుయ్యబట్టడం ప్రారంభించారు. ఆవిడ తన పదమూడో ఏట రచనలు ప్రారంభించింది. తన పదిహేనవ సంవత్సరంలో..." అనర్గళంగా సాగిపోతోంది కామాక్షమ్మ భజనా రథం.

జరిగేది మహిళాదినోత్సవం. చేసేది మీనాక్షమ్మగారి భజన. క్లబ్బు వార్షికోత్సవమంటే ఏదో కాస్త ఉపయోగపడే మాటలు చెప్తారనుకొన్నాంగానీ ఏమిటీ ప్రైవేట్‌క్లాస్ అని సుగుణలా అనుకుంటున్నవాళ్ళు ఎంతోమంది.

అరగంటసేపు తోమి తోమి ప్రేక్షకుల సహనాన్ని పరీక్షించి విరమించింది కామాక్షమ్మ ఆయాసంగా. అయిదు నిముషాలసేపు ఆగకుండా చప్పట్లు పడినాయి ఈ బోరు ఇంతటితో వదిలినందుకు ఆనందంగా. అవన్నీ తన వాక్చాతుర్యానికే అని కామాక్షమ్మ, తన ఘనతవిని మహిళాలోకం మురిసిపోయిందని మీనాక్షమ్మ సంబరపడ్డం వేరే సంగతి.

సులోచన కోరిన మీదట హుందాగా మైకు దగ్గరకు వెళ్ళింది మీనాక్షమ్మ. గోల్డ్‌ఫ్రేము చత్వారం కళ్ళజోడును సుతారంగా సవరించుకొంది. కుర్చీల్లో కూర్చునున్న ఆడజనాన్ని కలియజూసి, ప్రారంభించిందామె.

"సభాసదులకు నమస్కారం. నేనేదో

గొప్పదాన్నయినట్లు చెప్పారు కామాక్షమ్మగారు. ఇతరుల గొప్పల్ని గుర్తించడం చాలా గొప్ప అని మావో కాబోలు అన్నట్లున్నాడు. అలా శ్రీమతి కామాక్షమ్మగారు నాకు లేనిపోని గొప్పలంటగట్టారు. అది ఆవిడ గొప్ప మనసుకి నిదర్శనం. నిజానికి నేనేమంత పెద్దదాన్నీ,గొప్పదాన్నీ కాదు. కాకపోతే మన మహిళాలోకం బానిస భావాల సంకెళ్ళనుంచి బయటపడ్డానికి కొద్దోగొప్పో కృషి చేస్తున్నానంతే!

దేవుడు సృష్టించడమే ఆడమ్, ఈవ్ అంటే ఆడ, మగల్ని ఒకేసారి సృష్టించాడు కదా! మరి ఈ హెచ్చుతక్కువలేమిటి? మగవాడు తానేదో గొప్ప సృష్టికర్త అయినట్లు, ఆడది బానిస అయినట్లు హీనంగా ఎందుకు చూడాలని ఈ వేదికమీదనుంచి మిమ్మల్ని అడుగుతున్నాను నేను.

''నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి'' అంటూ స్త్రీకి సంకెళ్ళు బిగించాడు మనువు. కార్యేషుదాసీ, శయనేషు రంభా అంటూ స్త్రీకి కొన్ని పరిమితులు నిర్దేశించాడో మగవాడు. చిన్నప్పుడు తండ్రి, తరువాత భర్త, వయసుడిగాక పుత్రుల అదుపాజ్ఞలలో స్త్రీ ఉండాలని సెలవిచ్చాడింకో పెద్దమనిషి. స్త్రీకి నీతులు పరిమితులు అంటూ నిర్దేశించి తానుమాత్రం బలాదూరుగా తిరుగుతున్నాడు మగవాడు. వాటికి అన్యాయంగా బలయిపోతున్నది స్త్రీ.

ఇంటిపనంతా చేస్తూ అలసి ఛస్తుంది ఆడది. ఏదో ఇంత సంపాదించి ఇంట్లో పడేసి, పెళ్ళాన్ని ఇంటికి కుక్కలా కాపలా పెట్టేసి, ఊరిని దున్నేసి, బలాదూరుగా తిరిగివచ్చి అధికారం చెలాయిస్తాడు పురుషుడు. ఏమైనా ఎదురు మాట్లాడబోతే ఇంట్లో కూర్చునుంటే ఒళ్లు కొవ్వెక్కక ఏంచేస్తుందని ఉరిమురిమి చూస్తాడు. అనవసరంగా చేయి చేసుకొంటాడు.

ఎక్కడుందీ లోపం?

ఎండకి కందిపోతావంటూ బయట ప్రపంచం ఏదో తెలియకుండా చేస్తారీ పురుష పుంగవులు. అటూ, ఇటూ కాస్త తిరిగితే చెడిపోతున్నావంటూ పతివ్రతల కథల పుస్తకాలు చేతికిచ్చి చదవమంటారు. ఆ కథలు వ్రాసినదీ మగవారే కదా మరి.

ఈ సమాజంలో పురుషుని స్థానమెంతో స్త్రీ స్థానమూ అంతే. ప్రతి జీవీ మరొక జీవిపైన ఆధారపడినట్లు పురుషునిపైన స్త్రీ, స్త్రీపైన పురుషుడు ఆధారపడి ఉన్నారు కానీ ఒకరు ఎక్కువ మరొకరు తక్కువ కాదు ఎంత మాత్రం.

అందుకే... నాకు కలిగిన ఆవేదనతో... ఎంతోమంది అభాగినుల జీవితాలు పరిశీలించిన నేను... ఎన్నో కన్నీటి కథలు విన్న నేను... పురుషాహంకారానికి బలి అవుతున్న అబలల ఆర్తనాదాలు విని చలించిన నేను... స్త్రీకి

# లోపలి మనుషులు

సమాన హక్కులివ్వండి అని ఆలజడి ప్రారంభించాను. మా హక్కులు మీరిచ్చేదేమిటి, మేమే సాధించుకొంటాం – అని ఇలాటి విమెన్స్ లిబ్ క్లబ్బులు స్థాపించడానికి కృషి చేశాను. ఊరూరా మహిళలలో చైతన్యం వెల్లివిరియడానికి నా జీవితాంతం చేయాల్సినదంతా శక్తివంచన లేకుండా చేస్తాను.

నా స్త్రీ లోకాన్ని ఈ బానిసత్వపు సంకెళ్ల నుంచి విముక్తి కావిస్తానని ప్రతిన చేస్తున్నాను స్త్రీ సహకారం లేనిదే పురుషుడు మనలేడని నిరూపిస్తాను. స్త్రీ అంటే ఆటబొమ్మ కాదు– ఆదిశక్తని చాటిచెప్తాను.''

మంత్రముగ్ధుల్లా వింటున్న శ్రోతలలో చైతన్యం వచ్చింది. ఎడతెరిపిలేకుండా కరతాళ ధ్వనులు చేసారు.

''ఈ ఉత్సాహం... ఈ నవ్యోత్సాహమే కొనసాగాలి సోదరీమణులారా మీలో...'' తిరిగి అందుకొంది మీనాక్షమ్మ.

''ప్రతి స్త్రీ ఒక విప్లవకారిణి కావాలి. నా సంసారం, నా పిల్లలు అనే సంకుచిత బంధాల నుంచి బయటపడాలి. మగవాడి మీద తిరుగుబాటు జండా ఎగరెయ్యాలి. ఆడబిడ్డని కన్నప్పుడు న్యూనత చెందరాదు. ఆడపిల్లని కూడా మగవాడితో సమానంగా పెంచాలి. ఆమెలో బానిస భావాలు నాటరాదు. అప్పుడే కనీసం ఈ తరానికి కాకపోయినా వచ్చే తరానికైనా స్త్రీకి సంపూర్ణ స్వాతంత్ర్యం సిద్ధిస్తుంది...''

ప్రచండ వేగంతో సాగుతున్న ప్రవాహంలా దొర్లిపోతున్నాయి మీనాక్షమ్మ కంఠంలోంచి పదాలు—పదాలు వాక్యాలై, వాక్యాలు వరదలై ముంచేస్తుంటే ఆ ఉధృతికి తట్టుకోలేక ఉక్కిరిబిక్కిరవుతున్నారు ఆడవాళ్లు – వాళ్ల కనుల ముందు ఏవో నూతన ద్వారాలు తెరుచుకుంటున్నట్లుంది. వాళ్ల మెదళ్లు తీవ్రంగా ఆలోచించసాగినాయి, వాళ్ల రక్తం ఉడుకులెత్తసాగింది.

పురుషాహంకారం గురించి, స్త్రీ కర్తవ్యం గురించి గంటసేపు ఆవేశంగా మాట్లాడింది మీనాక్షమ్మ.

మీటింగంతా అయిపోగానే అదోరకం ఆవేశంలో బయటపడ్డారు మగువలందరూ. కామాక్షమ్మ, సులోచనలు మీనాక్షమ్మను సాగనంపే హడావిడిలో ఉన్నారు. పనివాళ్లు లైట్లూ కుర్చీలు తీస్తున్నారు.

పై ఊళ్ల నుంచి వచ్చిన డెలిగేట్లకి భోజనాల ఏర్పాట్లు పూర్తయిన తరువాత ఇంటికి బయలుదేరింది సుగుణ.

ఆమె మెదడులో ఆలోచనల హోరు.

ఎంత చక్కగా చెప్పింది మీనాక్షమ్మగారు. మగవాడి దౌర్జన్యం గురించి ఎంత సునిశితంగా వివరించి చెప్పింది. స్త్రీల కన్యాయాలు జరిగిపోతున్నాయని వాళ్లూ వీళ్లూ అంటుంటే వినటమేగాని తనకంతగా తెలియదు. తన భర్త కాబోలనుకుంది తాను. కానీ ఇంత తరచి చూడ లేదు ఎన్నడూ.

అయితే పురుషుడు చూపించే ప్రేమా, ఆప్యాయతా ఒట్టి నటన అన్నమాట. తన భర్త తననేదో పెద్ద ప్రేమగా చూస్తున్నాడని ఇన్నాళ్లూ తాననుకొంది గానీ, ఆ ప్రేమ వెనుక ఇంత కపట నాటకం ఉందన్నమాట.

గుణా, నీ చేత్తో బ్రష్ ఇవ్వకపోతే పళ్ళు తోముకున్నట్లుండదు. నువ్వు వీపు రుద్దకపోతే స్నానం చేసినట్లుండదు. నువ్వు అందంగా ముస్తాబై ఉండకపోతే ఏమీ తోచదు అని భర్త తనని అడుగడుగునా ఉబ్బేస్తూ ఉంటె అబ్బ, మా శ్రీవారికి నేనంటే ఎంత ప్రేమ అని తాను పొంగిపోయింది. ఆ ఒట్టొట్టి ప్రేమకి కారణం తన పనులన్నీ శ్రమ లేకుండా జరిగిపోవాలనే! పురుష స్వార్థం అని తాను పోల్చుకోలేకపోయింది ఇన్నాళ్ళూ. ఇకనుంచీ ఈయనగారి ఆటలు తన దగ్గర సాగితే కద!

ఆవేశంగా అనుకొంటూ ఇల్లు చేరింది సుగుణ. ఇంట్లో పుస్తకాలముందు కునికిపాట్లు పడుతూ పిల్లలూ, వాలు కుర్చీలో నవల చదువుకొంటూ భర్త.

ఆమె వచ్చిన అలికిడి వినగానే తలెత్తారందరూ.

''అలా ఉన్నావేమిటి గుణా? ఆ క్లబ్బులో లేనిపోని పనులు నెత్తిన వేసుకున్నావా ఏమిటి? ముఖమంతా ఎలా వాడిపోయిందో చూడు. నీ కనవసరం కాదూ ఈ గొడవలన్నీ'' ఆత్రుతగా దగ్గరకొచ్చాడు భర్త. పక్కనే పిల్లలు.

ఆమె ఏమీ మాట్లాడక మౌనంగా ముఖం కడుక్కుని, తుడుచుకొంటూ వంటింటిలోకి వెళ్ళింది. తాను వండిన పదార్థాలలానే ఉన్నాయి. అంటే పెట్టుకు తినలేదన్న మాట భర్తా పిల్లలూ, తాను తినేసి, పిల్లలకి పెట్టెయ్యొచ్చుగా భర్త.

ఉహుః అలా చెయ్యడు. ఇక్కడ కూడా పురుషాధిక్యతే. ఆడదే అన్నీ అమర్చి పెడితే తీరిగ్గా తింటారు మగరాయుళ్ళు. ఎక్కడో పనిమీద తిరిగి అలసి సొలసి వచ్చినా ముందుగా మగవాడి అవసరాలు తీర్చాలి ఆడది.

హుః. ఏం మగవాళ్ళు?

వంటింట్లోకొచ్చిన భర్త అంటున్నాడు. ''ఎందుకంత మూడీగా ఉన్నావు గుణా! క్లబ్బులో ఏమయ్యిందేమిటి? మీటింగంత లేటేమిటి? నువ్విప్పుడొస్తావు. ఇప్పుడొస్తావు అని అన్నాలు తినక కూర్చున్నాం మేం. నువ్వు వేగం కంచాలేసెయి. నేను మంచినీళ్ళమరుస్తాను; ఆకలి ఛంపేస్తుంది'' మంచినీళ్ళ బిందెవైపు వెళ్తూ అన్నాడతను.

మరి నిగ్రహించుకోలేక పోయింది సుగుణ.

''గొప్ప మగవాళ్ళండీ మీరు. అక్కడికేదో పెద్ద అభిమానం ఒలికిపోతున్నట్లు ఎందుకా తీపి మాటలు? అన్నం పెట్టుకోడానికి

బద్ధకమై పెట్టుకోలేదనవచ్చుగా. మగాడు ఊరంతా తిరిగి రాగానే వెంటనే అమర్చి పెట్టాలి కదా ఆడది. అలానే ఆడది కూడా 'ఎప్పుడైనా బయటకి వెళ్ళి అలసి ఇంటికొచ్చినపుడు అమర్చి పెట్టొచ్చు కదా. మీరు.

ఉహుం, అలా చెయ్యరు మీరు. అలా చెయ్యడానికి నామోషి మీకు. పనులతో ఎంత నలిగిపోతున్నా అన్ని పనులూ ఆడదే చెయ్యాలి. మీ దృష్టిలో స్త్రీ బానిస. మగవాడి అవసరాలు తీర్చడం కోసం భ గ వం తు డు సృష్టించిన గానుగెద్దు భార్య మీకు''. ఆవేశంగా అంది.

వింతగా చూసాడు అతను.

''ఛ...ఛ... నేనా ఉద్దేశ్యంతో అనలేదు గుణా. ప్రామిస్. నిజంగా నాకంత ఆలోచన తట్టలేదు. పోనీ, నువ్వలా కూర్చో, నేనే అన్నీ అమరుస్తా.''

''ఈ దొంగ వేషాలన్నీ నా దగ్గర్నా? మీ మగవారి సంగతి ఎవరికి తెలియదు? గోరంత పని చేసి కొండంతలుగా చెప్తారు. మీ పురుషాహంకారానికి స్వస్తి వాచకం పాడేస్తాం మా స్త్రీలం. అందుకు ఇప్పట్నుంచే ప్రారంభం. ఇకనుంచి ఇంటి పనులన్నీ వంతులవారీగా జరిగి తీరాలి. అంతే! ఆఁ'' విసవిసా నడుస్తూ పడక గదిలోకి దూరి దుప్పటి బిగించింది సుగుణ.

నిశ్చేష్టులై చూ స్తూ ౦ డి పో యా రు అతనూ, పిల్లలూ.

ఆదే సమయాన —

అలంకరాలన్నీ తీసేస్తూ, డ్రస్సింగ్ టేబిల్ దగ్గర నిలబడింది కామాక్షమ్మ. జరిగిన సంఘటనలన్నీ నెమరు వేసుకొంటుంటే హాస్యం నాట్యమాడుతోందామె పెదవులపైన చిన్నగా.

తలుపులు తెరుచుకు గదిలో అడుగు పెట్టాడు భర్త.

''ఫంక్షన్ సక్సెసేనా కామాక్షీ? మన కంట్రాక్ట్ గురించి చెప్పావా మీ పత్రివతికి. ఊరికే ఆడవాళ్ళ హక్కులంటూ విరగబడుతోంది కదూ!'' వ్యంగ్యంగా అన్నాడతను.

చురుగ్గా చూసింది కామాక్షమ్మ. ''ఏం మా ఆడవాళ్ళకు హక్కులొద్దంటారా? అధికారమంతా మీ మగవాళ్ళే ఉంచుకుంటారా?''

''ఓహో, ఉపన్యాసాల సారమంతా తలకెక్కిందన్నమాట అమ్మగారికి. నామీద స్వారీ చేద్దామనుకుంటున్నావు కాబోలు. నరికేస్తాను'' వెనక్కి తిరిగాడతను.

పని పూర్తయితే అతను కొంటానని ప్రామిస్ చేసిన వడ్డాణం గుర్తుకొచ్చింది కామాక్షమ్మకి. ఛప్పున వెళ్ళి భర్త భుజం మీద వెనకనుంచి చేతులేసింది ప్రేమగా.

''... అని నేనన్నానా ఏమిటి? ఆ ముదనష్టపు మీనాక్షి అందని మీకు చెప్తుంటే అంతలోనే కోపమొచ్చేసింది అయ్యగారికి. అయినా ఆడదానికి వేరే హక్కులేమిటండీ నా బొంద. భర్త చల్లని నీడా, ఆయన ఆలనా పాలనా కన్నా ఆడదానికి కావాల్సినదేమున్నది ఈ లోకంలో.'' భర్తను డైనింగు రూము వైపు నడిపిస్తూ అందామె.

చల్లబడ్డాడతను. భార్య బుగ్గపై ప్రేమగా చిటికేశాడు.

సులోచన ఇంట్లో—

''ఏమే వ గ లా డీ! అయ్యాయా నీ పెత్తనాలు? మొగుడనేవాడు ఆకలితోపడున్నాడనే జ్ఞానమైనా ఉందా నీకు? కనీసం అన్నమైనా వండకుండా చెక్కేసావే! ఏం రాచకార్యాలు వెలగబెట్టావు? ఏ రంకు మొగుడి పక్కలో పడుకున్నావు'' భార్యను గుమ్మంలో నిలబెట్టి, కేకలేస్తున్నాడు తాగుబోతు భర్త.

అతన్ని మవునంగా దాటుకొని, లోనికెళ్ళింధి సులోచన.

అతనూ ఆమె వెనకనే నడుస్తూ, విసురుగా జడ పట్టుకు వెనక్కు లాగాడు. ఆమె అధాటున అతనిపైన పడింది.

''మీకెందుకు చెప్పు సులోచనా సమాన హక్కులు? చక్కగా మొగుడితో కాపురం చేస్తూ పిల్లల్నికంటూ వాడిమాట వింటూ పడుండక. అనవసరంగా ఆ క్లబ్బుల వెంబడి పరిగెడుతున్నావు. నేను నీకేం లోపం చేస్తున్నానో చెప్పు'' వెకిలిగా నవ్వుతూ ఆమెని చుట్టేసాడు అతను.

''అబ్బ, ఊరుకోండి. నేనేం సమాన హక్కులు కావాలని ఏడ్చుకొంటూ క్లబ్బుల కెళ్ళడంలేదు. ఈ ముష్టి లెక్చరర్ ఉద్యోగం వదిలి ప్రిన్సిపాల్ పోస్ట్ పొందాలనే కదా ఈ తాపత్రయమంతా! ఆ మీనాక్షమ్మగారిని కాస్త కాకాపడితే మన పంట పండుతుందనే ఈ శ్రమంతా! అయినా నాకేం తక్కువని కొత్తగా హక్కులు కావాలనడం? మీరలా కూర్చోండి. చిటికెలో వండేస్తాను'' బియ్యం కడిగి గ్యాస్ స్టవ్వు పైన పడేస్తూ అంది సులోచన.

నడుంమీద రెండు చేతులూ పెట్టుకు నవ్వుకున్నాడు భర్త.

* * *

మంత్రిగారికి విస్కీగ్లాసు అందిస్తూ, పక్కన కూర్చుంది మీనాక్షమ్మ.

''ఏంటోయ్ మీనాక్షీ. కొన్నాళ్ళకి మా పదవులు ఊడబెరికేటట్లున్నావే! స్త్రీలని మామీద దండయాత్ర చేయిస్తావా ఏం'' నవ్వుతూ అన్నారు మంత్రివర్యులు.

''ఛ. ఊరుకోండీ. ఎవరైనా వింటే నవ్వి పోగలరు. మగవాడెక్కడ? ఆడదెక్కడ? నక్కకీ నాగలోకానికీ ఉన్నంత తేడా కాదూ. ఏదో కాస్త వెనక బలం ఉంటే మంచిదని వీళ్ళని రెచ్చగొడుతున్నానేకాని, ఎన్ని జన్మలెత్తినా మగవాడిలా కాగలదా ఆడది? అసలు దేవుడు ఆడదాన్నెందుకు సృష్టించాడండీ! మగవాడికి సేవ చేస్తూ మగవాడనే మహావృక్షం నీడలో హాయిగా విశ్రాంతి తీసుకోమని కాదూ. అయినా మీకు తెలియకనా నన్నడుగుతారు'' అతని మెడ చుట్టూ చేయివేసి దగ్గరకు తీసుకుంది మీనాక్షమ్మ. ★



# వ్యక్తిగతం



1982వ సంవత్సరానికి నోబెల్ అవార్డు పొందిన సెనగాల్ మాజీ అధ్యక్షుడు డా. లియోపోల్డ్ సెదార్ సెన్‌ఘార్ ఒక కవి. ఈయన అంతర్జాతీయ అవగాహన, శాంతి, సహకారం, సౌభ్రాతృత్వాల కోసం పాటుపడటమే కాకుండా కవిత్వం, సాహిత్యం సంస్కృతుల అభివృద్ధికి కూడా ఎంతో కృషి చేశారు ...



ఆస్ట్రియా మాజీ ఛాన్సలర్ డా. బ్రూనోక్రిస్కీకి 1983వ సంవత్సరానికి నెహ్రూ అవార్డు లభించింది. జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలలో ఈయన ప్రముఖ పాత్ర నిర్వహించారు. బలప్రయోగంతో కూడిన రాజకీయాలని, ఆయుధ సేకరణని తీవ్రంగా వ్యతిరేకించేవారిలో ఈయన ఒకరు ...



నటి జూలీ వాల్టర్స్ నగ్నంగా స్నానం చేస్తున్నట్టు చూపే దృశ్యం వచ్చింది. నటీనటుల సంఘం వారి నిబంధనల ప్రకారం ఒకరు మొండిమొలగా ఉంటే అందరూ బట్టలు విప్పవలసిందే అని ఆమె అన్నారు. అటువంటి నిబంధన అసలు ఉందో లేదో తెలుసుకోవటానికి నటి జూలీ వాల్టర్స్ ఇచ్చిన ఒక టెలిఫోన్ నెంబరుకి ఫోన్ చేసి అడిగారు మిగతావారు. "ఉంది" అని అవతల వారు చెప్పారు. కెమెరామాన్ మాత్రం అన్ని బట్టలూ ఊడతీస్తే మిగతావారు అండర్‌వియర్‌లలో తమ విధులు నిర్వహించారు. అంతా అయిన తరువాత తేలింది ఏమిటంటే— నిబంధన ఉంది అన్న వ్యక్తి తన స్నేహితురాలు జూలీ వాల్టర్స్‌తో కలిసి అందరినీ ఆట పట్టించారు, అసలు నిబంధన లేదు— అని ...




**29–6–1984 శుక్రవారం మొదలు 5–7–1984 గురువారం వరకు**

♈ **మేషం:** చాల మంది విషయంలో నూతన వృత్తి చేపట్టు అవకాశమున్నది. వృత్తియందు వికాసం కూడా కనిపిస్తుంది. ప్రయాణ సన్నాహాలకు అవకాశమున్నది. స్త్రీలకు అధికారమందభివృద్ధి, ప్రజా రంగంలో ప్రసిద్ధి.

♉ **వృషభం:** మీకు సాధారణంగా లభ్యమయ్యే ఆదాయమందు అభివృద్ధి కనిపిస్తుంది. నూతనాంశాలు గ్రహిస్తారు. వ్యవహార జ్ఞానం మీకే ఆదాయం లభ్యమయ్యేలాగు కనిపిస్తుంది. స్త్రీలకు: కొందరకు 'ట్రాన్స్ఫరు' కు అవకాశం, మరి కొందరకు గృహ మార్పు చేకూరుతుంది.

♊ **మిధునం:** ప్రభుత్వం మూలంగా ఏవైనా పనులు జరుగవలెనంటే, యిదే మంచి సమయం, యత్నించండి. మీ సంతానం కొరకుగా మీరు చేసే ప్రయత్నాలు ఫలవంతం కాగలవు. స్త్రీలకు: వృత్తియందభివృద్ధి, శుభకార్య ప్రస్తావనలకు అవకాశమున్నది, గ్రహించాలి.

♋ **కర్కాటకం:** శ్రమదాయక వారం. ఎంత జాగరూకత వహిస్తే అంత మంచిది. ధనలబ్ధికి అవకాశం, గృహ వసతి ఏర్పడే మార్గం, అమూల్య వస్తు సేకరణకు అవకాశం లభ్యం కాగలదు. వ్యాపార నిమిత్తమై కొందరు దూర ప్రాంతాలకు ప్రయాణించుట చెప్పదగిన అంశం. స్త్రీలకు: అవసరాలకు ద్రవ్యం అందటం, శుభ ప్రస్తావనలకు అవకాశం గలవారం.

♌ **సింహం:** మీకు గల ప్రతిభా సంపత్తి వృత్తియందు పెంపు కలుగజేస్తుంది. వారమంతా ఆదాయానికి లోటు లేదు. విలువగల వస్తువులు సంపాదించుకొంటారు. వ్యవహార రీత్యా మేలు పొందనున్నారు. గమనించండి. స్త్రీలకు: చిన్న చిన్న పనులు జరుగక యిబ్బంది పడటం చెప్పదగిన అంశం

♍ **కన్య:** ఎవరు కానివారో, ఎవరు మనవారో, ఎవరివలన మేలు చేకూరుతుందో గమనించదగిన సమయం. వ్యాపార నిమిత్తం చాల మందికి ప్రయాణాలు చెప్పదగిన అంశం. స్త్రీలకు. ఇంటి వ్యవహారాలతో సతమతం కావటం, వృత్తియందు పెంపు కనిపించటం, రాజకీయంగా మేలు సంభవించటం, చెప్పదగిన ముఖ్యాంశాలు.

♎ **తుల:** అధికారుల ఆదరణ, ఆరంభించిన కార్యం ముగింపు. అవసరాలకు ద్రవ్యమందటం. అప్రయత్నంగా ధనలబ్ధికి అవకాశం గలవారం. శ్రమించితే ఎంతో మేలు పొందగలుగుతారు. స్త్రీలకు. ఆరోగ్య లోపం, అధికారుల ఆగ్రహానికి గురికావలసిన పరిస్థితులుంటాయి.

♏ **వృశ్చికం:** ఆర్జించిన ద్రవ్యాన్ని ఎలా ఖర్చు చేయాలో ఆలోచించి కాలం అంటే వారం వ్యయించగలరు. మిత్రాదరణకు అవకాశం గల వారం. ప్రత్యర్థుల గొడవ జాస్తి అవుతుందేమో ఆలోచించి మెలగండి. స్త్రీలకు: మాట చెలామణీకి ఉద్యోగాభివృద్ధికి, ధనలబ్ధికి అవకాశం గల వారం.

♐ **ధనుస్సు:** బంధువులతో గాని, మిత్రులతో గాని, కడకు పరిచితులతో గాని మాట పట్టింపు రాకుండా చూచుకోవాలి. చాల కాలంగా వసూలు కాని ద్రవ్యం అందటం, అవసరాలు తీరటం జరుగుతుంది. స్త్రీలకు: ఉద్యోగమందు పెంపు. రంగస్థల, చిత్ర రంగానుభవం గల వారికి మంచి అవకాశాలుంటాయి.

♑ **మకరం:** వ్యాపార లాభం గడించటానికి, వ్యవహారం ఏదయినా ఉంటే పరిష్కరింపబడుటకు రాజకీయంగా సదవకాశాలు లభించుటకు, నూతనాంశాలు గ్రహించుటకు అవకాశం గల వారం. స్త్రీలకు: యత్న కార్య విజయం, వాహన సేకరణకు అవకాశం గల వారం.

♒ **కుంభం:** 'వారం వారం యింతేనా?' అని అనుకోవద్దు. సర్వానుకూలత చేకూరే సమయం. రాజకీయంగా బాగా మేలు చేకూరుతుంది. ప్రభుత్వాన్నుండి రావలసిన ద్రవ్యం అందుకోవటం విశేషమే. స్త్రీలకు అనుకొనని మార్గాన ద్రవ్యాదాయం చేకూరుతుంది.

♓ **మీనం:** ప్రజ్ఞా విశేషం ప్రకాశింపగల వారం. అధికారం అభివృద్ధి నందగల సమయం. మీ సహాయం అర్థించే పరిచితులుంటారు. వారికై శ్రమించుట అవసరం గదా! ఆదాయం గల వారం. స్త్రీలకు: ఉద్యోగ యత్నాలు ఫలవంతం కాగలవు. వృత్తియందు పెంపు కనిపిస్తుంది, గ్రహించాలి.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# పరాజయం పొందిన హింసా - రాజకీయాలు



సిక్కు తీవ్రవాద నాయకుడు సంత్ జర్నెయిల్ సింగ్ భింద్రన్‌వాలె అమృత్‌సర్‌లోని బంగారు గుడిలో మృతి చెందారు. ఈయన ఎలా మరణించిందీ తెలియలేదు. బులెట్ గాయాలతో ఉన్న ఆయన మృతదేహం భద్రతా దళాలకి బంగారు గుడిలో ఒకచోట కనిపించింది.

ఎక్కడైనా, ఎప్పుడైనా హింసని ప్రోత్సహించే రాజకీయాలు ఎల్లకాలం సాగవని ఈ సంఘటన నిరూపిస్తుంది చరిత్రలో ఎంతో మంది హింసా మార్గాన్ని అవలంబించి కొంత కాలంపాటు ఎదురులేకుండా తమ పలుకుబడిని పెంచుకున్నా చివరికి ఘోర పరాజయంపాలు కావటం ఎన్నోచోట్ల మనకి కనిపిస్తుంది

సంత్ జర్నెయిల్ సింగ్ భింద్రన్‌వాలె, ఆయన అనుచరులు దేశాన్ని, ముఖ్యంగా పంజాబ్‌ని భయాందోళనలలో ముంచెత్తారు. ఎందరో అమాయకులని, గృహిణులని, చిన్నపిల్లలని కూడా హతమార్చారు ప్రఖ్యాత పత్రికా రచయితలు, సంపాదకులు లాలా జగత్‌నారాయణ్, ఆయన కుమారుదు రమేష్ చందర్‌లని అమానుషంగా హత్య చేశారు. ఒక పోలీసు సూపరింటెండెంట్‌ని సకుటుంబంగా అంతమొందించారు. మన్‌చందాని, జనతా నాయకుడు ఓంప్రకాష్ బగ్గాని కాల్చిచంపారు. ఎన్నో గృహ దహనాలు, దోపిడీలు చేసి బీభత్సాన్ని సృష్టించారు. పవిత్రమైన గురుద్వారాలని ఆయుధాగారాలుగా మార్చి, మారణహోమానికి స్థావరాలుగా ఉపయోగించుకున్నారు.

మతోన్మాదులైన ఈ తీవ్రవాదులలో ఖలిస్తాన్ కావాలనే అపసరణవాదులు, రాజ్యాంగాన్ని మార్చి శిక్కులకి ప్రత్యేక సదుపాయాలూ, రక్షణలు కల్పించాలనికోనేవారూ ఉన్నారు. దేశ సమైక్యతని దెబ్బతీసే ఈ తీవ్రవాదులకి బయటనించి ఆయుధాలు, మందుగుండు అందటంలో ఆశ్చర్యంలేదు బంగారు గుడిలో పట్టుబడిన అత్యాధునికమైన ఆయుధాలని కూడా వీరు సేకరించడం ఆశ్చర్యకరమైన విషయం.

అంతకంతకీ పెరిగిపోతున్న ఈ తీవ్రవాదుల దురాగతాలకి భరతవాక్యం పలకడానికి ప్రభుత్వం భద్రతాదళాల సహాయం కోరక తప్పలేదు. తమకి అప్పగించిన బాధ్యతని భద్రతాదళాలు ఎంతో నిబ్బరంతో, చాకచక్యంతో వ్యవహరించి నెరవేర్చడం ప్రశంసనీయం.

37 ఏళ్ళకే మరణాన్ని కోరితెచ్చుకున్న భింద్రన్‌వాలె చాలా కొద్దికాలంలోనే సిక్కులలో ఒక వర్గాన్ని తన చెప్పుచేతలలోకి తెచ్చుకున్నాడు. హింసని ప్రబోధించడమే కాకుండా ఆచరణలో పెట్టాడు. హిందూమతానికి చెందినవారిమీదే కాక తన మతానికి చెందిన వారిపై కూడా ద్వేషాన్ని పెంచుకున్నాడు. ఆ రాష్ట్రంలోని వర్గ రాజకీయాలు భింద్రన్‌కి బాగా తోడ్పడ్డాయి. తీవ్రవాదులకు ఎదురు లేని నాయకుడిగా ఆదినుంచీ ఆయన హింసా రాజకీయాలని ప్రోత్సహిస్తూ, అటు ప్రభుత్వానికీ, ఇటు ప్రజలకి కంటకుడిగా తయారైనాడు. పంజాబ్‌ని అగ్ని గుండంగా మార్చి మారణ హోమాన్ని సాగించాడు. మొదట్లో తనని ప్రోత్సహించిన వారిపైనే ధ్వజమెత్తి తన భస్మాసురహస్తం పరిధిని అంతకంతకీ విస్తృతం చేయడం ప్రారంభించాడు. చివరికి తనే అకాలంగా కాలగర్భంలో కలిసిపోయాడు.

స్వల్పకాలిక ప్రయోజనాల కోసం రాజకీయవాదులు మత శక్తులతో చేతులు కలపడంవల్ల కలిగే ఫలితాలు ఎంత దారుణంగా ఉంటాయో దీనివల్ల స్పష్టమవుతున్నది. వీటివల్ల దేశానికి కలిగే నష్టం అపారమైనది. భవిష్యత్తులో మరి కొందరు భింద్రన్‌వాలెలు ఉద్భవించకుండా చూడాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

పంజాబ్ ఖొమేనీగా పేరుపొందిన సంత్ జర్నెయిల్ సింగ్ భింద్రన్‌వాలె తన ధైర్య సాహసాలని, నాయకత్వ లక్షణాలని, రాజకీయ చాతుర్యాన్ని హింసా మార్గంవైపు కాకుండా అహింసా పద్ధతులవైపు మళ్లించి ఉంటే ఫలితం మరో రూపంలో ఉండి ఉండేది.

(8—6—84) — మా ★






( గత సంచిక తరువాయి )

"అమ్మా ! అక్క నిన్న రాత్రనగా వెళ్లింది యింకా రాలేదు. ఆ మోహిని యింటికి వెళ్లి అడిగి వస్తాను." అంటున్న చిన్న కూతురి వైపు భయంగా చూసింది. ఆ చూపుకి భాష్యం చెప్పలేక వెనుదిరిగి గబగబ వీధిలోకి నడిచింది ఆరతి.

ఎనిమిది గంటల ప్రాంతంలో నిస్త్రాణగా వచ్చిన ఆరతి తల్లి చూపులు తూపుల్లా శరీరాన్ని తాకుతుంటే సమాధానం లేని ఆ ప్రశ్నలకు ఒకటే రాజీలా తల్లిని చుట్టుకొని బావురుమంది ఆరతి. "అనుకొన్నంత అయ్యిందమ్మా" అంటూ. ఆ మాట వింటూనే స్పృహ తప్పిపోయిన తల్లిని మెల్లగ తీసుకు వెళ్లి మంచంమీద పడుకోబెట్టి నీళ్ల చల్లింది. కాస్సేపటికి తెలివి వచ్చిన భైరవి ... "నేనెందుకింకా చనిపోలేదు ! భగవంతుడా !" అని రోధిస్తుంటే ప్రక్కనే కూర్చుని తడారిపోయిన కళ్లతో శూన్యంలోకి చూస్తున్న ఆరతికి మోహిని మాటలు గుర్తు వచ్చాయి.

"మీ యింట్లో ఏదో గొడవయ్యిందటగా ! నువ్వు పొమ్మన్నావట. యిపుడు పిలవడానికి వచ్చావా ? అయినా పెద్ద, చిన్న లేకుండా ఆ పెత్తన మేమిటి. నీకెంత హక్కుందో దానికీ అంతే హక్కుంది ఆ యింట్లో... అటువంటిది నువ్వు పొమ్మంటే అభిమానం కలది ఏం చేస్తుంది ? అది ప్రేమించిన వాడితో హాయిగ వెళ్లిపోయింది. యింక నీదేలే ఆస్తి. యింకానయం ఆ రాజేష్ చేరదీసి, ఊరడించి తనతో తీసుకు వెళ్లాడు కనక సరిపోయింది లేకపోతే ఈసరికి మీ అక్కకు అంత్య క్రియలు చేసే దానివి ..." ఈసడింపుగి, వేళాకోళంగా అంటున్న ఆ మాటలన్నీ భరించింది. యింక వినాల్సిందేం లేదని తెలిసాక వెనుదిరిగింది.

"వాళ్లు ఎక్కడికి వెళ్లారో తెలుసా ?" ఏదో ఆశ ముందడుగు పడకుండా అడిగించింది.

"ప్రేమ పక్షులకీ గూడేమిటి ? చోటేమిటి ? ఎక్కడికన్నా స్వేచ్ఛగా ఎగిరిపోవచ్చు..." వెకిలిగా నవ్వుతూ అంటున్న మోహిని చంప పగలగొట్టాలన్న ఆవేశాన్ని అణచుకొని వచ్చేసింది.

"ఊరుకోమ్మా... భగవంతుడు మనల్ని పరీక్షిస్తున్నాడు. దీనికి తట్టుకొనే ధైర్యాన్ని సమకూర్చుకోవాలి గాని, నువ్వే యిలా బేలయ్యైతే, నా సంగతి ఏమిటమ్మా !" తల్లి తల నిమురుతూ నెమ్మదిగా ఊరడిస్తుంటే...

"ఆర్తీ ! మీ నాన్నగారు అందర్ని దురదృష్టవంతుల్ని చేసి ఆయన మాత్రం అదృష్టవంతులైపోయారు. యింకా నేనెన్ని వినాలో ఎన్ని యాతనలుపడి ఈ జీవితం ముగించాలో ! నీ ప్రాణానికి మేము గుదిబండల్లా తయారయ్యాము." అంటున్న తల్లినోరు మూసేసింది. ఆ రాత్రి శివరాత్రే అయ్యింది ఆరతికి. రాజాకి ఉత్తరం వ్రాసింది కూర్చుని.

"రాజా నీరాక నాకు ఉపశమనం కలిగించాలి ! అంతే !" అనుకొంటూ మంచం మీద వాలింది.

* * *

"రాజా ! నీకేదో ఉత్తరం వచ్చింది చూడు !" అంటూ అందించాడు రాజారావు.

ఆత్రంగా చదువుకొంటున్న కొడుకుని చూసి.. "ఎక్కడి నుండి, ఆరతి వ్రాసిందేనా ?" తాపీగా అడిగాడు.

"అవున్నాన్నా ! నేను అర్జంటుగా వైజాగ్ వెళ్లాలి!" ఆందోళనగా అంటున్న రాజా మాటలకు.

"బాగుంది ! ఆ పిల్ల రమ్మని వ్రాయడం, నువ్వు పరుగెత్తడం. వచ్చి వారమన్నా కాలేదు. అపుడే ఏం కొంప మునిగిందట. అయినా, రాజా నీ పద్ధతి నాకేం నచ్చడం లేదు" కాఫీ గ్లాసుతో వచ్చిన తల్లి కంఠం ఖంగుమంది.

"అమ్మా !" దెబ్బతిన్న లేడిలా విలవిల్లాడు రాజా !

"అవును రాజా ! నీతో ఈ విషయం చెప్దామనుకొంటూనే వాయిదా వేసాను. అక్కడున్నవాళ్లు ఏదో పాత పరిచయస్థులు కదాని అపుడపుడు పలకరించవచ్చు. కానీ శలవులు గడపాలని వచ్చిన నీకు ఆ అమ్మాయి లెటర్స్ వ్రాయడం నువ్వు రీయక్ట్ అవడం, వెళ్తాననడం బాగులేదు. నీకు పెళ్లి కావలసి చెల్లెళ్లు ఉన్నారు. నువ్వేదో అనుకొంటున్నావేమో ! నీ యిష్టం వచ్చినట్లు నువ్వు ప్రవర్తిస్తే ఈ యింట్లో అందర్ని బాధించిన వాడివౌతావు. చిన్నపిల్లడివి కాదు పదే పదే చెప్పించుకొందుకి !" గంభీరంగా అంటున్న తండ్రి మాటలకు ...

"అదికాదు నాన్నా !" అంటూ సమాధానం చెప్పబోతున్న కొడుకుని ...

"ఏది కాదురా ! వాళ్ళు నిన్ను బాగా వల్లో వేసుకొన్నారు. కొడుకు, పెద్దకూతురు స్థిరం లేకుండా కొంప గుల్ల చేస్తుంటే చిన్న కూతుర్ని నీకు ఎర వేసిందన్నమాట ఆవిడ. నీకైనా బుద్ధి ఉండొద్దూ ! మేం చచ్చామనుకొన్నావా ? లేక నెల నెలా నీకు డబ్బు పంపి చదివించడానికే ఉన్నామనుకొన్నావా ?" అంటూ గట్టిగా అంటున్న ఆ మాటలకి యింట్లో ఉన్న చెల్లెళ్లు తమ్ముళ్లు ఎదురుగా నిలబడి వింతగ చూస్తుంటే ఆ అవమానం సహించలేక భూమి బ్రద్దలై దారి యిస్తే బాగుండుననిపించింది.

ఏం మనుషులు ? నిన్న మొన్న మాధవరావుగారు బాగున్నంత వరకూ రాకపోకలు సాగించిన వీళ్లు ఎంత నీచంగా మాట్లాడుతున్నారు. ఛ...ఛ...? అనుకొంటూ పెదవి కదపకుండానే పైకి నడిచాడు. ఒంటరిగా ఉన్నవాడిపై హఠాత్తుగా శత్రుదాడి జరిగినట్లు తలంతా దిమ్మెక్కి ఏమి తోచనట్లు మొద్దుబారిపోయింది మనసు, శరీరము. అప్రయత్నంగా కాళ్లు కాలువగట్టుకి లాక్కుపోయాయి.

"రతీ ! మావాళ్ళు చూసావా ఏమంటున్నారో ! వీళ్లింత వ్యతిరేకమని నా కెపుడూ తెలియలేదు. సడెన్‌గా వీళ్లకీ గుర్తుంపు ఎందు

**జరిగిన కథ — 3 :** నందిని, ఆరతి, చంద్రకాంత్ భైరవి, మాధవరావు దంపతుల సంతానం. ఆరతి, రాజాల స్నేహం చూస్తే నందినికి అసూయ. మేనల్లుడు మోహన్‌కు స్నేహితుడు రాజాతో తమ బాధలనీ చెప్పుకొంటుంది భైరవి. రాజాకు గతం గుర్తుకు వస్తుంది. రెండు చేతులా సంపాదిస్తున్న మాధవరావుగారికి ఏక్సిడెంట్‌లో మతి చలిస్తుంది. ఆ పరిస్థితులలో ఆరతికి ఆమె తల్లికి రాజా సహాయంగా ఉండడం కొండంత ధైర్యాన్ని ఇస్తుంది. రాజా, ఆరతి ప్రేమించుకుంటారు. రాజా ఆమె కోసం జీవితాంతం వేచివుంటానని మాటిస్తాడు. చంద్రకాంత్ ఆరతితో గొడవపడి ఇల్లు విడిచి వెళ్లిపోతాడు. దారి తప్పిన చంద్రకాంత్, నందిని ప్రవర్తనలకు కలత చెందుతుంది భైరవి.



కొచ్చిందో తెలుసా? కట్నాలతో వస్తున్న సంబంధాలు. ఇంజనీరింగ్ చదువుతున్న కొడుక్కి కడుతున్న విలువ. నీవు పిలుస్తే రాకుండా ఉండగలనా? ఆ సుడిగుండలో చిక్కుకొని నువ్వెంత సతమతమౌతున్నావో నాకు తెలియదా! వచ్చేస్తాను రతీ! ఎవరేమనుకున్నా వచ్చేస్తాను...'' అనుకొంటుండగానే గుర్తువచ్చినట్లు లేచి నిలబడ్డాడు. జేబులో చూసుకొంటే డబ్బులేదు. యింటికి వెళ్లాడు. తండ్రిపైకి వెళ్లిపోయినట్లున్నాడు.

''అమ్మా! నాకొ పాతిక రూపాయలు కావాలి! మామయ్యగారికి సీరియస్‌గా ఉందని వ్రాసిందమ్మా ఆరతి. చిన్నపిల్ల ఏం చేస్తుంది చెప్పు. వాళ్లింటి విషయం నీకు తెలుసుగా, ఈ ఒక్కసారి వెళ్లనివ్వు ప్లీజ్... యింత అమానుషంగా పట్టినట్లు ఉండడం భావ్యంకాదు. ఈ ఒక్కసారికీ యివ్వు. నన్ను వెళ్లనివ్వు... ప్లీజ్...'' ఆ గొంతులో సుళ్లు తిరుగుతున్న దుఃఖానికి కరడుకట్టిన ఆమె హృదయం చలించింది. మౌనంగా డబ్బు తీసియిచ్చింది. వెంటనే బ్యాగ్ సర్దుకొని బయలు దేరాడు.

* * *

రాత్రి పదిగంటల వేళ అదురుతున్న గుండెలతో, ఆరతిని ఏ స్థితిలో చూడవలసి వస్తుందోనన్న భయంతో గేటు తెరచుకొంటూ లోపల కడుగుపెట్టాడు. ఆ మాత్రం గేటు చప్పుడుకే వళ్లంతా కళ్లు చేసుకొని ఎదురుచూస్తున్న ఆరతి పరుగున వచ్చింది. 'రోడ్డు' అన్న విషయం గుర్తువచ్చి టక్కున ఆగిపోయి, ఏం తోచనిదానిలా చేతిలో బ్యాగ్ అందుకొంది. అతన్ని చూడగానే కోటి సంబరాల సంరంభం నింపుకొన్న ఆ కళ్లు చూడగానే జరిగినదంతా మరచిపోయి స్వర్గంలో అడుగుపెడుతున్నంత ఆనందంగా ఆమెననుసరించాడు.

నిర్లిప్తంగా పడుకొని శూన్యంలోకి చూస్తున్న భైరవిని ఎలా పలకరించాలో అర్థంకాలేదు. ఈ వయసులో, ఈ పరిస్థితిలో ఆవిడకు వచ్చిన ఈ కష్టం ఏ ఓదార్పుతోనూ పోదని తెలుసు.

''అత్తయ్యగారూ ... నందిని విషయం నేను తెలుసుకొంటాను. నేను వచ్చేసానుగా అన్ని చూసుకొంటాను. మీరు నిశ్చింతగా ఉండండి!'' అనేసి సమాధానం ఆశించకుండా వెంటనే లేచి వెళ్లిపోయాడు ఆ స్థితి ఎదుర్కోలేనట్లు.

భోజనం అయ్యిందనిపించి డాబామీద పక్క వేస్తే వెళ్లి వాలబడ్డాడు. మంచినీళ్ళు తెచ్చిన ఆరతి నీళ్లక్కడపెట్టి పిట్టగోడ దగ్గర నిల్చుంది. చీకట్లో నల్లని బొమ్మలా, నిశ్చలంగా నిలబడ్డ ఆరతి ఆలోచనలు ఎక్కడో ఉన్నాయి. తలక్రింద చేయి పెట్టుకొని ఆకాశం వంక చూస్తున్న రాజా మనసు కూడా యిక్కడలేదు. అలా నిలబడ్డ ఆరతిని చూస్తూ ఊరుకున్నాడే తప్ప లేచి వెళ్లాలనిపించలేదు. అమావాస్య నిండిన ఆకాశంలా, బెంగలు బాధ్యతలతో నిండిన వారిద్దరి మనసులకు, 'ఒకరి ఎదుట ఒకరు ఏకాంతంలో ఉన్నామనే' ఊహే

# జీవన సరళిలో తీయని రవళి

రాలేదు. వారి వయసుకి అల్లరి చేయడం తెలియదన్నట్లు మూగ బోయారు. కొండంత ప్రేమను గుండెల్లో దాచుకొని వలపు సందడిని అదుపుచేసే విగ్రహం వారి సంస్కారం కలుగచేసింది. అందుకే అంత ఏకాంతంలోకూడా, ఒకరికోసం, ఒకరు ఆలోచించకుండా యిద్దరూ ఎదుర్కోబోయే సమస్యల విషయం ఆలోచిస్తున్నారు.

''రతి ! వెళ్లి పడుకో పొద్దుపోయింది. ఉదయం ఆలోచిద్దాం !'' స్తబ్దుగా ఉన్న చీకటిని చీల్చుకొంటూ వచ్చిన ఆ మాటకి ఉలిక్కిపడింది ఆరతి. దీర్ఘమైన నిశ్వాస విడచి తేలికపడినట్లు వెనుదిరిగి గబగబ దిగిపోయింది మెట్లు. నిద్రమాత్రల మత్తులో మగతగ పడివున్న తల్లి ప్రక్కన చోటుచేసుకొంది నిశ్చింతగ ఆరతి. రాజాకి మాత్రం తన యింటి పరిస్థితి, ఉదయం జరిగిన సంఘటన, భవిష్యత్తులో ఎదుర్కోబోయే సమస్యలు కంటిమీద రెప్పవెయ్యనివ్వలేదు.

* * *

కమలాకాంతుని వెచ్చని కిరణాలు సోకి లేచి కూర్చున్నాడు. ప్రక్క బట్టలు చుట్టి క్రిందకు వస్తుంటే కాఫీ కప్పులో ఆరతి ఎదురయ్యింది. ఆ కప్పు అందుకొంటూ ఆమె కళ్లల్లోకి చూసాడు. అప్పటికే స్నానం అయిపోయిన ఆరతి శిరీషపుష్పంలా ఉంది. ఒక్క క్షణం అతని కళ్లల్లో తమకం చోటు చేసుకొంది. తన వంక అలా చూస్తున్న ఎర్రబడ్డ ఆ కళ్లల్లోని చిలిపిదనం నిలువెల్ల ప్రాకి ఏదో తీయని భావంతో స్పందించింది తనువు.

''ఏమిటి మెట్లమీద నిలబడే త్రాగేస్తావా ?''

''నీ అందాన్నా, కాఫీనా ! రెండూ త్రాగుతున్నాగా ! ఎక్కడైతే ఏం. నువ్వెదురుగా ఉన్నావు.'' అంటూ రెండు మెట్లు దిగాడు. అంతలో ఎవరో పైనుండి పిలిచారు.

''ఆఁ ఆఁ వెళ్తానులే ఆ మాత్రానికి కళ్లతో సైగ చేసేయాలా వెళ్లమని. నేను ఉండగా నీ అందమైన కళ్లు మరొకరి కంట పడనిస్తానా ?'' అంటూ టవల్ కప్పుకొని హాల్లోకి నడిచాడు. ఎవరో అద్దెకోసం వచ్చారు. బోర్డు పెట్టాక నలుగురైదుగురు వచ్చారు గాని అద్దె విషయం కుదరక, ఆరతికి నచ్చక తప్పిపోయినాయి. ఈ రోజు వచ్చింది కాలేజిలో లెక్చరర్ అట ఆయన. భార్య, భర్త యిద్దరు హైస్కూలు చదువుల్లో ఉన్న పిల్లలు. వాళ్లకి యిల్లు, అద్దె నచ్చింది. వీళ్లకి కుటుంబం నచ్చింది, వెంటనే అడ్వాన్స్ ఇచ్చేశారు. రాజా చేతిలో పెడుతున్న నాలుగు వందలు చూసుకొంటూంటే కొండంత ధైర్యం వచ్చింది ఆరతికి.

''రతి ! నేను ముందు కాంత్ ఎక్కడున్నాడో వెతుకుతాను. మగవాడైనా అతను రావడంకూడా ముఖ్యమే. మోహిని వాళ్లన్నను కలుసుకొని ఏమైనా తెలుస్తుందేమో ప్రయత్నిస్తాను.'' వీళ్లిలా మాట్లాడుకుంటుండగానే, ఆరతి మేనత్త వరలక్ష్మి ఆవిడ చిన్న కొడుకు వచ్చారు. డైనింగ్ టేబిల్ దగ్గర ఎదురెదురుగా కూర్చొని టిఫిన్ చేస్తూ మాట్లాడుకుంటున్న ఆ యిద్దర్ని పరిశీలనగ చూస్తూనే, ''నాన్నెలాగున్నాడమ్మా'' అంటూ రాని కన్నీళ్లు వత్తుకోసాగింది.

హఠాత్తుగా దిగబడిన అత్తను, చిన్న బావను చూసి ''ఏదో విశేషముంది !'' అనుకొంటూనే... ''రా అత్తయ్యా !'' అంటూ వెనక గదిలోకి తీసుకువెళ్లింది.

''అవునే అమ్మాయ్ ప్రక్కగదిలో ఎవరే క్రొత్త వాళ్లలా ఉన్నారు'' అంది ఆరాగా;

''అవునత్తయ్యా ! ఆ పోర్షన్ అద్దెకిచ్చేశాము. లేకపోతే ఎలా గడుస్తుంది. అమ్మకి బాగులేదు. అందుకే యింకా లేవలేదు'' అంటూ ప్రక్క మంచంమీద పడుకొని చూస్తున్న తండ్రి దగ్గరకు వెళ్లి... ''నాన్నా అత్తయ్య వచ్చింది.'' అని చెప్పింది.

''ఎంతపని చేసాడు ఆ దేవుడు!'' అంటూ అన్నగారి ప్రక్కన కూర్చుని కాస్సేపు ఏడ్చింది.

హాల్లోనే కూర్చుండిపోయిన రవీంద్ర...అటూ, యిటూ తిరుగుతున్న ఆరతిని చూస్తున్నాడు. ''ఒకప్పుడు వచ్చేపోయే మనుషులతో, వంటింటి నుండి వచ్చే నేతి వాసనలతో ప్రక్క గదుల్లో నుండి వినవచ్చే రకరకాల రికార్డుల ధ్వనితో అదో ప్రపంచంలా ఉండే ఈ యిల్లు యిప్పుడు ప్రశాంతంగా, సింపుల్‌గా, ఆభరణాలు తీసేసిన రాకుమారిలా ఉంది.'' అనుకున్నాడు. మోహన్ తప్ప ఆతనెపుడూ ఎక్కువ రాలేదు. ఎపుడో తల్లి వస్తే వచ్చేవాడు అంతే! ఈ మధ్య మూడేళ్లుగా ఈ రాకపోకలు లేవు.

''రా బావా! స్నానంచేసి టిఫెన్ తీసుకొందువు'' అంటున్న ఆరతి మాటలకు మొహమాటంగా లేచాడు. తన ముందు నుండే బట్టలు వేసుకొని పైకి వెళ్లిపోతున్న ఆ యువకుడు 'ఎవరు?' అన్నట్లు చూస్తున్న అతని ప్రశ్నకు సమాధానం చెప్పవలసిన అవసరం లేదనిపించి పట్టనట్లు బాత్‌రూమ్ చూపించి వంటింట్లోకి వెళ్లిపోయింది. తిరిగి కాఫీ గ్లాసు పట్టుకొని తల్లి ఉన్న గదిలోకి వచ్చేసరికి ''వదినా, నువ్వేమన్నా అను పిల్లల్ని మొదటి నుండి భయభక్తుల్లో పెట్టుకోలేదు. ఎంతసేపు సంపాదించుకొంటున్నామంటే సరా! ఎంత అప్రదిష్ట. అందుకే మోహన్‌బాబు మొదటి నుండి దీని ఊసు ఎత్తితేనే మండి పడేవాడు.

అపుడు వచ్చినపుడు చూసానుగా, ఆడపిల్లకా తిరుగుళ్లేమిటి? యిదెపుడో ఒకనాడు యిలాంటి పని చేస్తుందని తెలుసు. అందుకే అన్న కూతురని అభిమానం త్రెంచుకోవలసి వచ్చింది. పిల్లల భవిష్యత్తు పాడుచేస్తామా! ఉన్నది ఒక్క కొడుకు... వాడో జులాయి వెధవలా తిరుగుతున్నాడు. వాడూ పోయాడటగా. బాగుందమ్మా యిల్లు. ఈ నాటికి వాడికీగతి పట్టించారు. సింహంలా ఎలా ఉండేవాడు. యింతకీ కట్టుకున్నది అదృష్టవంతురాలైతే అన్నీ బాగానే ఉంటాయి. ఆడదాని రాతమీదే యిల్లు నడుస్తుంది...'' ఏడుస్తున్న భైరవిని యింకా కుళ్లబొడుస్తూ అంటున్న మాటలకి ఆరతికి మండిపోయింది.

''పోన్లే అత్తయ్యా! ఎవరి ఖర్మ వాళ్లది. మేము చేసుకొన్నది మేమే అనుభవిస్తున్నాము. మీకేం ఒరిగింది మధ్యన యిపుడేం పనిమీద వచ్చావో ఆ పని చూసుకొనివెళ్తే మంచిది. అసలే సగం చచ్చిఉన్న మమ్మల్ని యింకా చంపడమెందుకు?'' ఉక్రోషంగా అంటూ కాఫీ యిస్తుంటే... ''కాఫీలకోసం రాలేదమ్మాయ్. పెద్దంతరం, చిన్నంతరం లేకుండా యిలా మాట్లాడబట్టే యిల్లు యిలా ఉంది. మాకే ఒరగాలి? మా పరువు ప్రతిష్ట మంటగలసిపోలే! ఆ పెళ్లివాళ్లు మొన్న మొహంమీదే అడిగారు 'మీ అన్న కూతురు లేచిపోయిందటగా అంటూ! ఏమని సమాధానం చెప్పడం? 'మావాళ్లు' అనుకొన్నా మానుకొంటే కుదురుతుందా?'' చివ్వున లేచిపోతూ అంది వరలక్ష్మి –

''మా అన్నయ్య వాడి కుటుంబం మొత్తం చచ్చిపోయారు మాకెవరూ లేరని ఒక్కమాట చెప్పేసుకొండి అత్తయ్యా! ఏ గొడవ ఉండదు'' చల్లగా నెమ్మదిగా వచ్చిన ఆ మాటలు మంచు సూదుల్లా గుచ్చుకొన్నాయి

''దాంతో ఏమిటి వరలక్ష్మి కూర్చో... ఏడీ చిన్నబాబు వచ్చాడన్నావు...'' ఆయాస పడుతూ చెయ్యి పట్టుకొని బ్రతిమాలుతున్న తల్లిని చూసి... ఏమి అనలేక వెళ్లిపోయింది ఆరతి.

''ఇంత జరిగాక యింకేమిటిలే వదినా! అయినా నా అన్న పరిస్థితి బాగుంటే నాకీ మాటలు పడాల్సిన ఖర్మ ఉండేది కాదు. ఎందుకు వచ్చిన పని చేసుకొని పోతాను. అదిగో రవి వచ్చాడు. వీడు డాక్టరు చదువుతున్నాడు వదినా, మూడో ఏడు. యింతకీ మోహన్‌బాబుకి సంబంధం కుదిరింది. పెళ్లి వచ్చేనెల పదో తారీఖున. మీరు తప్పక రావాలి! ఏదిరా బాబు ఆ కార్డు యిటివ్వు!'' అంటూ కొడుకు అందించిన కార్డు వదిన చేతిలో పెట్టేసి లేచిపోయింది. ఉండమని ఎంత బ్రతిమాలినా ఉండకుండా కొడుకుని తీసుకొని వెళ్లిపోయిన ఆడపడుచును తలచుకొని చిన్నకూతుర్ని తిట్టింది. తరతరాలుగా జీర్ణించుకుపోయిన భయాలు, ఆచారాలు, ఆడపడుచు వెళ్లిపోయిందని భయం ... అవిన్నీ అలా చేసాయి. తల్లి మాటలకు జవాబు చెప్పకుండా తలవంచుకొంది ఆరతి.

* * *

రెండు రోజులు తిరిగి, తిరిగి చంద్రకాంత్ ఆచూకి సంపాదించాడు రాజా. తీరా వెళ్తే అతనెవరో తెలియనట్లు యింటికీ తనకు ఏమి సంబంధం లేనట్లు మాట్లాడాడు.

''మిస్టర్ రాజశేఖర్, ఆ యింటికి సంబంధించిన వాడివి నువ్వు. ఆ పరువు ప్రతిష్టలు, ఆస్తిపాస్తులు అన్ని చూసుకోవలసింది నువ్వు. నాకెవ్వరూ లేరు. నా బ్రతుకు నేను బ్రతకగలను. అయినా యింకెక్కడి పరువు. నువ్వు మా యింట్లో అడుగుపెట్టి, దాన్ని, ఆ రాక్షసిని వళ్లో వేసుకొని షికార్లు కొట్టినపుడే పోయింది పరువు. యిక నీ దారిన నీవు వెళ్లొచ్చు.'' అంటుంటే నిజంగానే కాళ్లా వేళ్లా పడ్డాడు రాజా.






# జీవన సరళిలో తీయని రవళి

మూర్ఖత్వం మూర్తీభవించిన ఆ యింటి వారసుడి నుండి తిరస్కారమే ఎదురయ్యింది. తనయితే భరించాడు గాని ఈ విషయం ఆ తల్లికెట్లా చెప్పాలో అర్థం కాలేదు. ఆలోచిస్తూ యిల్లు చేరుకొన్నాడు.

''అన్నయ్య సంగతి తెలిసిందా? ఏమన్నాడు?'' యింట్లో అడుగు పెడుతూనే ఆత్రంగా అడుగుతున్న ఆరతి వంక చూళ్ళేక తల వంచుకొన్నాడు.

''సరే! సరే! లోపలికి రా! ఉదయమనగా వెళ్లావు. మధ్యాహ్నం భోజనం చేసావా, లేదా? లేకపోతే రా, వేడివేడిగా వడ్డించేస్తాను.'' అంటూ హడావిడి చేస్తున్న ఆరతి చెయ్యి పట్టుకొన్నాడు. ఆ స్పర్శలో తేడా గమనించిన ఆరతి... ''ఏం రాజా అలా ఉన్నావ్? ఏం జరిగింది? ఏం జరిగినా మన మంచికే! పరీక్షల నెదుర్కోవడం అలవాటయి పోయింది రాజా! నువ్వేం భయపడకు!'' ఆర్ద్రంగా అంటూ ఆ చేతిని పట్టుకొని అలాగే తీసుకువెళ్లింది.

''రతీ! నా దేవతా! నీ యీ చిన్నిజీవితంలో ఎన్ని సవాళ్ల నెదుర్కొంటున్నావ్! ఎప్పటికైనా నిన్ను నా గుండెలమీద చేర్చుకొని లాలించి సేదదీర్చే భాగ్యం కలుగుతుందా? లేకపోతే జీవితమంతా ఈ నిరీక్షణతోనే గడచిపోతుందా... భగవాన్ తొందరగా నీ గడియారం ముల్లు తిప్పెయ్. కాలమే పరిష్కరించగల ఈ సమస్యలను తొందరగా పరిష్కరించనీ. మమ్మల్ని ఒకటి చెయ్యి.'' మనసులోనే కోటి దండాలు పెడుతూ స్నానం ముగించాడు.

భోజనం చేస్తూ కాంత్‌ని కలుసుకొన్న విషయం చెప్పాడు. అంతా విని హతాశురాలైపోయింది ఆరతి. ''నా ప్రవర్తన వాడినింత బాధిస్తుందనుకోలేదు. యింత సులువుగా త్రెంచేసుకొంటాడనుకో లేదు!'' అంటుంటే కనుకొలుకుల్లోనుండి నీటిబొట్లు జారిపడ్డాయి అది చూడలేనట్లు చప్పున లేచివచ్చి.

''ఛ ఏమిటి రతీ! నువ్వు మాత్రం తప్పేం అన్నావు. నీ బాధ్యత నిన్నలా మాట్లాడించింది. అయినా వాళ్ల కేనాడు బంధాలు అడ్డువచ్చాయి చెప్పు. త్రెంచుకొన్నారని బాధ పడ్డానికి!'' తలనిమురుతూ ఊరడిస్తుంటే ఎన్నాళ్లగానో గుండె లోతుల్లో గుప్తంగా కరడుగట్టిన దుఃఖం త్రవ్వి పోసినట్లు వెలికివచ్చి అతని గుండెల్లో తలదాచుకుంది. ఆ దగ్గరతనంలో శరీరాన్ని మరగించే కోరిక లేదు. కాంక్ష తీర్చుకోవాలన్న తపన లేదు. ఆ కౌగిలింతలో, దగ్గరతనంలో ఆప్యాయత ఒకరి నొకరు ఊరడించుకొనే ఓదార్పులో కరగిపోయారు. అప్రయత్నంగా కళ్లల్లో తిరిగిన నీటిని కొనగోట మీటి, వీపుమీద తట్టి దూరం జరిపాడు. కళ్లు తుడిచేసుకొంటూ, తల్లికోసం వడ్డించిన భోజనం పట్టుకొని వెళ్లి పోయింది.

''అన్నయ్య కనిపించాడా ఆర్తీ!'' ఆశగా అడుగుతున్న తల్లిచేయి నిమురుతూ...

''ఏదో ఉద్యోగం చేసుకొంటున్నాడమ్మా— రూమ్ తీసుకొని ఉన్నాడంట. కోపం తగ్గాక వాడే వచ్చేస్తాడు.'' ఎదో బార్‌లో రిసెప్షనిష్టుగా చేస్తున్నట్లు రాజా చెప్పిన విషయం గుర్తుకు వచ్చి, అది కప్పిపుచ్చుతూ మృదువుగా అంది.

''నాకీ అనారోగ్యం పట్టుకొని ఉన్న బాధలన్నీ చాలవని చాకిరీ కూడా నీకే పట్టుకొంది!'' బాధపడుతూ అంది భైరవి.

''అదేం మాటమ్మా! బాగున్నన్నాళ్లు మా అందరికీ చెయ్యలేదూ యిప్పుడేమయ్యింది! రెండు రోజులుపోతే నువ్వేలేచి తిరుగుతావు!'' అనునయంగా అనేసి లేచిపోయింది.

''రతీ! నేను రేపు వెళ్తాను. అమ్మవాళ్లు ఎదురు చూస్తుంటారు. నందిని విషయం ఏమన్నా తెలిస్తే కబురుచెయ్యి. యిపుడు

## నా పుట్టిన దినం

ఈ రోజు నేను పుట్టిన దినం
ఎన్నో పూలు పూచిన దినం
మరెన్నో పూలు రాలిన దినం.

గతించిన దినాల్ని లెక్కిస్తూ
గతించబోయే దినాల్ని ఊహించుకుంటూ
కాలాన్ని భోంచేయడమే జీవనం.

బాధల కష్టాలమోపు వీపుమీదున్నవాడికి
క్షణక్షణమొక యుగం
సుఖాల బెలూన్లో తేలిపోయేవాడికి
బతుకంతా ఒక్కక్షణం
క్షణానికీ యుగానికీ సమన్వయం సాధించినవాడికి
ప్రతి దినమూ పుట్టిన దినం
ప్రతి క్షణమూ సార్థకం.

— డా॥ ఆర్వీయస్ సుందరం

ప్రక్కనకూడా ఆవిడ ఉన్నారు రాధగారు. నీకు సహాయంగా ఉంటారు. యింక మనసు పాడుచేసుకోకుండా క్లాసు పుస్తకాలు తీసి చదువు. యింకెంత శలవులు అయిపోవచ్చాయి. నేను తొందరగా వచ్చేస్తాను. నేను అక్కడ ఎవరినన్నా అడుగుతాను స్టీరియో గురించి. నువ్వన్నట్లు అవి అమ్మేస్తే ఓ నాలుగయిదు వేలు వస్తుంది. బ్యాంక్‌లో వేస్తే అవసరానికి వాడుకోవచ్చు. నేనా విషయాలన్నీ చూసుకొంటాను నువ్వు నిశ్చింతగ ఉండు.'' పడుకొనేముందు అన్ని విషయాలు చెప్పి పడుకొన్నాడు. మర్నాడు ఆరతి మనసు శూన్యంచేస్తూ రాజా వెళ్లిపోయాడు.

* * *

అపుడపుడు రాజా దగ్గరనుండి వచ్చే ఉత్తరాలు తొలకరిలా మనసుని చల్లబరుస్తుంటే వేసవి శలవులు గడచిపోయాయి. కాలేజీలు తెరిచారు. రాజా కాలేజి యింకా తెరవలేదని రాలేదు.

శలవుల తరువాత మొదటిరోజు కాలేజీకి వెళ్తే తెలిసింది ఆరతికి లోకం అంటే ఏమిటో, సంఘం అంటే ఏమిటో. మనం ఒకరి గురించి పట్టించుకోకపోయినా మన గురించి పట్టించుకొని వేధించడం చుట్టూ మనుష్యులకెంత అలవాటో స్పష్టంగా తెలిసిన ఆరతి దిమ్మెరపోయింది. 'యింట్లో సమస్యలతో పోరాటమే కాదన్నమాట, వీధిలో మనుష్యులతో కూడా పోరాడాలి!'' అన్న జ్ఞానం కలిగాక ఆరతి ఊరుకోలేదు. ''మీ ఆక్క యిలాగట.'' అన్నవాళ్లందరితో—

''అవును. ప్రేమించి పెళ్లి చేసుకొని వెళ్లిపోయింది!'' అంది ర్భయంగా. ''మనం పరుగెడితే వెంట తరుముతుందని వెనుదిరిగి దురు నిలుస్తే తోకముడిచి పారిపోతుందీ సంఘం'' అని అనుభవ ర్వకంగా తెలుసుకొన్న ఆరతి ఎదురునిలవడమే నేర్చుకొంది. కనుకనే ర్భయంగా కాలేజీ చదువు కొనసాగించగలుగుతోంది. కాలేజి తెరచిన గ్గరనుండి ఈ అనుభవాలతో తలబొప్పి కట్టిన ఆరతి రాజా రాకకోసం యి కళ్ళతో ఎదురుచూస్తోంది.

(ఇంకా వుంది)

# కలలు కల్లలు కావని నిరూపించిన మార్క్‌ట్వైన్



పత్రికా సంపాదకుడిగా, హాస్య రచయితగా ప్రఖ్యాతిగాంచిన మార్క్‌ట్వైన్ అతీంద్రియ మనో విజ్ఞాన శాస్త్రానికి సంబంధించిన గ్రంథాలెన్నో చదివి, ఆ శాస్త్ర అభివృద్ధికి యథాశక్తిగా తోడ్పడ్డాడని చాలామందికి తెలియకపోవచ్చు. "ప్రతీ మనిషి తన మెదడుకున్న శక్తిలో కనీసం సగం ఉపయోగించుకున్నా అద్భుతమైన కార్యాలెన్నో చేసి చూపవచ్చును, మనం తెలివైన వ్యక్తి అనుకున్న మనిషి కేవలం తన మెదడులోని పది శాతం శక్తినే ఉపయోగించుకుంటున్నాడు. కొంతమంది అంతకన్నా తక్కువ ఉపయోగించుకుంటున్నారు. ఈ శక్తిని పూర్తిగా సద్వినియోగం చేసుకోవాలంటే, ఏకాగ్రత, సాధన. ఆత్మ విశ్వాసం ఎంతో అవసరం" అని మార్క్ అభిప్రాయపడేవాడు.

మార్క్‌ట్వైన్ అసలుపేరు సామ్యేల్ ఎల్. క్లెమెన్స్. 1835 లో ఒక మధ్య తరగతి కుటుంబంలో జన్మించాడు. చిన్నతనం అంతా అమెరికాలోని మిసిసిపీ ప్రాంతాల్లో చాలా ఉల్లాసంగా గడిపాడు. మార్క్ పన్నెండవ సంవత్సరంలో తండ్రి మరణించడంతో ఒక ప్రెస్‌లో పనికి కుదిరాడు. కొన్నాళ్ళు పనిచేసిన తరువాత సైన్యంలో చేరాడు. సైన్యంలో సర్వీసు పూర్తి అయిన తరువాత చిన్న చిన్న ఉద్యోగాలు చేసి, చివరకు పత్రికా రంగంలోకి ప్రవేశించడంతో మార్క్‌లోని రచయిత మెరుపులా బయటకొచ్చాడు. 1865 లో అతని మొట్టమొదటి కథ అచ్చయింది. అతను "శాన్‌ఫ్రాన్సిస్కో మార్నింగ్ కాల్" అనే పత్రికలో పనిచేస్తున్నపుడు అనేక కథలు, నవలలు రాసి అచిర కాలంలోనే ప్రముఖ రచయిత అయ్యాడు. తన నవలల్లో కల్పిత పాత్రలకన్నా, తాను చిన్నతనంలో మిసిసిపీలో తిరిగిన స్నేహితుల పాత్రలను, అపుడు వారు చేసిన చిలిపిపనులను, చతురోక్తులతో చాలా హాస్యంగా రాశాడు. తన కథలలో, కలల గురించి ప్రస్తావించి, ప్రతీకలకూ అర్థం ఉంటుంది, అవి ఖచ్చితంగా ఏదో రకంగా నిజమవుతాయని వివరించేదు.

మార్క్‌ట్వైన్‌కి అతీంద్రియ శక్తులపై గాఢమైన నమ్మకం కలగడానికి ఒక బలమైన కారణం ఉంది. అతని చిన్నతనంలో, తన సోదరుడు హెన్రీతో కలిసి నావికా దళంలో పనిచేస్తున్నపుడు ఒక విచిత్రమైన కలను గన్నాడు. అందులో హెన్రీ ఒక పడవలో మరణించినట్లుగానూ, తరువాత ఆ శవాన్ని కొందరు తీసుకునచ్చి తన సోదరి ఇంట్లో పరుండబెట్టినట్లుగానూ, ఒక ఆగంతక స్త్రీ వచ్చి అతని గుండెలపై చిన్న గులాబీ పువ్వును ఉంచినట్లుగా కనపడింది. వెంటనే మార్క్ లేచి, కంగారుపడుతూ, బట్టలు వేసుకుని తన సోదరి ఇంటికి పరిగెత్తాడు. కానీ కొంతదూరం వెళ్ళేక తెలిసింది, తానింకా నిద్రలోనే ఉన్నానని.నిద్రలోనే నడవటం, పరిగెత్తే అలవాటు ఆ రోజుల్లో అతనికి ఉండేది. తరువాత తన సోదరిని కలిసి తన కల గురించి పూస గుచ్చినట్లుగా చెప్పాడు. ఆమె "కలలు నిద్రలో కాలక్షేపం కోసం వస్తాయి, అవి పట్టించుకుని అంతగా బాధ పడవలసిన అవసరం లేదు. ఇలాంటి పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకోకు" అని మందలించింది.

ఇది జరిగిన సరిగ్గా మూడు వారాలకు మార్క్ అన్నయ్య హెన్రీ పడవను తీసుకుని పెన్‌సిల్వేనియాకు వెళ్తుండగా, పడవలోని బాయిలరు బద్దలయి, ప్రయాణీకులెందరో మరణించారు, తరువాత హెన్రీ కూడా మరణించాడు. మార్క్ కలలో చూసినట్లుగా ఆ శవాన్ని అతని సోదరి ఇంటికి తెచ్చి పరుండబెట్టారు. అగంతకస్త్రీ వచ్చి చిన్న గులాబీ పెట్టడం తప్ప అన్నీ అతను కలలో చూసినట్లే ఉన్నాయి. మరి కొన్ని క్షణాల్లో శవాన్ని తీసుకెళ్తారనగా వారెవరికి పరిచయం లేని ఒక అగంతక యువతి వచ్చి, ఆ శవం గుండెలపై చిన్న గులాబీని ఉంచి రోదించడం మొదలు పెట్టింది. తరువాత తెలిసిందేమిటంటే ఆ యువతి హెన్రీ రహస్య ప్రేమికురాలని.

మార్క్ కలలో చూసినది ఖచ్చితంగా జరగటంతో కలలపై నమ్మకం కుదిరి, అప్పటినుంచి పేరాసైకాలజిస్టులను సంప్రదించి తన అనుభవాలను వారికి తెలియజేస్తూ ఉండేవాడు. అంతవరకు ఈ బాపతు విషయాలను కట్టుకథలుగా కొట్టిపారేసిన మార్క్‌కు ఈ శాస్త్రం పై గురి కుదిరింది. అంతే కాకుండా హస్త సాముద్రికం, జ్యోతిష్యం వంటి శాస్త్రాల గురించి కూడా తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో "కీరో" వంటి మహావ్యక్తులను కలిసి, ఆయా శాస్త్రాల లోతుపాతులను తెలుసుకుని వాటి అభివృద్ధికి యథాశక్తిగా ప్రచారం ఇచ్చి పత్రికల ద్వారా ప్రజలలోకి పోయేలాగ చేసాడు. రచయిత మార్క్ కీర్తి దశదిశలూ ప్రాకుతున్నా, తాను అతీంద్రియ విజ్ఞాన శాస్త్రజ్ఞుణ్ణి అయిఉంటే ఎంతో బాగుండేది అనుకుంటూ ఉండేవాడు. మానవ మేధను సంపూర్ణంగా వినియోగించుకునే శుభదినం ఎంతో దూరంలో లేదు అని ఘంటాపథంగా చెప్పేవాడు.

1896లో మార్క్ కుమార్తె మరణించడం కూడా ముందుగా కలలో చూసాడు. అనంతరం ఆమె మరణించింది. ఆమె మరణంతో మార్క్ చాలా కృంగిపోయాడు. ఆ సమయంలో ఒక రెండు నవలలు తప్పనిసరై రాయాల్సి వచ్చింది. ఇష్టం లేకపోయినా విరక్తితో, అనాసక్తితో రాసి ఇచ్చాడు. వాటిని కొంతమంది తీవ్రంగా విమర్శిస్తే, మరికొందరు ఎంతగానో పొగిడారు. ఆ విధంగా అవి సెన్సేషనల్ నవలలు అయ్యాయి. దాంతో మార్క్ మరీ పాపులర్ అయ్యాడు.

హాయిగా నవ్వుతూ, నవ్విస్తూ, హుషారుగా చలాకీగా ఉండే మార్క్ చివరిదశలో అనారోగ్యంతో బాధపడి 1910 లో స్వర్గస్థులయ్యారు. ★

**అద్భుత వ్యక్తులు**

**బి.వి. పట్టాభిరామ్**

**మెజీషియన్—హిప్నాటిస్ట్**

**పై వారం:**

**మనసు మహాత్మ్యం తెలుసుకున్న మహామేధావి డాక్టర్ ఫ్రాయిడ్**

# ఆఖరి ప్రయత్నం

...మిన్నర్

"నువ్వు నాకో సహాయం చెయ్యాలి" అన్నాడు విశ్వమూర్తి లంచ్ టైములో.

అసలు సంగతి చెప్పకుండా నా సహాయం కోరాడంటే ఇదేదో ముఖ్యమైన విషయం అయి వుండాలి.

వచ్చే నెలలో జరగబోయే ఇంటర్వ్యూలకి సంబంధించిన ఫైలు నా వద్దనే ఉంది. వున్నవి రెండు వేకెన్సీలు. అందులో ఒకటి రిజర్వ్డు. ఆ మరోదానికోసం ఇప్పటికే అనేకమంది నుంచి రకరకాల ఒత్తిడి రావటం మొదలు అయింది.

ఆ ఉద్యోగానికి నాకు ఇష్టమైన వ్యక్తిని సెలక్టు చేసుకునే అధికారం నాకు లేకపోయినా, కనీసం ఇంటర్వ్యూలో అడిగే ప్రశ్నల సమాచారం నా వద్ద వుంది.

ఒకవేళ తనవాడి కెవరికైనా సహాయ పడమని అడుగుతాడేమో, ముందుగానే ఏదో చెప్పి తప్పించుకోవటం మంచిది అనుకుంటూవుండగా—

"ఈ పని నీకు తప్ప మరొకరివల్లకాదు. కాబట్టి నువ్వు ఎలాంటి అభ్యంతరం చెప్పకుండా ఒప్పుకోవా" అన్నాడు విశ్వమూర్తి ప్రాధేయ పూర్వకంగా.

అసలు విశ్వమూర్తితో నాకంత స్నేహం లేదు. హలో అంటే హలో అనుకోవటం తప్ప భుజాలు రాసుకుంటూ తిరిగింది లేదు. అయితే ఈ మాత్రం పరిచయాన్నే పురస్కరించుకుని నా సహాయం కోసం బలవంతం చేస్తున్నాడంటే ఇది సామాన్య విషయంగా అంచనా వేయలేక పోతున్నాను.

ఏది ఏమైనా ఇంటర్వ్యూ వ్యవహారంలో ఇప్పటికే ఒకరికి మాట ఇవ్వటం జరిగింది. ఇందులో మరింత మందికి సహాయ పడటం అంటె, నన్ను నేను చిక్కుల్లో ఇరికించుకోవటం అవుతుంది.

"నువ్వు వీలు చేసుకుని ఒకసారి మా ఇంటికి రావాలి" అన్నాడు కాఫీ కప్పు చేతిలోకి తీసుకుంటూ.

"ఇది ఇంటర్వ్యూకి సంబంధించినది కాదు" అని తేలిపోయింది.

అతన్ని నొప్పించకుండా ఎలా తప్పించుకోవాలా అని మథన పడుతున్న నా మనసు తేలికపడింది.

"చేతనైన సహాయం చేయటానికి నేను సర్వదా సిద్ధం. ముందు అసలు విషయం ఏమిటో చెప్పు" అన్నాను హృదయ పూర్వకంగా.

"అంతా చెప్పాలంటే ఈ లంచ్ టైము చాలదు. తరువాత విపులంగా వివరిస్తాను."

"రామాయణం అంతటి గాథను మూడు ముక్కల్లో చెప్పారు. నీ కథ కూడా అలాగే తేల్చు. నేను సస్పెన్సు భరించలేను" అన్నాను నేను అతృతగా.

"రామాయణం మూడు ముక్కల్లో చెప్ప వచ్చు. కానీ ఇది మాత్రం విపులంగా చెప్ప వలసిందే"

"అయితే కానీ—"

"మా ఇంటి ప్రక్కన కాంతారావుగారని ఒకాయన వున్నాడు. వయసు అరవై అయిదు వుంటుంది. ఏదో ఉద్యోగం చేసి రిటైరు అయ్యాడు."

"ఆయన నీకు బంధువా?"

"కాదు. కేవలం పొరుగు మనిషి"

వింటున్నాను.

"ఆయనకి ముగ్గురు ఆడపిల్లలు. ఆఖరున ఒక మగ పిల్లవాడు. ఆడపిల్లల పెళ్ళిళ్ళుచేసి పంపించి వేసాడు. ఒక్కడే కొడుకు కావటంతో అతి గారాబంగా పెంచాడు."

"అయితే !"

"ఆ సుపుత్రుడి కోసం ఈ ముసలాయన బెంగపెట్టుకున్నాడు."

"ఎందుకో ?"

"రాజా — అంటె, ఆ కాంతారావుగారి అబ్బాయి ఈ మధ్య మిలటరీలో చేరిపోయాడు. తన కొడుకుని అక్కడ ఎన్నికష్టాలు పెడుతున్నారో అని ఈయన నిద్రాహారాలు మాని దిగులు పడుతుంటే, ఆయనకు ఎలా స్వాంతన కలిగించాలో మాకు అర్థం కావటంలేదు. ఇలాంటి స్థితిలో నువ్వు గుర్తు వచ్చావు."

"నేను చెయ్యగలిగింది ఏముంది ?"

"చాలావుంది. నువ్వు గతంలో మిలటరీలో పనిచేసి వచ్చావుకదా. ఆ అనుభవాన్ని పురస్కరించుకుని కాంతారావుకి వాళ్ళ అబ్బాయి విషయంలో ధైర్యం చెప్పాలి."

"ఆయన అంత అధైర్యం పడటం ఎందుకు ?"

"ఎందుకు అంటే ఏం చెప్పాలి. కన్న ప్రేమ అలాంటిది ! అందులో ఒక్కడే కొడుకు కదా."

"అలాంటప్పుడు రాజాని మిలటరీలోకి పంపకుండా వుండాల్సింది."

"రాజా మిలటరీలో చేరుతున్నాడని తెలిస్తే కాంతారావు ఒప్పుకునేవాడు కాదు అసలు. ఆయనకి తెలియకుండా ఇతగాడే జాయిన్ అయి, పంజాబ్‌లో అదేదో వూరు వుంది. అక్కడినుంచి తండ్రికి లెటరు రాసాడు."

"ఏమని ?"

"ఇక్కడ నేను మిలటరీ ట్రైనింగ్ పొందుతున్నాను. నా గురించి బెంగపడవద్దు అని వ్రాసాడు."

"అయితే ఇంకేం ?"

"అప్పుడు ఈయన అంత కంగారు పడలేదు. కానీ ఈ మధ్య ఎవరో ఆయనకి ఉన్నవి లేనివి మారిపోసారు."

"అంటే."

"ఏం లేదు. మిలటరీలో చేసిన వాళ్ళు చివరి వరకు బ్రతకరనీ, యుద్ధంలో అకాల మృత్యువాత పడతారని, అలా కాకపోతే ఏ కాలో చెయ్యో పోగొట్టుకుని జీవితాంతం అంగ వైకల్యంలో బాధపడతారని, ఇంకా అలాగ ఏవేవో చెప్పారుట."

"అవన్నీ ఆయన నమ్మాడా ?"

"నమ్మటమే కాదు ఇప్పుడు తన కొడుకుని తిరిగి తను కళ్ళచూడలేనని భయపడుతున్నాడు."

"చదువుకున్నవాడు మరీ అంత అజ్ఞానంలో పడిపోతాడా ?"

"ఏంచెప్పను. అసలే వృద్ధాప్యం. అందులో అనారోగ్యం. మానసికంగా శారీరకంగా కృశించి పోయి, వున్న ఒక్క కొడుకూ కళ్ళముందు లేకుండా పోవటంతో ఆయన దిగాలుపడి పోయాడు. ఈ వయసులో ఆయన ధైర్యంగా ఆలోచించే స్థితిలో లేడు" అన్నాడు విశ్వమూర్తి కాంతారావుమీద జాలిపడుతూ.

"పాపం" అన్నాను నేను.

కాంతారావుగారి హృదయం కొడుకుకోసం ఎంత పరితపిస్తోందో కదా. ఈ వయసులో తండ్రిని వదిలిపెట్టి రాజా మిలటరీలో వెళ్ళి మంచి పని చేయలేదు అనిపించింది.

అదే మాట విశ్వమూర్తితో అన్నాను.

"అసలు కాంతారావుకే కొడుకుమీద అంత ప్రేమ వుంది కానీ, రాజు మాత్రం తండ్రి గురించి ఏనాడూ బాధ పడేవాడు కాడు. చదువు కోక సోమరిగా తిరిగి తిరిగి ఎవరికీ చెప్పకుండా మిలటరీలోకి వెళ్ళిపోయాడు. ఇక్కడ ఆ తండ్రిబాధ చూడలేక రాజాకు రెండు మూడు వుత్తరాలు వ్రాసాను. అతని నుంచి జవాబులు వస్తే కాంతారావు కాస్త కుదుట పడతాడేమోనని ఆశ. కానీ అతగాడు జవాబే వ్రాయడు."

"జవాబు వ్రాయక పోవటం ఎందుకు."

"ఎందుకో కాదు. కేవలం నిర్లక్ష్యం. ఆ తండ్రి అతడ్ని అలా పెంచాడు."

"అయితే నేను చెబితే మాత్రం ఆయనకి వూరట కలుగుతుందంటావా."

"కలగవచ్చు. నువ్వు మిలటరీలో పని చేసి

వచ్చావు. మేము చెప్పిన దానికంటె, నీ వాక్యాలు ఆయన బెంగ తీర్చవచ్చు."

"చావు పుట్టుకలు ప్రకృతి సిద్ధమైనవి. పుట్టిన ప్రతి ప్రాణీ చనిపోవటం మనం చూస్తూనే వున్నాము. కేవలం మిలటరీలోకి వెళ్లిన వారు మాత్రమే అకాల మృత్యువాత బడతారనుకోవటం భ్రమ. మిలటరీలోచేరనివాళ్ళు కూడా దైవ నిర్ణయం ప్రకారం అనేక ప్రమాదాలలో చిక్కుకుని చనిపోతున్నారు. అవయవాలు కోల్పోతున్నారు. ఒక్క మిలటరీ సర్వీసు మాత్రమే ప్రమాదకరమైంది అనుకోవటం అర్థరహితం" అన్నాను నేను జీవిత సత్యం విపులీకరిస్తూ.

"నిజమే. అయితే, ఇదే విషయం నువ్వు కాంతారావుకి చెబితే, ఈ వయసులో ఆయన్ని పుత్రశోభ నుంచి తప్పించిన వాడివి అవుతావు" అన్నాడు విశ్వమూర్తి ముగింపు వాక్యంలా.

* * *

నేను గతంలో దాదాపు పది సంవత్సరాలు మిలటరీలో పని చేసి, ఉద్యోగ విరమణ చేసాను. ఆ తరువాత ప్రస్తుతం పని చేస్తున్న డిపార్టుమెంటులో స్థిరపడ్డాను.

రాత్రి భోజనం అయిం తరువాత మంచం మీద నడుంవాలిస్తే, విశ్వమూర్తి చెప్పిన కాంతారావు గుర్తు వచ్చాడు.

పై వాళ్ళకు కాంతారావు పడే ఆరాటం అర్ధరహితం అనిపించినా, తనున్న స్థితిలో ఆయన కొడుకుకోసం అలా బెంగపడటం సహజమేననిపిస్తుంది.

కాంతారావు పరిస్థితి విన్న తరువాత ఆ రోజుల్లో నేను మిలటరీలో పని చేస్తుండగా నా గురించి మా తండ్రిగారు ఆతృతగా వ్రాసిన లెటర్లు గుర్తురాసాగాయి.

ఆ రోజుల్లో మా నాన్నగారు నాకు అనేక జాగ్రత్తలు చెప్పి పంపుతూ వుండేవారు. గృహ సంబంధమైన వ్యవహారాలు నడిపించటానికి మా తమ్ముడు వున్నప్పటికి పెద్ద కొడుకు అయిన నామీద మా నాన్నగారికి ఎంతో ప్రేమ వుండేది. ఆయన నాపట్ల తన ప్రేమను వ్యక్తపరుస్తుంటే అదంతా ఆయన చాదస్తంగా భావించేవాడిని.

కానీ ఈ రోజున జీవితం అంటే అవగాహన ఏర్పడిన ఈ స్థితిలో తండ్రికి కొడుకుపట్ల వుండే రక్తసంబంధం, కన్నప్రేమ, ఆ తండ్రిని ఎంత ఆరాట పెడుతుందో అర్థం అవుతూంది

ఈ రోజున నా తండ్రి లేరు. ఆయన గతించి పది సంవత్సరాలు దాటింది. ఆయనలేని లోటు నాకు తీరనిది.

ఏమిటో! మనసు వికలం అయిపోయింది. గతించిన నా తండ్రి స్మృతులతో నా హృదయం బరువెక్కిపోయింది. ఈ రోజున ఎంత కావాలనుకున్నా నా తండ్రిని నేను చూడలేను.

స్వర్గవాసి అయిన నా తండ్రిని గురించి బెంగపడేకంటె, ఎదురుగా వున్న కాంతారావుకి నేను కొంతసేవ చేయటం నా కర్తవ్యంగా నా మనసు నాకు ప్రభోదించసాగింది.

మరునాడు ఆఫీసునుంచి విశ్వమూర్తితో కలిసి, తిన్నగా కాంతారావుగారి ఇంటికి వెళ్ళాలని నిర్ణయించుకున్నాను. ఈ నిర్ణయం తీసుకున్న తరువాత కానీ నా మనసు ప్రశాంతత చెందలేదు.

* * *

మరునాడు ఆఫీసు చేరుకోగానే –

విశ్వమూర్తి నా సీటుకి వచ్చాడు.

మనిషి ఏదో దిగులుగా కనిపించాడు.

"ఏమిటి అలా వున్నావు" అన్నాను.

"కాంతారావు రాత్రి అంతా ఏడుస్తూనే వున్నాడు" అన్నాడు విశ్వమూర్తి చాలా విషాదంగా.

"ఎందుకు ?"

"కొడుకు కోసం."

"కొడుకుకి ఏమైంది. ఏమైనా లెటరు వచ్చిందా ?"

"ఏమీలేదు. కానీ తక్షణం కొడుకుని చూడాలని పట్టుదలతో వున్నారు. తన కళ్ళతో రాజుని చూసుకునేవరకూ తనకి అన్నం నీళ్ళు సహించవని, భీష్మించుకు కూర్చున్నాడు."

"గొప్ప చిక్కే వచ్చింది. అయితే ఇంట్లో ఇంకా ఎవరున్నారు."

ఆయన భార్య శాంతమ్మ ఒక్కరే ఆయనకి తోడు. ఆమెకూడా వృద్ధాప్యంలోవుంది. ఇద్దరూ కలిసి రాత్రి గగ్గోలు పెట్టి ఏడుస్తుంటే చుట్టుప్రక్కల వాళ్ళు ఎంత వూరడించినా ఫలితం లేకపోయింది."

"పోనీ రాజుని వెంటనే రమ్మని టెలిగ్రాం పంపుదామా ?"

"అక్కరలేదు. తన ట్రైనింగ్ అయిపోతూందట. వారంరోజుల తరువాత సెలవులలో ఇంటికి వస్తున్నట్లు లెటరు వ్రాసాడు."





ఇటీవల హైదరాబాదు విశ్వకళాపరిషత్ వారు శ్రీ త్యాగరాయ గానసభలో నిర్వహించిన సన్మాన సభ సందర్భంగా తీసిన చిత్రం. వేదికపై శ్రీ వేమరాజు నరసింహారావు (సన్మానితులు) పరిషత్ అధ్యక్షులు శ్రీ నూకల చినసత్యనారాయణ, శ్రీ పి. ఎల్. శివరాం, ఐ.ఎ.ఎస్., పద్మభూషణ్ డాక్టరు శ్రీపాద పినాకపాణి, (సన్మానితులు) శ్రీ తంగి సత్యనారాయణ (శాసనసభాధ్యక్షులు) శ్రీ జె. రాంబాబుగార్లని చూడవచ్చు.

## ఆఖరి ప్రయాణం

"మరింకేం. ఆ లెటరు కాంతారావుకి చదివి వినిపించలేదా ?"

"ఆ ఉత్తరం కాంతారావే నాకు చూపించాడు. కానీ వారం రోజులు దాకా ఆగలేను. ముందు నా రాజుని నేను కళ్ళతో చూసుకోవాలి. నన్నువాడి దగ్గరకు తీసుకువెళ్ళు" అంటూ నన్ను ప్రార్థించసాగాడు."

"ఎక్కడో పంజాబు అంటె, వెళ్ళటానికే మూడురోజులు పడుతుంది. ఇంకో మూడు రోజులు ఆగితే ఎలాగూ రాజు వస్తాడు."

"అదేమాట నేనూ అన్నాను. కానీ తనని తక్షణమే రైలు ఎక్కించి తనతోపాటు నన్ను రమ్మంటారు ఆయన ఇదెలా సాధ్యం. ఏది ఎలా వున్నా ఈ వయసులో ఆయన అంతదూరం ఎలా ప్రయాణం చేయగలడు. ఏమిటో అంతా అయోమయంగా వుంది రాత్రి అంతా ఎవరో చనిపోయినట్లు ఆ వృద్ధ దంపతులు ఏడుస్తుంటే ఏం చేయాలో తోచక అలా వుండిపోయాం."

"నేను చాలా విచారిస్తున్నాను" అన్నాను అంతకంటె ఎక్కువగా బాధపడుతూ.

"ఈరోజు సాయంకాలం నువ్వు ఎలాగైనా వచ్చి కాంతారావుతో మాట్లాడాలి" అన్నాడు విశ్వమూర్తి గట్టిగా.

"నేను తప్పకుండా వస్తాను వాళ్ళ ఇల్లు నాకు తెలియదు. మీ ఇల్లు కూడా నాకూ తెలియదు కాబట్టి సాయంకాలం ఇద్దరం కలిసి వెళ్దాము" అన్నాను.

"సరే" అంటూ విశ్వమూర్తి తన సీటుకి వెళ్ళిపోయాడు. కానీ అనుకున్న ప్రకారం ఆరోజు సాయంకాలం కాంతారావుని చూడటం పడలేదు.

అర్జంటుగా పై ఆఫీసరు తనిఖీకి వస్తుంటె ఆఫీసులో వుండిపోవలసి వచ్చింది.

ఆ మరునాడూ కూడా ఏదో స్వంత పనులుండి కాంతారావు ఇంటికి వెళ్ళలేక పోయాను.

మూడవనాడు ఉదయం ఆఫీసుకు బయలుదేరుతుంటె, మా ఇంటి గుమ్మంముందే విశ్వమూర్తి ఎదురయ్యాడు.

"కాంతారావుగారు పోయారు" అన్నాడు శూన్యంలోకి చూస్తూ.

నేను నిలుచున్నచోటనే కొయ్యబారి పోయాను.

నా గొంతు ఎండిపోయింది.

కళ్ళముందు చీకట్లు కమ్ముకుంటున్నాయి. ఏదో మైకంలాంటిది నన్ను ఆవహించింది.

### కొలబద్ద

డాబు, దర్పం<br>
మనిషి గొప్పతనానికి<br>
నిర్వచనాలు కావు —<br>
మంచి, మర్యాద<br>
అతని విలువకు<br>
నిలువుటద్దాలు

— కోలపల్లి ఈశ్వరరావు

నేను స్పృహ కోల్పోతున్నట్లు, కిందికి కూలబడిపోతున్నట్లుగా తెలుస్తోంది.

నాకు స్పృహ వచ్చి కళ్ళు తెరిచేసరికి నేను మా ఇంటిముందు మెట్లమీద పడుకునివున్నాను.

నా చుట్టూ నా భార్యా పిల్లలు గుమిగూడి వున్నారు. విశ్వమూర్తి నాకు గాలి విసురుతున్నాడు.

క్షణకాలం తరువాత తిరిగి శక్తి పుంజుకుని లేచి నుంచున్నాను.

"అదేమిటి అలా పడిపోయావు" అన్నాడు విశ్వమూర్తి అంతులేని భయంతో.

"కాంతారావుగారు నిజంగా పోయారా."

"అవును. తెల్లవారుఝామున చనిపోయారు."

"ఎలా"

"ఏమీలేదు గుండె ఆగి చనిపోయినట్లు డాక్టరు చెప్పారు. రాజుకి టెలిగ్రాం ఇచ్చి ఇలా వస్తున్నాను."

"రాజు వచ్చేసరికి మూడు రోజులు పడుతుందేమో."

"అవును. అయినా అతను ఇక ఎప్పుడు వచ్చినా ఏమీలేదు. ఆ కొడుకు కోసం కలవరించి, ఆ ముసలాయన చనిపోయాడు. ఒక రకంగా తండ్రి చావుకి కొడుకే కారణం" అన్నాడు విశ్వమూర్తి.

"అంతే కాదు విశ్వమూర్తి ! ఆయన చావుకి నేను కూడా కారణమే. ఆ రోజునే నేను నీతో వచ్చి కాంతారావుని కలుసుకుని వుంటె కొడుకు మీద బెంగ తగ్గి ఇంకా కొన్నాళ్ళు బ్రతికి వుండేవాడేమో. ఆ తరువాత రాజు ట్రైనింగ్ నుంచి వచ్చేవాడు."

"ఏమో, ఏం చెబుతాం. ఆయన మృత్యువు అలా వ్రాసిపెట్టి వుంది" అన్నాడు విశ్వమూర్తి వైరాగ్యంగా.

కానీ కాంతారావు మరణం నేను అంత తేలికగా తీసుకోలేకపోయాను.

"నీ నిర్లక్ష్యం కారణంగానే కాంతారావు ఆకస్మికంగా మరణించాడు. నువ్వు దోషివి" అంటూ నా అంతరాత్మ నన్ను నిలదీయసాగింది.

నా తప్పుకు ప్రాయశ్చిత్తం చేసుకునే వరకూ నాకు శాంతి లభించేలా లేదు.

రాజు రావటానికి ఇంకా మూడు రోజుల వ్యవధి వుంది. అంత వరకూ ఆగటానికి వీలు లేదు.

రాజు స్థానంలో నేను నిలబడి కాంతారావు అంత్యక్రియలు జరిపించాను.

బ్రతికి వుండగా ఒక్కసారి అయినా ఆయనను చూడని నేను, చనిపోయిన తరువాత అదే వ్యక్తి పట్ల ఇంత ప్రేమ నాకెందుకు కలుగుతూంది ?

మనిషికి మనిషికి మధ్య ప్రేమ కలగటం కోసం రక్తసంబంధమే వుండనవసరం లేదని పించసాగింది. 




### ఎం. కె. ఆర్. – విశాఖపట్నం

24–2–84 న మీ సమాధానం మీ స్టాండర్డుకి ఒక గొడ్డలి పెట్టు వంటిది. ...

★ చాలామంది యీ జవాబు చదివి, 'అయ్యో నేను మగపిల్లవాడిగా పుట్టలేదే' అని నేను ఏడుస్తున్నానని అనుకుంటున్నారు. మీరు అక్షరాలే చదువుతారు గాని స్పిరిట్ చదవరెందుకు ? ఆదర్శ యువకుడిలా వుండాలన్నది– నేర్పలేని విద్య. అందుకే నేనే అయితే నా జీవన విధానం ద్వారా నిరూపించి ఉండేదాన్నన్నమాటకు రాశాను. నాకీ జన్మ చాలు. నేను ఆదర్శ యువతిగా పెరిగాను. ఇష్టం వచ్చినది చదివాను. కోరుకున్న వాడిని పెళ్ళాడాను– ఉద్యోగం కావాలనుకుని చేశాను, వద్దనుకొని మానేశాను. పిల్లలు కావాలనుకొని కోరి కన్నాను. కావాలనుకున్నంత మందినే కన్నాను. కూతుళ్లే నన్న బాధ లేదు. కొడుకుల్లాంటి అల్లుళ్లు రాలేదా! అంచేత నేను మొగపుట్టుక కోరి బాధతో రాయలేదు. మాటల్లో చెప్పలేనిది–చూపించే అవకాశం కల్గివుండేదని రాశానంతే. మా నాన్న నన్ను కొడుకుని పెంచినట్టు పెంచాడు. నేనాయిన్ని స్నేహితుడిగా చూశాను. నాకు యీ జీవితంలో అసంతృప్తి లేదు ... ఇక "మీ ఇంటలెక్చువల్ కెపాసిటీకి ఎప్పుడూ విధేయుడనేగాని వ్యక్తిగతాభిప్రాయాలకి వ్యతిరేకిని" అన్నారు. ఫరవాలేదు– నా వ్యక్తిగత అభిప్రాయాలతో తు. చ తప్పక మీరు ఏకీభవించాలని ఎక్కడుంది ? అభిప్రాయ బేధాల మధ్య కూడా వ్యక్తుల మధ్య గౌరవం పెంపొందడమే నాగరికతగా నేను భావిస్తాను ...

### బి. డి. – కొండపల్లి

నాకు మోడల్‌గా పని చేయాలని వుంది. ఎవరిని సంప్రదించాలి ?

★ ఏ ఎడ్వర్టైజింగ్ ఏజెన్సీవారితోనైనా సంప్రదించండి.

### ఎం. వి. – బేతవోలు

మద్య నిషేధం అమలు చేయాలంటూనే ప్రభుత్వం సారా కంట్రాక్టు లిస్తుందేమిటి ?

★ మొదటిది ఆదర్శం – ఆగవచ్చు, రెండోది–రాబడి–డిలే చేయక అందుకోవాలి.

### జి.ఎమ్. – విశాఖపట్నం

అక్కయ్యా, జీవితంలో సుఖం అనుభవించ లేదు. కాని భగవంతుడు అన్నీ కష్టాలే పెడుతున్నాడు. తరవాత సుఖపడతానని లేదు నాకు. ఇది దురదృష్టమా ?

★ కాదు. జీవితం ఒక్క సుఖపడడానికే నన్న అపోహ మీలో నిరాశకి కారణం... జీవితంలో సుఖపడడం ఒక భాగమే... మిగిలినది చాలా వుంది భాయీ – దాన్ని గురించి ఆలోచించుకోవడంకూడా అలవాటు చేసుకోవాలి.

### పి.ఎన్. – కువామడ

నేను ఒక అమ్మాయిని ప్రేమిస్తున్నాను. ఆమె నన్ను ప్రేమిస్తున్నదా లేదా తెలుసుకోవాలంటే ఎలా ?

★ మీ వూళ్లో చాలా సులభం ! ఆమె – మీకు చెప్తే ప్రేమిస్తున్నట్టు. అధికారులకు చెప్తే – లేనట్టు !

### యు.ఎల్.ఆర్. – ముదిగుబ్బ

నన్ను మీ అల్లుడుగా స్వీకరిస్తారా ? తమ్ముడుగా ప్రేమిస్తారా ? కొడుకుగా అభిమానిస్తారా ? తొందరగా చెప్పకపోతే మిమ్మల్ని షూట్‌చేసి నేను జైలుకి పోతాను. ఏమంటారు?

★ ఇలా పిచ్చివాగుడు వాగకపోతే మనిషిగా గౌరవించేదాన్ని !! ఆ ఛాన్సు పోగొట్టుకున్నారు !

### కె.ఎల్.ఎస్.డి. – హైదరాబాదు

మేం ప్రేమించుకున్నాం. కులం వేరుచేత పెద్దలు ఒప్పుకోవడంలేదు. ఎక్కడికైనా వెళ్లిపోవడం నా కిష్టంలేదు. ఒకవేళ అలా చేసినా బ్రతకడం కష్టం– చదువుకుంటున్నాం.

★ ఇంత తెలిసి ప్రేమలో ఎలా పడ్డావు చిట్టితల్లీ. చదువు/ఉద్యోగం/సంపాదన లేకుంటే ప్రేమ పెళ్లి కాగానే– ఎగిరిపోతుంది !

### ఎమ్. ఆర్. డి. – బళ్ళారి

మీ అమ్మాయి లలితారుద్ర రాసిన 'పారిపోయిన వసంతం' చదివాను. బాగుంది. అగ్ని పంజరం చదువుతున్నాను. ఇది ఆమె స్వయంగా రాసిందా ? మీరేనా ఆరుద్రగారేనా సహాయం చేశారా ?

★ ఎందుకు చెయ్యాలి ? లలిత తెలివైన పిల్ల. దాని రచనలు అది చేసుకోకలది.

మద్రాసులో వుండి ఇంగ్లీషు చక్కగా చదివి ఆమె తెలుగులో యింత బాగా ఎలా రాయ కల్గారు ?

★ మాతృభాష రావడంలో గొప్పేముంది. నేను ముగ్గురు పిల్లలనీ 5వ తరగతి దాకా తెలుగులో చదివించాను. లేకపోతే తెలుగు రాదని. తరవాతే ఇంగ్లీషుకి మారారు. నా కుమార్తెలు ముగ్గురూ తెలుగులో క్లాసులు తెచ్చుకున్నవాళ్లే. అదో గొప్ప అని వాళ్ళా అనుకోవడం లేదు. నేనూ అనుకోవడంలేదు–

మీకు ముగ్గురమ్మాయిలు కదా? మిగిలిన ఇద్దరూ ఏం చేస్తున్నారు ?

★ ఇద్దరికి పెళ్లిళ్ల అయ్యాయి. చిన్నది ఉద్యోగం చేస్తూంది. లలిత మా రెండవ అమ్మాయి.

మాలతీచందూర్‌గారిపై మీ అభిప్రాయం?

★ ఆమెమీద నేను అభిప్రాయం చెప్పను. ఎందుకంటే నేనామె చెప్పిన మాట వింటాను ! మాలతి నాకున్న కొద్దిమంది ఆత్మీయులలో ఒకరని గర్వంగా చెప్పుకుంటాను.

### బి. ఎస్. ఎన్. – చిట్టివలస

ఆడది ఆదిశక్తి కాదు. వంటింటి కుందేలు అంటాను. మీరేమంటారు ?

★ ఇంట్లో కుందేల్లాంటి వాళ్లే ఇలాంటి ప్రగల్భాలు పల్కేది అంటాను ! ★






మర్నాడు రోజంతా కృష్ణకు తన అన్నయ్యతో పాటు ఊరంతా తిరగడమే సరిపోయింది.

సాయంత్రం బస్‌స్టాండ్‌కెళ్ళి ఆయనను బస్సెక్కించాకగానీ తేలికగా ఊపిరి పీల్చుకోలేకపోయాడు.

బస్ బయల్దేరడానికి ఇంకో పదినిముషాలు టైముంది.

''ఇదిగో! ఈ డబ్బు తీసుకో! ఈ కారుకీ దానికీ బోలెడు ఖర్చవుతుంది కదా...'' అన్నాడు శీతారామయ్య జేబులోనుంచి కొన్ని వందనోట్లు తీసి కృష్ణకిస్తూ.

కృష్ణ ఆనందంగా ఆ డబ్బు తీసుకుని జేబులో పెట్టుకున్నాడు.

''ఊరికే సినిమాలకూ దానికీ తిరగకండి! పరీక్షలయ్యాక తిరగడానికి బోలెడు టైముంటుంది...''

''అలానే అన్నాయ్...''

''శుక్రవారం వస్తున్నావని చెల్లాయికి చెప్తాను!...''

బస్ స్టార్టయ్యాక కారు గారేజ్‌లో ఇచ్చేసి ఇంటికి చేరుకున్నాడతను. మర్నాడు ఉదయం తొమ్మిదయినా ఇద్దరికీ మెలకువ రాలేదు.

ఎంతోసేపునుంచీ ఫోన్ మోగటంవల్ల ముందు కృష్ణకే మెలకువ వచ్చింది.

''ఒరేయ్! కొంచెం ఆ ఫోన్ చూడరా...'' బద్ధకంగా ప్రసాద్‌తో అన్నాడతను.

ప్రసాద్ కళ్ళు నులుముకుంటూ లేచి ఫోన్ అందుకున్నాడు.

''హలో...''

''హలో–ఎవరు?''

''నేను. ప్రసాద్‌నండీ! మీరెవరు?''

''చంద్రకళ! మీ ఫ్రెండ్‌లేరా?''

''ఉన్నాడండీ! ఒక్కనిమిషం–'' అంటూ ఫోన్ అక్కడపెట్టి ''మీ చంద్రకళ ఫోన్‌రా! లే'' అంటూ అరచాడతను.

కృష్ణ ఒక్క ఉదుటున లేచి ఫోన్ దగ్గరకు పరుగెత్తాడు.

''హల్లో డియర్...''

''ఇంకా నిద్రలేవలేదా?''

## (గత సంచిక తరువాయి)

''ఎక్కడ–రాత్రి మా అన్నయ్యను పంపించి వచ్చేసరికి బోలెడు డిలే అయిపోయింది.''

''అయితే నేనిప్పుడు రావచ్చన్నమాట...''

''ఇప్పుడా?''

''అంటే ఇంకోగంట తర్వాత...''

''ఓ! రా చంద్రా! నీ కోసం వెయిట్ చేస్తుంటాను...''

''తీరా వచ్చాక ఇంకేదో ప్రోగ్రాం ఉందని మళ్ళీ గెంటెయ్యవుకదా...''

''నోనో – నిన్ను రావద్దనడం నాకు మాత్రం ఆనందమనుకున్నావా చంద్రా.''

''ఓకే – ఉంటానలా అయితే–''

''త్వరగా వచ్చేసెయ్.''

''ఊ...''

ఫోన్ పెట్టేసిందామె.

''ఈ రోజు కార్యక్రమం ప్రారంభమయిపోయిందన్న మాట!'' అన్నాడు ప్రసాద్ చిరాగ్గా.

''మధ్యలో నీకెందుకురా ఏడుపు?''

''ఎందుకేమిట్రా! ఈ పద్ధతిలో ఈ సారిగూడా పరీక్ష గోవిందా.''

''నాదెలాగూ గోవిందాయే! నువ్వు శుభ్రంగా చదువుకుని పాసవరా నాయినా!''

''నేనెక్కడ చదువుకుంటాను? పుస్తకం తీసేసరికి ఫోను – 'హలో కృష్ణగారున్నారా?' అంటూ. లేదా ''కొత్త అమ్మాయ్ వస్తోందిరా! నిన్ను చూస్తే బెదిరిపోతుంది. కొంచెం అయిదారు గంటలపాటు రోడ్ల వెంబడి తిరిగి రామ్మా ప్రసాద్! ఇదిగో ఈ పాతిక రూపాయలూ బఠానీలు కొనుక్కో'' అంటూ నన్ను బయటికి గెంటేయడం – నేను సినిమాలు చూసుకుంటూ బఠానీలు తింటూ రోడ్లమీద జీవితం గడిపేయడం – ఇంకేం చదువొస్తుంది నాకు – నేనేం పాసవుతాను...'' అతను మాట్లాడుతూంటే నవ్వాపుకున్నాడు కృష్ణ.

''ఒరేయ్! నువ్వెప్పుడయినా ఎలక్షన్లో నిలబడ్డావా?''

''ఎందుకు?''

''స్పీచి చాలా బాగా ఇస్తున్నావ్! నిలబడితే బాగుంటుందని...''

''నీతో రూమ్‌లో ఇంకొంతకాలం ఉంటే చివరకు ఆ ఉద్యోగం ఒక్కటే మిగుల్తుంది మనకి!...''

''ఏడ్వావ్‌లేగాని – త్వరగా రడీ అయి బయటకు పో! పానకంలో పుడకలాగా చంద్రకళకూ నాకూ మధ్య ఈ ఇంట్లో నువ్వెందుకు?''

''వెళ్తాన్రా నాయినా వెళ్తాను! మీకేమీ అడ్డురాన్లే ... ఏమయినా గట్టిగా మాట్లాడితే నన్ని ఇంట్లోనుంచి బయటగ్గెంటి పారేశేయగల కెపాసిటీ నీకుంది...'' అంటూ టూత్‌బ్రష్ తీసుకుని బాత్‌రూమ్ వేపు వెళ్ళాడతను.

మరికాసేపట్లో చంద్రకళ వచ్చేసరికి కృష్ణ అందంగా డ్రస్ చేసుకుని ఆమెకోసం ఎదురుచూస్తున్నాడు.

ఆమె లోపలకు రాగానే తలుపు గడియ పెట్టేసి అమాంతం ఆమెను కౌగలించుకుని మొఖమంతా ముద్దులతో నింపేశాడతను.

''అబ్బబ్బ–ఇంత ప్రేమ ఉండేనా– రెండు రోజుల్నుంచీ రావద్దు పొమ్మన్నారు?'' అందామె కోపంతో.

''సారీ డియర్–అయామ్ హెల్ప్‌లెస్...''

ఆమె కోపం కరిగిపోయింది.

అతని కౌగిలిలో ఒదిగిపోయింది.

ఆమెను అమాంతం చేతుల్లోకి ఎత్తుకుని పడగ్గదివేపు నడిచాడతను. ప్రణయకలాపాలతో ఎంతసేపు మునిగిపోయారో ఇద్దరికీ తెలీదు.

ఫోన్ మోగడంతో కృష్ణకు ఆమె కౌగిలి నుంచి బయటపడక తప్పలేదు.

వెళ్ళి ఫోన్ అందుకున్నాడు.

''ఏరా! ఇంక నేను ఇంటికి రావచ్చా? ఇంకా రోడ్లు మీదే తిరుగుతూండాలా?'' అడిగాడు ప్రసాద్ ఫోన్లో.

''డోంట్ డిస్టర్బ్–ఇడియట్'' అంటూ ఫోన్ పెట్టేశాడు కృష్ణ.

''ఎవరు?'' నవ్వుతూ అడిగింది చంద్రకళ అతనిని తిరిగి తనమీదకు లాక్కుంటూ.

''ప్రసాద్‌గాడు.''

''ఏమిటంటాడు?''

''ఇంటికి రావచ్చా అనడుగుతున్నాడు.''

**జరిగిన కథ–2 :** కృష్ణ, ప్రసాదు స్నేహితులు. కృష్ణ తనో డాక్టరుగా ఆ హాస్పిటల్ సిస్టర్‌కు చెప్పి తన పేషంటు ఒకామెకు ఇంజక్షన్ చేయడానికి ఆమెను రమ్మని వేడుకుంటాడు. కృష్ణ అన్న సీతారామయ్య వస్తున్నట్లు టెలిగ్రాం ఇస్తాడు. సిస్టర్ కృష్ణ ఇంటికి వస్తుంది. కృష్ణ విచ్చలవిడి ప్రవర్తనకు ప్రసాద్ చికాకు చెందుతాడు. తమ్ముడు అనుభవిస్తున్న ఆడంబరమైన జీవితాన్ని చూసి సీతారామయ్య ఆనందిస్తారు.

ఆమె పగలబడి నవ్వేసింది.

''పాపం ! ఎక్కడ ఉన్నాడిప్పుడు...''

''రోడ్డుమీద...''

ఇద్దరూ తనివితీరా ప్రణయం జరిపాక ఆమె లేచి చీర కట్టుకోసాగింది.

''నేను మహా అయితే ఇంకో నెల రోజులే నీ దగ్గరకొచ్చేది...'' అంది అతనివంక చూసి నవ్వుతూ.

''ఎందుకని ?'' ఆశ్చర్యంగా అన్నాడు కృష్ణ.

''వచ్చే నెలాఖరులో నా మారేజ్ ఉంటుంది...''

''వచ్చే నెలాఖరు లోగానా ?''

''అవును !''

కృష్ణ మాట్లాడలేకపోయాడు.

చంద్రకళ ఆ తరువాత తనకు దూరమయి పోతుందంటే బాధగా ఉంది.

పూర్తిగా సెక్స్ స్వాతంత్రం ఇచ్చింది ఆమొఖ్కర్తే.

ఆమె కెలాంటి సిగ్గూ, మొఖమాటంలేవు.

తనెలా కోరితే అలా ప్రణయం జరపడానికి అంగీకరించేది.

ఆమె దగ్గర లభించే ఆనందం మరే స్త్రీ దగ్గరా లభించదని తనకు తెలుసు.

''ఏమిటలా అయిపోయావ్ ?'' బట్టలు కట్టుకుని అతని దగ్గరకొచ్చి నిలబడిందామె.

''నిజంగా— మారేజ్ అయాక నాకు కనిపించవా ?''

''నో .''

''ఎందుకని ?''

''దటీజ్ ఎగినెస్ట్ మై విల్—''

''అంటే ?''

''మన ఎఫైర్ నా పెళ్ళయేవరకే ! పెళ్ళయాక మా ఆయనను డిసీవ్ చేయడం నాకిష్టం లేదు ...''

''అంటే— ఇప్పుడు ఇలా చేయడం డిసీవ్ చేసినట్లు కాదా ?''

''నా ఉద్దేశ్యంలో కాదు –''

అతను నవ్వాడు.

''చాలా స్ట్రేంజ్ అయిడియా –''

''ఇందులో వింతేముంది ? సెక్స్ ఓ పాపంగా నేను భావించను. అది మన శరీరానికి కావలసిన అనేక అవసరాల్లో ఒకటి ! కనుకే నీ దగ్గరకొస్తున్నాను. పెళ్ళయాక ఆ సెక్స్ భర్త దగ్గర దొరుకుతుంది. ఇంకెందుకు నీ దగ్గరకు రావాలి ?''

''అంటే మన మధ్య సెక్స్ తప్పితే ఇంకే విధమయిన సంబంధంలేదన్నమాట !'' నవ్వుతూ అడిగాడతను.

''ఏయ్ ! నువ్వే నిజంగా, సిన్సియర్‌గా చెప్పు ! నువ్వు నన్ను కావాలనుకుంటోంది కేవలం సెక్స్ కోసమా, కాదా ?''

''అఫ్‌కోర్స్ –''

''సేమ్ విత్ మి ! నాకు సెంటిమెంట్స్ చాలా తక్కువ. మనం ఒకరికొకరు ఎట్రాక్ట్ అయింది సెక్స్ కోసం! దానికి ప్రేమ–గోంగూర అని పేరు పెట్టుకుని ఒకరికొకరు ఎందుకు మోసగించుకోవడం? ఒకవేళ నిజంగానే ప్రేమలో పడ్డామనుకో! అప్పుడు 'సెక్స్' ప్రాధాన్యతపోయి లేనిపోని సమస్యలు ప్రారంభమవుతాయ్. అందుకే అలాంటి పిచ్చి ఆలోచనలు నాకెప్పుడూరావు. నాకేం కావాలో నీకు తెలుసు. నీకేం కావాలో కూడా నాకు తెలుసు. లెటజ్ హేవిట్– అంతే ! దానికి ఏవేవో రూపాలు, పేర్లూ వద్దు ...''

కృష్ణ లేచి ఆమెను కౌగలించుకుని ముద్దు పెట్టుకున్నాడు.

''చంద్రా ! ఆడపిల్లలందరూ నీలాంటి పవిత్రమయిన అభిప్రాయాలు గలవారయితే ఎంత బావుంటుంది...'' అన్నాడు నవ్వుతూ.



"ఓహో! అప్పుడు మగాళ్ళందరూ నీలాగా శ్రీకృష్ణపరమాత్మ లవుతారనా?" ఆమె తన బాగ్ తీసుకుని అద్దంముందు నిలబడి మొఖానికి పౌడర్ అద్దుకోసాగింది.

"మళ్ళీ ఎప్పుడు దర్శనం?" అడిగాడతను.

"రేపే..."

అతను బయటివరకూ నడిచాడు ఆమెతో.

"నువ్వెక్కడికి?" గడపదగ్గర ఆగి అతని నడిగింది చంద్రకళ.

"నిన్ను ఆటో ఎక్కిస్తాను..."

"నేనేం చిన్న పాపాయిని కాదులే! నా పక్కన నువ్ రావడం ఎవరయినా చూస్తే తలనొప్పి —"

అతను నవ్వాడు.

"ఓకే —" వెనక్కు తిరిగాడు.

ఆమె వెళ్ళిపోయింది.

కృష్ణ లోపలికొచ్చేసరికి ఫోన్ మళ్ళీ మోగుతోంది.

"హలో." అన్నాడతను చిరాగ్గా రిసీవర్ అందుకుని.

"ఏరా నాయనా! కృష్ణలీలలు అయిపోయాయా — ఇంకా లేవా?"

"నీకు రన్నింగ్ కామెంటరీ ఇవ్వలేక ఛస్తున్నాన్రా!..."

"వెళ్ళిపోయిందా?"

"ఆ!"

"అయితే వచ్చేస్తున్నా..."

"రాక ఇంకెందుకక్కడ? త్వరగా తగలడు. బోర్ కొట్టి ఛస్తున్నాను..."

ఫోన్ పెట్టేశాడతను.

"మే అయ్ కమిన్..." అంటూ గడపలో నుంచి వినిపించిన గొంతువిని ఉలిక్కిపడి అటు వేపు చూశాడు కృష్ణ.

మార్గరెట్ చిరునవ్వుతో నిలబడి ఉందక్కడ.

కృష్ణ ఆశ్చర్యపోయాడు.

"మీరా?"

ఆమె జవాబివ్వకుండా మందహాసం చేసింది.

"రండి! రండి!" ఆశ్చర్యంనుంచి తేరుకుని ఆమెను లోపలికి ఆహ్వానించాడతను.

ఆమె వచ్చి సోఫాలో కూర్చుంది.

అతను ఆమెవంకే కళ్ళార్పకుండా చూడసాగాడు.

ఆమె అలంకరణలో చాలా మార్పుఉందీ సారి. అంతకు ముందుకంటె రెట్టించిన అందం తొణి సలాడుతుంది.

"ఏమిటలా చూస్తున్నారు..." ఇబ్బందిగా అందామె.

"నాకింకా నమ్మబుద్ధి కావడంలేదు— వచ్చింది మీరేనని..."

"అయ్యో! అదేమిటి? మీ ఎదురుగ్గా కూర్చున్నా నమ్మకం కలగటం లేదా?" నవ్వేస్తూ అందామె.

"ఒకసారి మనం కావాలనుకున్న వ్యక్తి గురించే ఆలోచిస్తూంటే—ఆ వ్యక్తే ఎదురుగ్గా వచ్చినట్లు భ్రమ కలుగుతుంది కదా— ఇప్పుడూ అలాగే జరుగుతుందేమోనని..."

"అంటే మీరు నా గురించే ఆలోచిస్తున్నారా ఇప్పుడు?" అడిగిందామె.

"అవును! ఇప్పుడేమిటి? ఆ రోజు మీరు వెళ్ళిపోయిన దగ్గర్నుంచీ మీ గురించే ఆలోచనలు..."

"ఎందుకు?"

"మళ్ళీ ఎప్పుడొస్తారా అని..."

ఆమె సిగ్గుపడింది.

"ఇటు మా ఫ్రెండ్ ఇంటికెళ్తూ— మీరున్నారేమో చూచిపోదామని వచ్చాను" అంది అతనికోసం రాలేదన్నట్లు.

"మీ ఫ్రెండ్‌కి నిజంగా పద్మశ్రీ ఇవ్వాలండి!"

"ఎందుకు?"

"నా కెంత గొప్ప సేవ చేసిందో చూశారా ఆవిడ. ఆమె ఈ ప్రాంతంలో ఉండబట్టేగదా మీరు ఇక్కడికొచ్చేరు— లేపోతే అసలిటువేపు తొంగిచూచేవాళ్ళే కాదు..."

ఆమె నవ్వేసింది.

## హార్ట్ ఎటాక్

ఈ ఉదయం —

హృదయాకాశంలో
ఫెళఫెళార్భాటాలతో
జలజలా వర్ష ధారలతో
మనసు ముద్దయిపోయి
ముసురు ముంచుకొచ్చేసింది!
పిడుగులా సమస్య
గుండెల్లో దిగబడింది!

* * *

ఇప్పుడు

ఆ హృదయాకాశం —
మండిపోయిన కాలంలా
పండిపోయిన రూపంలా
స్మశానపు నిశ్శబ్దంలా
— వుంది!

ఇక పలుకదీ హృదయం
ఇక చేయదీ ఆకాశం
దరహాసం!

— యన్నంరెడ్డి వెంకటరెడ్డి

"అదేం కాదులెండి— ఇక్కడికి రావాలని కూడా అనుకుంటూనే ఉన్నాను-"

"అంత దయ ఉన్నందుకు చాలా థాంక్స్"

వాళ్ళు మాట్లాడుతూండగానే ప్రసాద్ ఈసురోమంటూ లోపలికొచ్చి "రోడ్ల వెంబడి తిరగలేక చచ్చాన్రా దేవుడా..." అంటూ సోఫాలో కూర్చున్న మార్గరెట్‌ని చూచి గతుక్కుమన్నాడు.

"వీడు నా స్నేహితుడూ, రూమ్మేటూ ప్రసాదండీ! ఈమె నా ఫ్రెండ్ మార్గరెట్—" వారిద్దరి పరిచయం చేశాడు కృష్ణ.

"నమస్కారమండీ" అన్నాడు ప్రసాద్.

"నమస్తే" అందామె.

"నీకేదో అర్జంటు పనుందనీ మధ్యాహ్నం రెండింటి వరకూ రాననీ అన్నావు కదురా?" ప్రసాద్ నడిగాడు కృష్ణ.

"ఇంకా ఆ పని మీదే ఉన్నాను — మధ్యలో దాహమయితేనూ మంచినీళ్లు తాగి వెళ్దామని వచ్చాను" కోపంగా అని లోపలికెళ్లి మంచినీళ్లు గడగడ తాగి మళ్లీ బయటి కెళ్లిపోయాడు ప్రసాద్.

"అదేమిటి — మంచినీళ్ల కోసం ఇంటి కొచ్చాడా?" ఆశ్చర్యంగా అడిగింది మార్గరెట్.

"అవును! వాడికి ఎప్పుడూ ఫిల్టర్ చేసిన మంచినీళ్లే తాగడం అలవాటు. అందుకని ఎప్పుడెక్కడ దాహం వేసినా ఇంటికొచ్చి ఇక్కడి నీళ్లే తాగి వెళ్తాడు" అన్నాడు కృష్ణ తడబడకుండా.

"తమాషాగా ఉంది" అందామె నమ్మలేనట్లు.

"వాడు చేసే పనులన్నీ తమాషాగానే ఉంటాయ్‌లెండి" నవ్వుతూ అన్నాడతను.

"నేను మీ టైమ్ పాడుజేయటంలేదు కదా?" అడిగిందామె.

"పాడుజేయటమేమిటండీ! వృధాఅవుతున్న టైమూ బంగారంగా మార్చేస్తున్నారు. అన్నట్లు మనం ఇంక బయల్దేరదామా?"

"ఎక్కడికి?" ఆశ్చర్యంగా అడిగిందామె.

"ముందు లంచ్‌కి! ఆ తరువాత మిగతా ప్రోగ్రామ్ సంగతి మాట్లాడుకుందాం!"

"సారీ! నేను ఇంటి కెళ్లిపోవాలి!"

"ఎందుకు? మీకివాళ ఆఫ్ కదూ?"

"మీకెలా తెలుసా విషయం?"

"లేకపోతే ఇంత లీజరీగా ఇక్కడికెందుకొస్తారు?" నవ్వుతూ అన్నాడతను.

"ఆఫ్‌కోర్స్—"ఆఫ్" అన్న మాట నిజమే గాని నాకు కొంచెం పని ఉంది."

ఆమె అబద్ధం చెప్తోందన్న విషయం కృష్ణకు అర్థమవుతూనే ఉంది ఆడాళ్ళల్లో చాలా మంది అంతే!

తమ కిష్టమయిన పనిని ఎదుటి వారి ఇష్టం కోసం చేస్తున్నట్లు నమ్మించడం —

"పోనీ లంచ్ తర్వాత వెళ్ళిపోదురు గాని — ప్లీజ్ !..." బతిమాలాడతను.

ఆమె నవ్వింది "సరే—" కృష్ణ ఆనందంగా బయటకు నడిచాడు.

ఇంటి ముందు స్కూటర్ ఉండటం చూచిందామె. అతను ఎక్కి కూర్చున్నాడు.

"సారి మార్గరెట్! కారు రిపేర్‌కెళ్ళింది"

"ఓ—కే. దట్సార్‌రైట్..." అంటూ అతని వెనక కూర్చుందామె. ఆమె శరీరం మధ్య మధ్యలో అతనిని స్పృశిస్తూనే ఉంది.

బీచ్ రోడ్డు వెంబడే ప్రదక్షణంచేసి మళ్ళీ అదే హోటల్‌ని చేరుకున్నాడతను.

ఇద్దరూ ఎ. సి. రూమ్‌లోకెళ్ళి కూర్చున్నారు.

"నిజంగా చెప్తున్నాను. ఏమీ తోచటం లేదు. మీ ఇంటికొద్దామా అనుకున్నాను గానీ మీరు ఎంబ్రేసింగ్‌గా ఫీలవుతారేమోనని ఆ అయిడియా డ్రాప్ చేసుకున్నాను..." అన్నాడతను భోజనానికి ఆర్డరిచ్చాక.

"రావలసింది! మా ఇంట్లో అలాంటి అబ్జెక్షన్స్ ఏమీ ఉండవు..." చిరునవ్వుతో అందామె.

"అయితే లంచ్ అయాక మనం పిక్చర్ కెళ్దాం!"

ఆమె మౌనంగా ఉండిపోయింది.

"ఏమండీ! మాట్లాడరేం?" ఆత్రుతగా అడిగాడు కృష్ణ.

"నాకు వేరే పనుంది..."

"ప్లీజ్! ఈ ఒక్కరోజు నా కోసం స్పేర్ చేయండి! మీ పనంతా రేపు హాయిగా చేసేసుకోవచ్చు..."

"పోనీ పిక్చర్‌కే ఇంకోసారి వెళ్ళవచ్చుకదా."

"ఊహూ! నాకు 'రేపు' మీద నమ్మకం లేదు."

"నాకుంది."

ఇద్దరూ నవ్వేశారు.

"అయితే వప్పుకున్నట్లేకదూ — థాంక్యూ వెరీ మచ్ —"

"అయ్యో! — నేనేమీ చెప్పందే థాంక్స్ అనేస్తారెందుకు?"

"వప్పుకున్నారనే అనుకున్నాను! సరే పోనీండి! "థాంక్స్" చెప్పాక ఇంక మళ్ళీ వెనక్కు తీసుకోవడం కుదరదుకదా! అంచేత దయచేసి వప్పేసుకోండి..." ఆమె నవ్వేసింది.

"సరే — అలాగే కానీండి."

బేరర్ తెచ్చిన బిల్ కట్టేశాడతను.

స్కూటర్ మళ్ళీ బీచ్ రోడ్డుమీదనుంచి బయల్దేరింది. కావాలనే కొంచెం రఫ్‌గా డ్రైవ్ చేయసాగాడు కృష్ణ.

ఆమె అతనికి మరింత సన్నిహితంగా జరిగి కూర్చుంది ఆ జెర్క్‌లకు.

"ఏ పిక్చర్ ఇష్టం మీకు, తెలుగా, హిందీయా, ఇంగ్లీషా?" అడిగాడతను.

"మీ ఇష్టం! ఏదయినా సరే! అయ్ లైక్ ఆల్..."

"ఓకే..." ఓ ఇంగ్లీష్ పిక్చర్ ఆడుతున్న థియేటర్ ఆవరణలో స్కూటర్ ఆపాడు.

కొత్త పిక్చర్ అవడంవల్ల చాలా రద్దీగా ఉంది. లేడీస్ 'క్యూ' కొంచెమందే ఉన్నారు.

రెండు రిజర్వ్‌డ్ టికెట్స్ తనే తీసుకొచ్చింది మార్గరెట్.

ఇద్దరూ లోపలికెళ్ళి కూర్చున్నారు.

ఆమెకు అవతలివేపు మరో పురుషుడు కూర్చోవడంతో ఆమె కృష్ణవేపు వదిగి కూర్చోక తప్పలేదు.

సినిమా మధ్యలో ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడతను. ఆమె చటుక్కున తన చేయి వెనుకకు లాగేసుకుంది.

అతను కొంచెం జంకాడు. ఆదివరకటి అనుభవాల్లో ఎప్పుడూ ఏ యువతీ ఇలా ప్రవర్తించలేదు.

"అయామ్ సారీ!" అన్నాడు నెమ్మదిగా.

ఆమె మాట్లాడలేదు.

"తప్పు నాది కాదు. మీదే..." కొద్ది క్షణాల తర్వాత తిరిగి అన్నాడు.

ఆమె అతనివంక చూసింది ఆశ్చర్యంగా.

"అవును! మీరింత అందంగా వుండబట్టే మనసు చలించిపోయింది..." నవ్వాపుకుందామె.

అలా నవ్వడం అతనికి మళ్ళీ ధైర్యం ఇచ్చింది.

మరోసారి ఆమె చేతిని తాకాడు.

ఆమె అతని చేతిని మృదువుగా నిమిరింది.

ఛటుక్కున ఆమె చేతిని తీసుకుని పెదాలకు హత్తుకున్నాడతను.

ఆమె నెమ్మదిగా తన చేతిని వెనుకకు లాగేసుకుంది

అతనిని ఆనందం ఊగించేసింది.

ఇంక ఫరవాలేదు.

తను పడ్డ శ్రమకు ఫలితం దక్కినట్లే— ఇవాళో, రేపో — అంతే — ఈలోగానే ఆమె తన సొంతం అయిపోతుంది.

సినిమా ముగిశాక మళ్ళీ స్కూటర్‌మీద బయల్దేరారు.

"మీరు నా నడుము పట్టుకుంటే— ఈజీగా కూర్చోవచ్చు..." స్కూటర్ నడుపుతూ మధ్యలో అన్నాడతను.

ఆమె అతనికి ఆనుకుని తన చేయి అతని నడుముచుట్టూ వేసింది.

ఇద్దరూ బీచ్‌కెళ్ళి కూర్చున్నారు.

బీచ్‌లో కోలాహలంగానే ఉంది.

కార్లూ, స్కూటర్లూ నిండిపోయినాయ్. పిల్లలు ఇసుకలో ఆడుకుంటున్నారు.

"మార్గరెట్! మీలాంటి అందమయిన అమ్మాయి స్నేహితురాలిగా లభించడం నిజంగా నా అదృష్టం" ఆమె కళ్లలోకి తదేకంగా చూస్తూ అన్నాడతను.

"మీరు మాత్రం అందంగా లేరూ?" చిరునవ్వుతో అడిగిందామె.

"ఏమో! అది సందేహమయిన విషయమే! నేను మీరంటున్నంత అందంగా ఉన్నట్లయితే నా చుట్టూ చాలామంది ఆడపిల్లలు చేరాలికదా! మరి ఒక్కరూ నా వంక చూడరేం?"

ఆమె నవ్వేసింది అతన్తోపాటు.

"బహుశా ఎవరూ నా అంత క్లోజ్‌గా అబ్జర్వ్ చేయలేదేమో."

వాళ్ళు మాట్లాడుతూండగానే మరో యువతీ యువకులిద్దరు వచ్చి వారికి కొద్ది దూరంలో కూర్చున్నారు.

ఆ యువకుడు హఠాత్తుగా ఆ యువతి పెదాలమీద ముద్దు పెట్టుకున్నాడు.

అది చూసి కృష్ణ, మార్గరెట్ మొఖ మొఖాలు చూచుకున్నారు.





రక్తాక్షి ఉగాది సందర్భంగా ఆంధ్ర సాంస్కృతిక పరిషత్ (భోపాల్) సభ్యులకు ఆశీస్సులను అందచేస్తున్న శ్రీ జి. జగత్పతి (మధ్య ప్రదేశ్ ముఖ్యమంత్రి సలహాదారులు), శ్రీయుతులు జి. రామమూర్తి (కార్యదర్శి, ఐ.ఎస్. రావు (అధ్యక్షులు) శ్రీమతి జగత్పతిగార్లని కూడా చిత్రంలో చూడవచ్చు.

---

"ఇంత పబ్లిగ్గానా ?" అంది మార్గరేట్ ఆశ్చర్యంగా.

"ప్రేమకు ఇలాంటివేమీ తెలీదు కాబోలు" నవ్వుతూ అన్నాడు కృష్ణ.

ఇద్దరూ ఇసుకలో నుంచి అక్కడ ఉన్న రెస్టారెంట్‌లోకి నడిచారు.

వారి పక్కనే ఉన్న పిట్టగోడకు సముద్ర కెరటాలు వచ్చి తాకుతోంటే తమాషాగా ఉంది. అక్కడే నిలబడి ఐస్‌క్రీమ్ తిన్నారు.

"మీ డిస్పెన్సరీ ఎక్కడ ?" అడిగింది మార్గరెట్.

కృష్ణ గతుక్కుమన్నాడు.

"మహారాణీ పేటలో ఉందిలెండి ! అది తీసేయాలని చూస్తున్నాను."

"అదె — ఎందుకని ?"

"ఇంట్రెస్ట్ కలగడంలేదు. డబ్బు కోసం ప్రాక్టీస్ చెయ్యాల్సిన అవసరమూ లేదు. ఇంకెందుకు మరి ?"

ఆమె నవ్వింది.

"మీలాంటి డబ్బున్నవాళ్ళు మెడిసిన్ చదివితే ఇదే గొడవ ! ఆ డిగ్రీ వృథాగా మిగిలిపోతుంది."

"ఏం చేస్తాను చెప్పండి — మా అన్నయ్య పట్టుబట్టి చదివించాడు — చదివాను."

"మరి మానేసి ఏం చేస్తారు ?"

"హాయిగా ఇలా మీతో కబుర్లు చెప్తూ జీవితం గడిపేస్తాను."

ఆమె నవ్వేసింది.

"చాలా బాగుంది !"

"ఇంక వెళ్దామా ?" కొద్ది క్షణాలాగి టైమ్ చూసుకుంటూ అందామె.

"ఓ ! పదండి..."

## జీవితం - సెంటిమెంట్

స్కూటర్‌మీద ఆమె ఇంటికి కొద్ది దూరంలో డ్రాప్ చేశాడతను.

"మళ్ళీ ఎప్పుడు మీరు దయతలచటం ?"

"మీ ఇష్టం — రేపట్నుంచీ నాకు సాయంత్రం డ్యూటీ..."

"అయితే రేపొద్దున్న రాకూడదూ ?"

"ఊహు ! రేపు కుదరదులెండి. ఎల్లుండి వస్తాను."

"సరే ..."

ఆమె వెళ్ళిపోయింది.

కృష్ణ ఇంటికి తిరిగి వచ్చేసరికి ప్రసాద్ భోజనం చేస్తున్నాడు.

"రారాబాబూ ! విహారం చేసి చేసి అలసిపోయుంటావ్ ! భోజనం చేయ్" అన్నాడు కృష్ణను చూసి.

"అలా ఏడవకూడదురా ! నువ్ చేయలేని పనులు నీ స్నేహితుడు చేస్తున్నందుకు చూసి సంతోషించాలి..."

"ఇవి సంతోషించదగినవి కాదని నా అనుమానం—"

"ఎందుకని ?"

"నువ్వు హాయిగా ఎ. సి. ఆన్ చేసుకుని నీ కిష్టమొచ్చిన పిల్లతో ప్రేమ కలాపాలు జరుపుతోంటే— నేను రోడ్లమీద తిరిగి, ఫుట్‌పాత్‌మీద పడుకోవటం సంతోషించదగిన విషయమా ?"

కృష్ణకు నవ్వాగలేదు.

వెళ్ళి అతని చెక్కిళ్ళు పట్టుకుని నిమిరాడు.

"ఏం ఫరవాలేదురా నాయినా ! ఇప్పుడు నీకు ఏం సేవలు కావాలంటే ఆ సేవలుచేస్తాను. నిన్ను ఎ. సి. రూమ్‌లోనే పడుకోబెట్టి, కాళ్ళు పట్టి, ఉదయం పది గంటలవరకూ డిస్టర్బెన్స్ రాకుండా చూచే బాధ్యత నాది..."

"నీ మాటలు నమ్మమంటావ్ ?"

"నమ్మకపోతే ఎలారా ? నాకంటె నమ్మదగిన ఫ్రెండెవరున్నారు ఇంకా..."

### ప్రేరణ

అడవుల నుంచి
నగరాల వరకు
రాళ్ళ నుంచి
గగనాల వరకు
ఎంత —
ఎదిగాడీ మనిషి ?
అయినా మాత్రం
పునాది, సమాధి
నేల మీదనేగదా !

— ఈతకోట సుబ్బారావు

ఇద్దరూ కలిసి భోజనం ముగించారు.

తీరా నిద్ర పోబోయే సమయంలో కాలింగ్ బెల్ మోగింది.

"ఇంత రాత్రివేళ ఎవరంటావ్ ?" ఆశ్చర్యంగా అడిగాడు కృష్ణ.

"ఏమో ! వెళ్ళి చూడరాదూ ?"

కృష్ణ లేచి వెళ్ళబోతూంటే ప్రసాద్ లేచి కూర్చున్నాడు మంచంమీద.

"ఒరేయ్ ! మళ్ళీ నీ కోసం వచ్చిన గోపిక కాదుగదా !"

"పోరా— ఇంత రాత్రివేళ గోపికలెవ రొస్తారు..." అంటూ వెళ్ళి తలుపు తెరచాడతను.

ఎదురుగ్గా రాజేశ్వరి నిలబడి వుంది.

"హమ్మయ్య! ఉన్నావన్నమాట! ఉండవేమోనని ఆటోవాడిని నిలబెట్టాను..." అంటూ బయటికెళ్ళి ఆటో పంపించి లోపలి కొచ్చిందామె.

"ఎప్పుడొచ్చావ్ ఊర్నుంచి?" అడిగాడు కృష్ణ ఆమె లోపలకురాగానే దగ్గరకు తీసుకుంటూ.

"సాయంత్రమే!"

"ఏమిటి చాలారోజులు ఉండిపోయావ్ ఈసారి?" అడిగాడతను.

"మా ఆయన వెళ్ళనిస్తేనా?" నవ్వుతూ అందామె.

"నువ్వంటే చాలా ప్రేమ అన్నమాట!"

"ప్రేమేమిటి—పిచ్చి! ఒక్కరోజు కూడా వదలి ఉండలేరు..."

"అవును! నిన్ను చూస్తూంటే ఎవరికి మాత్రం ఉండాలనిపిస్తుంది?"

వాళ్ళమాటలు లోపల్నుంచి వింటూన్న ప్రసాద్ ప్రాణాలు పైనే పోయాయ్. అతను అనుకున్నట్లుగానే కృష్ణ గదిలోకొచ్చాడు.

"ఒరేయ్ ప్రసాద్! నీ కాళ్ళు పట్టుకుంటారా! బాబ్బాబు—ఈ ఒక్కరాత్రికీ ఏదయినా హోటల్‌కెళ్ళి పడుకో..."

"నేను వెళ్ళను..."

"మా బంగారు తండ్రివి కదూ!"

"నావల్ల కాదురా!"

"స్నేహం అంటే ఇంతేనేమిట్రా?"

"అది నేనడగాల్సిన ప్రశ్న..."

"అయితే నాకేమీ సహాయం చేయవన్నమాట..."

"ఏం చేయాలి?"

"ఈ రాత్రికి ఎక్కడయినా ఉండు! మా రాజేశ్వరి రాకరాక వచ్చింది. మరి ఈ అవకాశం వదులుకోమంటావా నువ్వే చెప్పు?"

"సరే—వెళ్తున్నాను..." అంటూ లేచి తన సూట్‌కేస్ తీసుకుని బట్టలు సర్దుకోసాగాడతను.

"అదేమిట్రా! సూట్‌కేసెందుకు ?"

"నీకు డిస్టర్బెన్స్‌లేకుండా ఇంకో రూమ్‌లో ఉండిపోతాను."

ఇప్పుడు... మీ చర్మ సమస్యలను కడిగి పారవెయ్యండి...
మీ చర్మానికి శుభ్రమైన, ఆరోగ్యవంతమైన నిగనిగ ఇవ్వండి.

Godrej నిమిన్

**శుద్ధమైన వేపనూనె యొక్క సహజ సద్గుణాలు కలిగినది.**

వేప, మర్గోసా అన్న పేర్లతో పిలువబడే వేపచెట్టు, చర్మ సంబంధ సమస్యలకై మానవజాతికి ప్రకృతి ప్రసాదించిన వరాలలో ఒకటి. వేపనూనెను క్రమం తప్పకుండా వాడితే, అది మీ చర్మం నునుపుగా, తేటగా ఉండడానికి తోడ్పడుతుంది.

గోద్రెజ్, శుద్ధమైన వేపనూనెను చేర్చి రూపొందించిన సబ్బు, నిమిన్ — మీ చర్మ సమస్యలను కడిగి పారవేసే లగ్జరీ టాయిలెట్ సోపు. ఈ గోద్రెజ్ నిమిన్ మరింతకాలం మన్నుతుంది. ఎందుకంటే ఇది ఇతర కొన్ని మర్గోసా సబ్బులవలె మెత్తబడిపోదు.




**నిమిన్ — మీ అంత శ్రద్ధగా మీ చర్మాన్ని కాపాడే సబ్బు.**

CHAITRA-B G 230 TEL

# ఇవేమన పద్యాలు

నిరాడంబరంగా వుండటం మంచిదే!
కానీ మరీ ఇంత నిరాడంబరంగా ఆఫీసుకొస్తే
ఎలాగయ్యా!



మాసిన తలతోడ మలిన వస్త్రముతోడ
నొడలి జిడ్డుతోడ నుండెనేవి
యగ్రజన్ముడైన వట్టె పొమ్మందురు
విశ్వదాభిరామ వినుర వేమ.

"బాబ్బాబు! అంతమాటనకురా! నువ్ లేకపోతే నేనెలా ఉండగలను చెప్పు! పోనీ నీ కంతగా ఇష్టం లేకపోతే రాజేశ్వరిని పంపిం చేస్తాన్లే..."

"మళ్ళీ తరువాత నామీద ఏడవటానికా?

## జీవితం—సెంటిమెంట్

నేనే వెళ్తాతే — ఓ వంద రూపాయ లిటు పడేయ్—" విసుగ్గా అన్నాడు ప్రసాద్.

"వందేమిట్రా తమ్ముడూ! రెండు వందలు తీసుకో..." అంటూ రెండు వంద నోట్లు ఇవ్వబోయాడు కృష్ణ.

"ఒకటి చాల్లే..." అంటూ ఒక వం తీసుకుని అక్కడినుంచి బయటికొచ్చాడతను.

రాజేశ్వరి అతనిని చూసి "నమస్తే అంది చిరునవ్వుతో.

"నమస్తే నమస్తే! బావున్నారా?" ఆప్యాయంగా పలుకరించాడు ప్రసాద్.

"ఓ! బాగానే ఉన్నాను..."

"చాలాకాలమయిపోయింది మీరు కనిపించి.

"అవును! ఈ మధ్య రాలేదు."

"నువ్వెళ్ళిరారా! మళ్ళీ నీకు ఆలస్య అవుతుందేమో..." అతను అక్కడే కూర్చోవడ చూసి తను కల్పించుకుంటూ అన్నాడు కృష్ణ

ప్రసాద్ కోపంగా కృష్ణవంక చూ "వస్తానండీ!" అని ఆమెతో చెప్పి బయట కెళ్ళిపోయాడు.

"పాపం! నాకోసం అతనిని బయటకు గెంటేశారా?" నవ్వుతూ అంది రాజేశ్వరి.

"నీ కోసం ఏమయినా చేస్తానోయ్...' తలుపులు మూసివేస్తూ అన్నాడు కృష్ణ.

"ఆహా..." వెక్కిరింపుగా అందామె.

"ఏం? అనుమానమా?"

"నన్ను పెళ్ళిచేసుకోమని అడిగితే పారి పోయారు —ఇప్పుడేమో ఏమయినా చేస్తాడట.." హేళనగా అంది.

కృష్ణ ఆమెను తన గుండెలకు హత్తు కున్నాడు.

"అదివేరు! అప్పుడు పరిస్థితులూ — గొడవలూ— అన్నీ నీకూ తెలుసుగా! లేకపోతే నిన్ను వదులుకోవడం నాకు మాత్రం ఆనందం అనుకున్నావా?"

"నాకన్నీ తెలుసులే! పెళ్ళి ఒక్కటి తప్ప నా కోసం ఇంకేం చేయమన్నా చేస్తావ్! కదూ?"

"ఇలా మాట్లాడడం ఏమీ బాగుండలేదు." ఆమె పెదాల మీద ముద్దు పెట్టుకుంటూ అన్నాడతను.

ఆమె ఇంక మాట్లాడలేకపోయింది.

"నిన్నేమీ నిందించడం లేదులే ఇప్పుడు..." నవ్వుతూ అంది.

"పద—పడుకుందాం ..."

ఇద్దరూ పక్కగదిలోకి నడిచి మంచంమీద పడుకున్నారు.

ఆమె పెదాలను తను పెదాలతో మూసి వేశాడతను.

ఉదయం ఆమె వెళ్ళిపోయాక తను మళ్ళీ నిద్రలో మునిగిపోయాడు.

కాలింగ్‌బెల్ మోగేవరకూ నిద్రపోతూనే ఉన్నాడు.

లేచి టైమ్ చూసుకునేసరికి పదిన్నరయి పోయింది.

తలుపు తెరచి బయట నిలబడ్డ సావిత్రిని చూసి అదిరిపడ్డాడతను.

(ఇంకా ఉంది)



# సూర్యుని స్వభావముపై సోవియట్ శాస్త్రవేత్తల కొత్త సిద్ధాంతాలు

సూర్యుని నుండి విడుదలయ్యే సౌరశక్తికి కారణం సూర్యునిలో జరిగే ఉష్ణ కేంద్రక చర్యలని అందరూ ఆమోదించారు. అందుకే ఈ విషయాన్ని సర్వ సంగ్రహ విఘంటువులో కూడా రాశారు. సూర్యుని కేంద్రంలో ఉష్ణోగ్రత యిరవయి మిలియన్ల డిగ్రీల సెలిసియస్ వరకూ ఉంటుందని కూడా విఘంటువులో పేర్కొన్నారు.

సూర్యునికి సంబంధించిన ఈ ఉష్ణ కేంద్రక సిద్ధాంతాన్ని 1920వ సంవత్సర ప్రాంతంలో బ్రిటిష్ శాస్త్రవేత్త సర్ ఆర్థర్ స్టాన్లే ఎడింగ్టన్ ప్రతిపాదించాడు. ఈ ప్రతిపాదనను చాలామంది శాస్త్రవేత్తలు కూలంకషంగా పరిశీలించారు. 1938వ సంవత్సరంలో అమెరికాలోని కార్నెల్ విశ్వవిద్యాలయానికి చెందిన హన్స్‌బేతే ఈ సిద్ధాంతాన్ని గణితపరంగా మార్పు చెందించి ఒక్క సూర్యునికేగాక నక్షత్రాలన్నిటికి ఈ సిద్ధాంతం వర్తిస్తుందని ధ్రువపరిచాడు. అందుకే ఈ సిద్ధాంతము విశ్వజనీయంగా ఆమోదింపబడింది.

సూర్యునిలో ఉష్ణకేంద్రక చర్యలు జరుగుతున్నాయనే సిద్ధాంతాన్ని విశ్వసించిన అమెరికన్ శాస్త్రవేత్త రేడేవిన్ ప్రయోగాత్మకంగా ఆ సిద్ధాంతాన్ని నిరూపించాలని ప్రయత్నించాడు. ఈ ప్రయత్నంలో అతడు ఎన్నో ప్రయోగాలు చేసి పరిశీలనలు చేశాడు. ఈ సందర్భంలో సౌర న్యూట్రినోలు గుర్తించాడు.

న్యూట్రినో కణాలకు ద్రవ్యరాశి, విద్యుదావేశం ఉండదు. ఇట్టి కణాలు ఉష్ణ కేంద్రక చర్యల్లో విడుదల అవుతూ ఉంటాయి. గణితపరంగా కట్టిన లెక్కల్లో సూర్యుని నుండి భూమికి చేరాల్సిన న్యూట్రినోల సంఖ్యలో కేవలం మూడోవంతు న్యూట్రినోలు మాత్రమే భూమిని జేరుతున్నాయి.

సూర్యునిలో నిజంగా ఉష్ణకేంద్రక చర్యలు జరుగుతున్నాయా అని కొంతమంది శాస్త్రవేత్తలకు అనుమానం వచ్చింది. ఈ విధంగా అనుమానం వచ్చి సూర్య స్వభావం గురించి తీవ్రంగా ఆలోచించిన శాస్త్రవేత్తల్లో సోవియట్‌కు చెందిన ఆంద్రీ సెవర్నీ ఒకరు.

1974 వ సంవత్సరంలో ఆంద్రీసెవర్నీ సలహాపై సైన్సు విద్యార్థులకు ఆయన శిష్యుడు వేలరీ కొటోవ్ సూర్యునికి సంబంధించిన సమాచారం పై ఒక అంశం తయారు చేశాడు. దీని ప్రధానాంశం 'సూర్యుని మచ్చలకు సంబంధించిన అయస్కాంత క్షేత్రపు నిర్మాణాకృతి' ఈ అంశం తయారు చేసిన తరువాత సూర్యుని స్వభావంపై మరొక శాస్త్రవేత్తతో కలసి వేలరీ పరిశోధన సాగించడం జరిగింది. ఈ పరిశోధనలో కొన్ని కొత్త విషయాల పరిశీలన జరిగింది.

గతంలో ఆంద్రీసెవర్నీ సూర్యస్వభావం గురించి అనుమానాలు వచ్చినపుడు కొన్ని కొత్త ప్రతిపాదనలు చేశాడు. ఇప్పుడు వేలరీ పరిశీలనలు ఆంద్రీసెవర్నీ ప్రతిపాదించిన కొత్త ప్రతిపాదనలను సమర్థించేవిగా కన్పించాయి. వీటిని ప్రయోగాత్మకంగా నిరూపించాలని వేలరీ సంకల్పం.

## కొత్త సిద్ధాంతము ఏమిటి ?

ఆంద్రీసెవర్నీ ప్రతిపాదించిన కొత్త సిద్ధాంతం ప్రకారం సూర్యుడు స్పందిస్తున్నాడు. కాని ఈ సూర్యస్పందనను మనకు లభించే అధునాతన పరికరాలు సైతం గుర్తించ లేకుండా ఉన్నాయి.

ఇప్పుడు ఆంద్రీసెవర్నీ, వెలరీ కొటోవ్ అతనితో పని చేస్తున్న శాస్త్రవేత్త టియోడార్ ట్సాప్ ముగ్గురూ కలసి ఒక కొత్తరకం ప్రయోగాన్ని తయారుచేశారు. ఈ ప్రయోగంలో సౌరకిరణాల ధృవణాన్ని విభజించి ప్రయోగం చేయడం ఒక విశేషం.

సూర్యుని కేంద్రభాగం నుండి వచ్చే కాంతిని విడిగా ధృవణం చెందించడం తరువాత దీప్తి ఆవరణనుండి వెలువడే కాంతిని విడిగా ధృవణం చెందించడం జరుగుతుంది.

పైన పేర్కొన్న ప్రయోగంవల్ల కొన్ని విశేషాలు తెలిశాయి. సూర్యుడు నూట అరవయి నిముషాలకొకసారి స్పందిస్తున్నట్లు తెలిసింది. ఈ స్పందనలో కంపన పరిమితి సూర్యుని ఉపరితలంనుండి పది కిలోమీటర్లు ఉంటుందని అంచనా కట్టారు.

ప్రయోగంలోని అంచనాల ఖచ్చితత్వం ఎలాఉన్నా సూర్యుడు స్పందిస్తున్నాడు అనే కొత్త ఆలోచనకు సాక్ష్యాలు దొరికాయి. సూర్యుని స్పందన పౌనఃపున్యము, కంపన పరిమితులనుబట్టి సూర్యుని కేంద్రభాగమయిన ఫొటోస్ఫియర్ సాంద్రతను గణితం చేసి కనుగొన్నారు. దీనివల్ల మరికొన్ని కొత్త సమస్యలు తలఎత్తాయి.

కొత్త సిద్ధాంతం ప్రకారం సూర్యునిలో ఏకరీతి సాంద్రతగల వాయు మిశ్రమం ఉందని దాని సాంద్రత నీటి సాంద్రతతో సమానంగా ఉండి కేంద్ర భాగంలో ఆరున్నర మిలియన్ల డిగ్రీల సెలిసియస్ ఉందని తెల్పింది. పాత సిద్ధాంతంలో అనుకున్న ఉష్ణోగ్రతకన్నా ఇది చాలా తక్కువ.

అమెరికన్ శాస్త్రవేత్తలుకూడా సోవియట్ శాస్త్రవేత్తలు చేసిన ప్రయోగాలను, గణితాలను ధృవపరిచారు. అంటార్కిటామీదనుండి ఫ్రెంచి శాస్త్రవేత్తలు సూర్యుని గురించి జరిపిన పరిశోధనల్లో సోవియట్ శాస్త్రవేత్తల ఆలోచనలు ధృవపరిచే విషయాలున్నట్లు చెప్పారు.

సౌరశక్తికి కారణం సూర్యునిలో జరిగే ఉష్ణీయ కేంద్రక చర్యలు కాదని కేవలం సూర్యుని స్పందనం మాత్రమేనని ఆంద్రీ సెవర్నీ వాదం.

ఇంకా ఈ వాదాన్ని బలంగా అందరూ ఆమోదించడంలేదు. ప్రస్తుతానికి పాత సిద్ధాంతమే ఆమోదం పొంది ఉంది. సూర్యుని స్వభావానికి సంబంధించిన యదార్థం బహుశా మరికొన్ని రోజుల్లోగాని తెలియకపోవచ్చు.

—సి. వి. పర్వేశ్వరశర్మ



కృష్ణ "కిరాయి అల్లుడు"

రాధ, రజనీకాంత్ 'రౌడీలకు సవాల్'





# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## సెన్సారు కాబడిన చిత్రాల పేర్లు!

ఏంజిల్ క్రియేషన్స్ "దేవుణ్ని నమ్మండి," అఖిలా మూవీస్ "భగవంతుడు," రాంప్రసాద్ ఇంటర్నేషనల్ "దేవుడు లేని గుడి," గుప్తా క్రియేషన్స్ "ఈనాటి కథ,"! టి. వి. ఎస్. ఆర్ట్ ప్రొడక్షన్ "జయం మనదే," శ్రీగజలక్ష్మి కంబైన్స్ "ప్రేమ పర్వం," ఎస్. వి. ఎస్. క్రియేషన్స్ "బందిపోట్లు — ఫూలన్‌దేవి," శ్రీ బాలాజీ సినీ అసోసియేట్స్ "శ్రీ కృష్ణ," శాయ్ ఫిలిమ్స్ కంబైన్స్ "పిడుగు నిజాలు," శాయ్ చక్ర ప్రొడక్షన్స్ "పల్నాటి పులి," నవతరం పిక్చర్స్ "విప్లవ సీత," తారకేశ్వరి క్రియేషన్స్ 'గీతోపదేశం," శ్రీ సత్యచిత్ర "కోరుకున్న అమ్మాయి," గోపీ ఆర్ట్ పిక్చర్స్ "అడవి దొంగ," ఎం, ఆర్. ఎంటర్‌ప్రైసెస్ "అమెరికా అమెరికా," స్నేహచిత్ర పిక్చర్స్ "అర్థరాత్రి స్వాతంత్ర్యం," గోల్డెన్ ఆర్ట్ ఫిలిమ్స్ "భార్యో దేవో భవః," శాంతిసాగర్ మూవీస్ "నరకం మరెక్కడో లేదు," శ్రీ సారథి చిత్ర "రాజు, మంత్రి, కాంట్రాక్టరు," ఇంటర్నేషనల్ ఆర్ట్ ఫిలిమ్స్ "ఇదే మన భారతం," మంగళా మూవీ క్రియేషన్స్ "యువత మేల్కొంటే ?"

## శోభన్‌బాబు చిత్రాలు

దాసరి దర్శకత్వంలో కె. మురారి నిర్మించే "అభిమన్యుడు" చిత్రం, బాబు ఆర్ట్స్ "ఇల్లాలు

ప్రియురాలు'' చిత్రం, చక్రవర్తి దర్శకత్వంలో మిద్దె రామారావు నిర్మించే ''సంపూర్ణ ప్రేమాయణం,'' ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వం నెరిపే సంయుక్తా మూవీస్ ''మహా సంగ్రామం,'' విజయ బాపినీడు డైరెక్ట్ చేసే శ్రీనివాసా ప్రొడక్షన్స్ చిత్రం నిర్మాణంలో ఉన్నాయి. కె. బాపయ్య దర్శకత్వంలో హిమ మూవీస్ ''దండయాత్ర'' త్వరలో విడుదలవబోతోంది. సెప్టెంబర్‌లో బాపు దర్శకత్వంలో జయకృష్ణ నిర్మించే చిత్రం, సురేష్ ప్రొడక్షన్స్ డి. రామానాయుడి చిత్రం ప్రారంభమవుతాయి. ఆ తర్వాత శోభన్ సమర్పించే కృష్ణ చిత్ర చిత్రం, శ్రీదేవి నాయికగా లక్ష్మి చిత్ర వారి చిత్రం, విజయబాపినీడు దర్శకత్వం వహించే మరో చిత్రం, కె. బాపయ్య దర్శకత్వంలో ఛాయాగ్రాహకుడు ఎస్. వెంకటరత్నం తయారు చేసే చిత్రం, విజయ మాధవీ వారి చిత్రం. 1985లో బాబా ఆర్ట్స్ బానర్‌లో జి. బాబు నిర్మించే చిత్రం, శ్రీదేవి నాయికగా రోజా మూవీస్ చిత్రం, రాశీ మూవీస్, టి. వి. ఎస్. శిలిప్స్ చిత్రాలు వగైరా.

### జయసుధ చిత్రాలు

''మహా సంగ్రామం, బంగారు కాపురం, భారతంలో శంఖారావం, ఆడపులి'' చిత్రాలు నిర్మాణంలో ఉన్నాయి. తారకప్రభు శిలిప్స్ జస్టిస్ చక్రవర్తి, జయభేరీ ఆర్ట్ ప్రొడక్షన్స్, మల్లెమాల క్రియేషన్స్, నటులు మోహన్‌బాబు, ప్రభాకర్‌రెడ్డి నిర్మించే చిత్రాలు, ఎడిటర్ టి. కృష్ణ దర్శకత్వం వహించే చిత్రం, బాపు దర్శకత్వంలో జయకృష్ణ చిత్రం, విజయ బాపినీడు డైరెక్ట్ చేసే చిత్రం, మహేశ్వరీ కంబైన్స్ చిత్రాలు ప్రారంభం కానున్నాయి. 1985 జనవరిలో ఎన్. రామలింగేశ్వరరావు నిర్మాణం ప్రారంభించే రాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ ''దేవుడి లేని గుడి'' జయసుధ చివరి చిత్రవౌతుంది. ''ఆ తర్వాత సినిమా రంగానికి గుడ్ బై చెప్పేస్తాను,'' అన్నారు జయసుధ.

### మైసూరులో ఎ.వి.ఎం. ప్రొడక్షన్స్ ''నాగు''

మే 11 నుండి 17 వరకు మైసూరులో చిరంజీవి, రాధలపై మూడు పాటలు పిక్చరైజ్ చేశాం,'' అన్నారు తాతినేని ప్రసాద్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. షణ్ముఖం నిర్మాతగా ఎం. కుమరన్ సమర్పించే ''నాగు'' చిత్రంలో సత్యనారాణ, జగ్గయ్య, అన్నపూర్ణ వగైరా నటవర్గం. పరుచూరి సోదరుల మాటలు, చక్రవర్తి సంగీతం, దేవరాజ్ ఛాయ, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, కె. సత్యం కూర్పు,



''(ఈ కొత్తమేళంతో చావొచ్చింది) అట్లా ప్రేక్షకుడిలా చూస్తావేం? కెమేరా నడపవయ్యా బాబా!''

గూనా నాగేంద్రప్రసాద్ సహదర్శకత్వం, తాండవ కృష్ణ, సాతప్పన్ ప్రొడక్షన్స్ నిర్వహిస్తున్నారు.





అనూరాధ, కృష్ణ "ఉద్దండుడు"

రాధ, కృష్ణంరాజు 'బందీ'లో



## కృష్ణ హీరోగా శ్రీ సత్యచిత్ర వారి "ఉద్దండుడు"

మే 21 నుంచి నెలాఖరువరకు ఊటీలో కృష్ణ, సుమలత, ఊర్వశిలపై మూడు పాటలు, పతాక సన్నివేశాలు సరికొత్త పంథాలో చిత్రీకరించినట్లు శ్రీ సత్యచిత్ర అధినేతలు సత్యనారాయణ, సూర్యనారాయణ తెలియజేశారు గుమ్మడి, సత్యనారాయణ, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య, నూతన్‌ప్రసాద్, అన్నపూర్ణ, మమత, అనూరాధ తక్కిన నటవర్గం పరుచూరి సోదరులు కధ, సంభాషణలు రాశారు కె వి మహదేవన్ సంగీతం, వి ఎస్ ఆర్ స్వామి ఛాయ, పి శరత్ సహ దర్శకత్వం, కోటగిరి గోపాలరావు కూర్పుతో పర్వతనేని సాంబశివరావు దర్శకుడు

## శోభన్ హీరోగా దాసరి దర్శకత్వంలో మురారి చిత్రం "అభిమన్యుడు"

'శోభన్‌బాబుగారి పక్కన రాధిక, విజయశాంతి సిల్క్‌స్మిత హీరోయిన్‌లు,'' అన్నారు కె మురారి ఈయన దాసరి నారాయణరావు సంభాషణలు, దర్శకత్వంలో నిర్మించే యువచిత్ర

"ఇల్లాలు ప్రియురాలు"లో సుహాసిని, శోభన్‌బాబు

కంబైన్స్ "అభిమన్యుడు" చిత్రం షూటింగ్ మే 16 నుంచి జరుగుతోంది. జూన్ 10కి తొలి షెడ్యూల్ పూర్తవుతుంది. అల్లు రామ లింగయ్య, అన్నపూర్ణ, కల్పనారాయ్ తక్కిన తారాగణం. కె. వి. మహదేవన్ సంగీతం, కె. శ్రీహరి ఛాయ, భాస్కరరాజు శిల్పం, నాగబాబు కూర్పు, తార నృత్యాలు, కె. ఎస్. రాజేంద్ర సహకార దర్శకత్వంతో వై. భార్గవరావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్. "జూలై, ఆగస్టులలో మిగతా షూటింగ్ పూర్తయిపోతుంది," అన్నారు ఈ చిత్రాన్ని సమర్పించే కె. నరసింహంనాయుడు.

## కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో హిందీ చిత్రాలు

★ పద్మాలయ బానర్‌లో జి. ఆదిశేషగిరి రావు నిర్మాతగా కృష్ణ సమర్పించే "హెుషియార్" చిత్రంలో జితేంద్ర, శతృఘ్న సిన్హా ముఖ్య పాత్రధారులు.

★ మాధవి ఇంటర్నేషనల్ పతాకంలో స్వయంగా నిర్మించే "త్రిశూలం" హిందీ చిత్రంలో రాజేష్‌ఖన్నా, జయప్రద, పద్మినీ కొల్హాపురి ముఖ్య భూమికలు పోషిస్తున్నారు.

★ కోగంటి కేశవరావు (శాయికృష్ణ) హిందీలో నిర్మించే "ధర్మాత్ముడు"లో జితేంద్ర, జయప్రద నాయకా నాయికలు.

చిరంజీవి, సత్యనారాయణ, 'ఇంటిగుట్టు'



# ఏ రంగు బట్టకైనా నప్పేలా రకరకాల ఛాయలలో కోట్స్ సూపర్‌షీన్ దారాలు.

సూపర్ షీన్ దారాలు 120 పైగా ఆకర్షణీయమైన గట్టి ఛాయల విస్తృత శ్రేణిలో లభిస్తాయి.

సూపర్ షీన్ ఎన్నుకోండి.

సూపర్ షీన్ సులువుగా జారేలా ప్రత్యేకించి తయారుచేయబడిన 3 పొరల మెర్సిరైజ్డ్ దారం. ఇది దృఢంగా ఉండి కుట్టుపనిలో గట్టి సౌకర్యాన్నిస్తుంది.

జాకెట్లు, ఫ్రాకులు, షర్టులు, వగైరాలకు సూపర్ షీన్ ఎన్నుకోండి. అన్ని తేలిక బట్టలకూ సూపర్ షీన్ శ్రేష్ఠమైనది

**మదురా కోట్స్** ఉత్పాదన

చెప్పడం మరవకండి— 'సూపర్‌షీన్‌తో కుట్టండి'

## కోట్స్ సూపర్‌షీన్




కోట్స్ - ఉత్తమ దారాల ఉత్పత్తిదారులు

IAITRA-B MCL 2 C TEL

# హిందీ తమిళ చిత్రాల్లో నటిస్తున్న పూర్ణిమాదేవి

నటికి కావలసిన రూపలావణ్యం, హావభావ ప్రకటన చేయగల సత్తా, అవసరమైనప్పుడు శాస్త్రీయ నృత్యం చేయగల శక్తి—సామర్థ్యాలు, చిత్రాలలో నటించేందుకు కావలసిన శిక్షణ కూడా పొంది, విద్యావంతురాలయినా, సొంత భాషాచిత్రాలలో నటించే ఛాన్స్ పొందని తెలుగు తారలు, యితర భాషాచిత్రాల్లో రాణించుతున్నారు.

అట్టివారిలో కుమారి పూర్ణిమాదేవి ఒకరు. స్వస్థలం — మచిలీపట్నం. ఇంటర్మీడియట్ వరకు చదివారు. బొంబాయి కమల్ అమ్రోహి ఫిలిం యినిస్టిట్యూట్‌లో ప్రవేశం లభించినా అక్కడ మహిళలకు ప్రత్యేక సౌకర్యాలు లేకపోవటంతో మదరాసు ఫిలిమ్ యినిస్టిట్యూట్‌లో చేరి ప్రథమశ్రేణితో పాటు ఉత్తమ నటి అవార్డు పొందారు. శిక్షణా కోర్సులో వున్నప్పుడే తమిళ, ఒరియా సినిమాల్లో నటించే అవకాశాలు లభించాయి. ఈమె నటించిన చిత్రాలు తమిళనాడు, కేరళలో విజయవంతమయ్యాయి. విడుదలయినవి, విడుదల కావలసిన చిత్రాల్లో ఈమెవి కథానాయిక పాత్రలే!



కుమారి పూర్ణిమాదేవి

స్వాతంత్ర్య సమర యోధుని పుత్రిక అయిన పూర్ణిమాదేవి చిన్ననాడే శ్రీ ఏలేశ్వరపు నాగేశ్వరరావుగారి వద్ద కూచిపూడి నృత్యం అభ్యసించారు. శ్రీ శైవా వద్ద భరతనాట్యం కూడా నేర్చుకుంటున్న కుమారి పూర్ణిమాదేవి వయస్సు రెండు పదులకు లోపే!

వెస్టన్ డాన్స్, స్కేటింగ్, కార్ డ్రైవింగ్, మ్యాటర్ డ్రైవింగ్‌లో కూడా ఈమె గడుగ్గాయి.

ప్రస్తుతం 4 తమిళ చిత్రాల్లో నటిస్తున్నారు. ప్రఖ్యాత చిత్ర దర్శకులు శ్రీ దాసరి నారాయణరావు తీస్తున్న 'యాద్‌గార్' హిందీ చిత్రంలో కమల్‌హాసన్ అక్క కూతురుగా నటిస్తున్నారు.

యిన్నీవుండి ఒక తెలుగు ఆడపడుచును తెలుగు చిత్ర నిర్మాతలు యింకా గుర్తించి తెలుగు చలనచిత్ర సీమలో అవకాశాలు కల్గించలేకపోవటం విచారకరం. త్వరలో ఉజ్జ్వల భవిష్యత్ వున్న ఈమె తెలుగు చిత్రరంగంలో ప్రవేశించి తెలుగు ప్రేక్షకుల హృదయాలలో చెరగని ముద్ర వేస్తారని ఆశిద్దాం. అందుకు అవకాశాలు కల్గించటానికి తెలుగు చలనచిత్ర నిర్మాతలు, దర్శకులు పూనుకోవాలని కోరుకుందాం.

— పిడుగు సురేఖ



'ఈ తీర్పు ఇల్లాలిది'లో సుజాత

## క్రాంతికుమార్ దర్శకత్వంలో "స్వాతి"

"నిర్మాతగా ఇది నా ఏడవ చిత్రం, డైరెక్టర్‌గా ఇది నా మొదటి చిత్రం" అన్నారు క్రాంతికుమార్. జూన్ 21 నుంచి ఈయన రూపొందించే క్రాంతి చిత్ర వారి "స్వాతి" చిత్రంలో సుహాసిని, శారద, భానుచందర్, జగ్గయ్య, శరత్‌బాబు, శుభలేక సుధాకర్, పి. ఎల్. నారాయణ, అరుణ, సంయుక్త వగైరా తారాగణం. గణేశ్‌పాత్రో సంభాషణలు, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, ఎ. హరి ఛాయతో వేమూరి సత్యనారాయణ నిర్మాణ సారథి.

## "బాల యేసు"

సరిత, దీప, అనూరాధ, శశికళ, విజయకాంత్, రాజేష్, స్వర్గీయ ఎం. ఆర్. ఆర్. వాసు, సుందరరాజన్ నటించిన శ్రీ విజయ భారతీ ఆర్ట్ పిక్చర్స్ వారి పై చిత్రం విడుదలకు సిద్ధమవుతోందని సమర్పకులు కొసనా కృష్ణ తెలిపారు. మాగాపు అమ్మిరాజు మాటలు, పాటలు రాశారు. శ్యామ్ సంగీతం, కె. మధు కూర్పు, ఉజ్జారి అప్పారావు నిర్వహణ, వి. రాజన్ దర్శకత్వంతో గుడు అప్పారావు, చిర్ల సూర్యనారాయణరెడ్డి నిర్మాతలు.

'దేశంలో దొంగలు పడ్డారు'లో సుమన్, విజయశాంతి



# తెలుగు చలన చిత్రరంగంలో అడుగుపెట్టిన కె. భాగ్యరాజ్!

తమిళ చలనచిత్ర రంగంలో అతి కొద్ది కాలంలో అంటే 4 సంవత్సరాలలో ఎవరూ అందుకోలేని అగ్రస్థాయికి ఎదిగిన నటుడు, దర్శకుడు, రచయిత శ్రీ కె భాగ్యరాజ్

అదే విధంగా తెలుగు చిత్ర రంగంలో కూడా భాగ్యరాజ్ "డార్లింగ్ — డార్లింగ్" అనువాద చిత్రంతో తెలుగు ప్రేక్షకుల మనసులో చోటు చేసుకున్నారు

లోగడ భాగ్యరాజ్ తమిళ చిత్రాల కథలను కొని తెలుగులో తీస్తున్న శ్రీ సారధీ స్టూడియోస్ పి శశిభూషణ్ ఈసారి భాగ్యరాజ్ తో కలిసి ఆయనే హీరోగా ఒక తెలుగు చిత్రం తీస్తున్నారు —

ఈ చిత్రానికి సంబంధించిన కొన్ని పాటలు ఇటీవల ప్రసాద్ 70 ఎం ఎం థియేటర్‌లో రికార్డు చేయబడ్డాయి —

"మామా మందు కొట్టి మర్చిపోరా" పాటను బాలు పాడగా — 'కన్నెపిల్ల వలచెను కన్నుగీటి పిలిచెను ' అనే పాట బాలు, శైలజా పాడారు



కె భాగ్యరాజ్, పి శశిభూషణ్

"మేఘం చిరుజల్లై శుభవేళై పిలిచింది" అనే యుగళగీతాన్ని సుశీల, బాలు పాడారు ఈ పాటలు ఆత్రేయ రాయగా ఇళయరాజా సంగీతం సమకూర్చారు

కె భాగ్యరాజ్ రచన, దర్శకత్వంతోపాటు హీరోగా నటిస్తున్న ఈ చిత్రంలో రాధిక, పూర్ణిమ, నూతన తార యువరాణి ముగ్గురు నాయికామణులు — శివాజీగణేషన్ రిటైర్డ్ మేజర్ పాత్ర ధరిస్తున్నారు

బాంబే కరాటే ఫైటర్ బాబ్ క్రిష్టో, భాగ్యరాజ్‌లకు మధ్య జరిగిన యాక్షన్ సన్నివేశాలను శారదా స్టూడియోలో ఇటీవల మూడు భారీ సెట్టింగుల్లో చిత్రీకరించారు

శ్రీ సారధీ స్టూడియోస్‌వారు సమర్పిస్తున్న ఈ చిత్రానికి ఫొటోగ్రఫీ ఎ వి రామకృష్ణ, కూర్పు సెల్వనాధన్, కళ సోమయ్య, సంగీతం ఇళయరాజా, నృత్యం చిన్న భాగ్యరాజ్ తల్లిగా డబ్బింగ్ జానకి, అతిథి పాత్రలో ఊర్వశి వీరితోపాటు భాగ్యరాజ్ చెల్లెళ్ళుగా అయిదుగురు వర్ధమాన తారలు నటిస్తున్నారు

ఈ చిత్రాన్ని నవయుగవారు విడుదల చేస్తారు

— సుధ

## "మార్చండీ మన చట్టాల్ని"లో ఇవ్వండీ నాకు కోట్లు

లాటరీ టిక్కెట్లను పూజ చేస్తూ గొల్లపూడి మారుతీరావు దండకం :

"ఓ మహారాష్ట్ర, పంజాబు, హర్యాన, బీహారు, బెంగాలు, అస్సాము, ఎం పీ! తమిళ్‌నాడు, కర్ణాటకాంధ్రా, పుదుచ్చేరి, నాగా! దరిద్రం హరించే విధంగా మొరాలకించి నాకొక్క లక్ష — దయాభిక్షగా రెండు కోట్లో ప్రసాదించలేరా? సుదూరాలలోఉన్న నేపాలు, భూటాను, మేఘాలయా! కాస్త మీకైన నాపైన రాదా దయా?

గుమాస్తానెగాని, సమస్తాన్ని వీడి — యధాశక్తిగా మీకు జీతాన్ని, బత్తాన్ని, డియ్యేను, టియ్యేను — మీ పాదపద్మాల, బంగారు పద్మాల అర్పించి, అర్పించు నాపైన మీకింకా లేదా కృపా?

కామధేనూ, మహాలక్ష్మి, ఓ రాజ్యలక్ష్మి! నిరీక్షించలేనే, పరీక్షింక చాలే! అపేక్షించినానే, కటాక్షించరారే, మిమ్మే నమ్మినానే, ఒకే ఒక్కసారి మొరాలించి ఈ మందభాగ్యుడ్ని, ఈ దీన జీవుడ్ని, ఈ పేద ఆంధ్రుడ్ని పాలించగారావ నా తెలుగు దేశాన నాట్యాలు చేసేటి ఓ భాగ్యలక్ష్మి!

రాఫెల్ టికెట్ వేల్పులారా! సదా వెయ్యి నేత్రాలతో వేచి మిమ్మల్ని కొల్చేను, పిల్చేను, నిల్చేను బంపర్లు వర్షించరారే! నమో లాటరీ మాతలారా! నమస్తే నమస్తే నమః !!

"లోగడ నేను దర్శకత్వం వహించిన చిత్రాలన్నిటికంటే ఈ చిత్రం ఎంతో విభిన్నమైనది వినోదం పాలు ఎక్కువే మనం ఎన్నుకున్న ప్రభుత్వం రూపొందించే చట్టాలు సమాజ శ్రేయస్సుకు, ప్రగతికి దోహదం చేసేలా ఉండాలిగాని, అది పరిరక్షించే అలవాట్లకు అమాయక ప్రజలు బానిసలై, బలహీనతలకు దాసులై, సర్వనాశనం అయ్యే విధంగా ఉండకూడదు లాటరీలను ప్రభుత్వం ప్రోత్సహిస్తోంది జూదాన్ని రిక్రియేషన్ క్లబ్స్ పేరుతో చట్టబద్ధం చేసింది రాబడికోసం మద్యపాన నిషేధాన్ని తొలగించింది గుర్రప్పందాలను వినోదం పేరుతో అనుమతిస్తోంది. మానవునిలోని పైశాచిక ప్రవృత్తిని రెచ్చగొట్టే ఈ అలవాట్ల మూలంగా ఎన్ని కుటుంబాలు నాశనమవుతున్నాయో!" అన్నారు డైరెక్టర్ వేజెళ్ళ డి వి వి ప్రొడక్షన్స్ "మార్చండి మన చట్టాల్ని" చిత్రంలో చంద్రమోహన్, రంగనాథ్, గొల్లపూడి మారుతీరావు, రాజా, రమణమూర్తి, సాక్షి రంగారావు, వేలు, శారద, రమాప్రభ, శ్యామలగౌరి, అన్నపూర్ణ, కళారంజని ముఖ్యభూమికలు నిర్వహించారు. నెల్లూట్ల సంభాషణలకర్త. చక్రవర్తి సంగీత దర్శకుడు. ఆర్. కె. రాజు ఛాయాగ్రాహకుడు. సూరపనేని కళాధర్ శిల్ప దర్శకుడు. "ఏప్రిల్ 8 నుంచి మే 10 వరకు ఒకే షెడ్యూల్ షూటింగ్ ముగిసింది. డబ్బింగ్‌కూడా పూర్తయిపోయింది. త్వరలో విడుదలకు సన్నాహాలు చేస్తున్నాం," అన్నారు నిర్మాత డి.వి.ఎస్. రాజు

'మార్చండి మన చట్టాల్ని' రంగనాథ్, శారద



# కార్టూనిస్టులకు సూచనలు!

* కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి
* ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.
* వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!
* వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.
* సొంత చిరునామా గల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.
* ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకి ఐదారువారాలు పట్టవచ్చు.
* పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.
* రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవదని మనవి.
* మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

– సం॥

## మంథా వెంకట రమణశాస్త్రి సీరియల్

# ఉదయసంధ్య

మర్నాడు కామయ్య, శారదకి కబురు పెట్టేడు చెల్లెలి ద్వారా... "శారదా...అన్నయ్య చెప్ప మన్నాడు కదా ఇంటికి రమ్మన్నాడు ... నీతో మాట్లాడాలిట" రహస్యంగా చెప్పింది. శారధ అది రాజుగారి ఫర్మానాలా శిరసావహించి వెళ్లింది. కామయ్య ఒంటరిగా శారదని ప్రక్కకి పిలిచి ఒకటేమాట అన్నాడు... "ఆ వెంకటేశ్వరులుతో మాట్లాడకు... నాకిష్టంలేదు" ఆ మాటలని వీధిలోకి వెళ్ళిపోయేడు. శారదకి అర్థం అయినా కాకపోయినా, కామయ్య ఎందుకలా అన్నాడో అడగలేదు. వెంకటేశ్వరుడితో మా ట లు మానింది. అతడికి ఎదురుగా వెళ్లడం మాను కుంది. ఈ రిపోర్టు కామయ్యకి వచ్చింది. శారద మీద ప్రేమ అతడి మనస్సులో కట్టలు తెంచుకుంది. ఆరోజు రాత్రి అమ్మని వేరేగా పిలిచి అన్నాడు "నాకోసం పెళ్లి సంబంధాలు వెతుకుతున్నారని విన్నాను."

"ఔను బాబూ ! నీకు పద్దెనిమిది వచ్చేయి. ఇదే ముద్దూ ముచ్చటకీ ఈడు. కోడలు పిల్ల ఇంట్లో తిరుగుతూ ఉంటే లక్ష్మి ఇంట్లో ఉన్నట్టే !"

**(గత సంచిక తరువాయి)**

"అయితే వెతకడం ఎం... ?"

"లక్షణమైన సంబంధం చూసుకోవా కావుఁడూ ? వంశం, సాంప్రదాయం...'

"అమ్మా నీతో చెప్తున్నాను మనసులో ఉంచుకో, నేను శారదని తప్ప మరెవరినీ చేసు కోను. ఆ సంబంధం తప్పిపోతే జన్మలో పెళ్లి చేసుకోను. నాది ఒ క టే మా ట. వాళ్లు మ రె క్క డో సంబంధాలు వెతుకుతున్నారని విన్నాను. మన కట్నం ఆశ చూసి ఆ వెంకటే శ్వరులు అందుకే వచ్చినట్టుంది, పిల్లని చూసు కుందుకి. నాకేం చదవా సంధ్యా వాళ్లెందు కిష్టపడతారూ"ముఖం చిన్నబుచ్చుకొని అన్నాడు కామయ్య.

బుచ్చమ్మ కొడుకు మాటలకి ఆశ్చర్య పోయింది. తరవాత కొడుకు మీది ప్రేమతో కన్నీళ్లు వచ్చేయి. తక్కిన ఇద్దరు పిల్లలూ చదువు సాగిస్తున్నారు. వీడు పెద్దకొడుకవడాన వ్యవసాయం వీడి నెత్తిన పడింది. తండ్రి యొక్క బాధ్యతలన్నీ వీడివి. వీడు డబ్బు ఆర్జించి సంసార బాధ్యతలన్నీ నెరవేర్చాలి. పిల్లకి పెళ్లి చెయ్యాలి. రామం మీద ఏవో ఆశలున్నాయి ... అల్లుడు కాగలడని. ఆ ఆశ వదులుకోవాలిప్పుడు. చదువు లేదని వీడు బాధపడుతున్నాడు. వీడికన్నా తక్కువ చదువుకున్నదో, వీడితో సమానమైన చదువు వున్న దాన్నో చూడాలి. అది కాకుండా వంశం, సాంప్రదాయం చూసుకోవాలి. పిల్ల బాగుండాలి. ఈడూ జోడూ స రి పో వా లి. నెమ్మదస్తురాలై ఉండాలి. ఇవాళా రేపు ఏపిల్లా మెట్రిక్‌కి తక్కువ చదవడంలేదు పట్నంలో ... ఇంక ఈ పల్లెటూరులో తగిన సంబంధం దొరక డం కష్టం. నిజమే శారద లాటి పిల్ల దొరకడం చాలా కష్టం. "సరే బాబూ నేను చూసుకుం టాను" అంది బుచ్చమ్మ.

* * *

వెంకటేశ్వరుడికి షాకు ఒ క్క సా రి గా తగిలింది. ఊహలో కట్టుకున్న పేకమేడలన్నీ ఒక్కసారి కూలిపోయాయి. రెండు రోజులయి శారద ఎదురుపడక పోయేసరికి కారణం తెలియ లేదు. కోపంకాని వచ్చిందేమే అనుకున్నాడు. ఆఖరికి తెగించి శారదకి ఎదురుపడి అడిగేడు. "ఏం శారదా నాతో మాట్లాడడం మానేసేవు?"

శారద గది నాలుగు వేపులా చూసి అంది. "అతను ఒద్దన్నాడు. అతనికి ఇష్టంలేదు" ఆ మా ట ల ని పెంకెగా వెంకటేశ్వరుల కేసి చూసింది.

"ఎవడా అతను ? "

"కామయ్య ! "

"కామయ్యా? వాడు చెప్తే నువ్వు వినడమేమిటి ? వాడి కిష్టంలేకపోతే నీకేం మధ్యని ? "

శారద సిగ్గుపడింది "అతన్నే అడగండి" అని చెప్పి పారిపోయింది.

వెంకటేశ్వరులుకి చిన్న అ ను మా న ం వచ్చింది. రామాన్ని కదిపేడు "ఈ కామయ్య సంగతేమిట్రా రామం."

"ఏం ? ఎందుకు ? " రామం అడిగేడు వింతగా చూస్తూ. వెంకటేశ్వరులకి ఏంచెప్పాలో లోచలేదు. "అహ ఉత్తినే అడిగేను చాలా చనువుగా తిరుగుతున్నాడు కదా అని" అప్పుడు రామం చెప్పాడు "శారదని కామయ్యకివ్వడం నిశ్చయం అయినట్టే...శారద పుట్టినప్పటి నించీ ఉందామాట. అనుకోవటమే తరువాయి" నోట మాట రాక ఉండిపోయేడు వెంకటేశ్వరులు.

"ఆ పల్లెటూరి వాడికి శారద నిస్తారా?!"

"ఔను వెంకూ వాళ్లింకా సరే అనాలి. శారద పల్లెటూరిది కాదా ? అన్ని విధాలా ఇదే మంచి సంబంధం. శారదకి కా మ య్య ం టే ఇష్టమే. అయినా ఆడపిల్లల ఇష్టా యిష్టా లెవరు చూస్తున్నారు. సంబంధం కుదిరి పెళ్లి అవడమే అదృష్టం. ఏంచేస్తాం కాని అదృష్టం ఎలా ఉందో అలా జరుగుతుంది."

**జరిగిన కథ — 8 :** రామం వారాలు చేసుకుంటూ చదువుకుంటుంటాడు. దుర్గమ్మ కూతురు మీనాక్షి రామాన్ని ఆదరిస్తుంది. పూర్ణమ్మ ఇంటిలోని వీధి కొట్టులో రామం నివాసం. ప్లీడరు సీతారామయ్యగారి మేనకోడలు నిర్మలకు రామం అంటే ఇష్టం. శాంతమ్మగారి నడిగి వాళ్లింట్లో గదిలో ఉండడానికి నిశ్చయించుకుంటాడు రామం. వెంకటేశ్వరులు రాసిన ప్రేమ పద్యాలు చదివి లత రామంమీద విరుచుకుపడి అతనిని అవమానిస్తుంది. శాంతమ్మ రామంను తమ ఇంటికి వచ్చి ఉండమని చెపుతుంది. రామం మాటలను పెడచెవిన పెడతాడు వెంకటేశ్వరులు. నిర్మలంటె విశాలకి పడదు. వరలక్ష్మి రామాన్ని రత్నాన్ని ఒక దారిలో పెట్టమని కోరుతుంది. రామం సెలక్షన్సులో మొదటివాడుగా సెలక్టయ్యాడు. వెంకటేశ్వర్లు రాసిన పద్యాలు 'భారతి'లో ప్రచురింపబడ్డాయి. రామం తండ్రి నుంచి మనియార్డరు, ఉత్తరం అందుకొంటాడు. లత మీద పద్యాలు రాసింది రామమేనని అతని చెంపలు ఛెల్లుమనిపిస్తాడు చంద్రం. రామం కళ్లు తిరిగి పడిపోతాడు. సీతారామయ్య చంద్రంచేత రామంకు క్షమాపణలు చెప్పిస్తారు. రామం పుట్టిపెరిగిన అగ్రహారం వెళతాడు. రామం కుటుంబ సభ్యులు రామం రాకకు సంతోషిస్తారు. చెల్లెలు శారదను కొండయ్య కొడుకు కామయ్య కియ్యాలని తన పెద్దల అభిప్రాయం అని తెలుసుకొంటాడు రామం. ఈ పెళ్లికన్నా చెల్లెలికి చదువు చెప్పిస్తే మంచిదని తల్లికి చెపుతాడు. రామం తండ్రి కాళిదాసు రామాన్ని కొన్ని సంగతులు మాట్లాడను పిలుస్తాడు. కాళిదాసుగారు, రామం శారదను కామయ్యకిచ్చి వివాహం చేయాలనుకుంటారు. రామం ఇంటికి వెంకటేశ్వర్లు వస్తాడు. అతన్ని చూసి కామయ్య అసూయ చెందుతాడు.

వెంకటేశ్వరులు నోట మాటలేదు... ముఖం వాడిపోయింది. రామం మరోలా అర్థం చేసుకున్నాడు. "పల్లెటూరి సంబంధం చెయ్యడమేమిటని ఆశ్చర్యపోతున్నావా ?..."

"ఔను..."

## 10

వెంకటేశ్వరులు వెళ్లిపోయేడు మర్నాడే. పరీక్షలు పది రోజులుండగా విశాఖపట్నం వస్తానని చెప్పేడు రామం. ఆ రాత్రి విరహ గీతాలు కొన్ని రాసేడు... పద్యాల రూపంలో కాకుండా పాటల రూపంలో. జీవితంలో అనుకున్నవి జరగడానికి చాలా హంగులు కావాలి. "నేను శారదని చేసుకుంటా(నా...ఆ పల్లెటూరి వాడి కివ్వకండి' అని తను చెప్పగలుగుతే వాళ్లు సంతోషంగా ఒప్పుకుంటారు- కాని తను ఆ మాటలు అనగలిగే స్థితిలో లేదు. తనింకా ప్రయోజకుడవలేదు. చదువు ఇంకా ఎస్. ఎస్. ఎల్. సి. ఏ నడుస్తోంది. ప్యాసవడం మానడం దేవుడి కెరుక. తరవాత ఏమిటి ? చదవడంకాని, ఉద్యోగాన్వేషణకాని. తమ్ముళ్లున్నారు... చెల్లెలుంది... ఆ ఇల్లు తప్ప వేరే ఆస్తి లేదు. ఇప్పటినించీ పెళ్లిచేసే ఊహ తల్లిదండ్రులకి అసలేలేదు. ఇటువంటి పరిస్థితులలో కళ్లముందు కనిపించి మాయమయే ఆనందాన్ని తలచుకొని ఏడవడం తప్ప మరో గతి లేదు. శారద వీధి గుమ్మంవరకూ వచ్చింది... తను వెళ్లిపోతున్నందుకు విచారిస్తున్నట్టే ముఖం పెట్టింది. "మా ఊరు రా... పడవలూ... విమానాలూ చూద్దువుగాని..." అన్నాడు. శారద "అలాగే" అంది. "ఏంరా అదోలా ఉన్నావు ?" అన్నాడు రామం, వెంకట్‌ని బస్సు ఎక్కించి. "నువ్వు రావడంలేదని విచారంగా ఉందిరా. ఈ పరీక్ష ఏమౌతుందో ?" "నేను వచ్చేస్తానుగా, నీ పరీక్ష పోతే నా పరీక్ష పోయినట్టే... సరా ?" అన్నాడు రామం. "ఆఁ... అన్నట్టు, 'భారతి' వారు పది రూపాయలు పంపేరు... ఇంద నీ షేరు..." అని అయిదు రూపాయలు ఇచ్చేడు వెంకటేశ్వరులు. ఆ ఉదయమే రాత్రి వెంకటేశ్వరులు రాసిన విరహ గీతాలని దిద్ది పోస్ట్‌లో వేసేరు. "ఒద్దురా..." అన్నాడు రామం. కాని వెంకటేశ్వరులు ఒప్పుకోలేదు... బస్సు వెళ్లిపోయింది.

ఆ రాత్రి కాంతమ్మ అంది భర్తతో అతడు ఒంటిగా ఉన్నపుడు. "రామం స్నేహితుడు వెంకట్‌కి మన శారదనిస్తే ఈడూ జోడూ సరిపోతుంది... వాళ్లిద్దరినీ చూస్తూ ఉంటే ఎంతో ముచ్చటవేసింది"

కాళిదాసు చిరునవ్వు నవ్వేడు. "వాళ్లు చేసుకోరు. చేతిలో ఉన్న సంబంధం వదులుకొని వెర్రిగా పరుగులుతీసి నష్టపోయేది మనమే... వాళ్లు కాదన్నారనుకో. ఆ సంగతి వీళ్లకి



తెలుస్తోంది. ఏ మొహం పెట్టుకుని మళ్ళా వీళ్ల దగ్గరికి వెళ్లగలం ?''

మర్నాడు మధ్యాహ్నం మూడు గంటలకి మంచి ముహూర్తం అని నిర్ణయించుకొని, పళ్ళూ, పసుపూ, కుంకుమా ఒక పళ్లెంలో వేసి కొండయ్య ఇంటికి తరలివెళ్లేరు అడగడానికి... ఆ ఉదయమే బుచ్చమ్మ రావడం, కాంతమ్మా ఆమే మాట్లాడుకోవడం జరిగేయి. కాబట్టి ఖాయపరచుకోడమే తరవాయి. రామం కూడా వెళ్లేడు. చాపలు పరిచేరు కొండయ్య ఇంట్లో. మధ్య జెంబుకానా పరిచేరు. అగరువత్తుల వాసన గుబాళిస్తోంది. ''రా... బావా.. రా!'' అని కొండయ్య కాళిదాసుని ఆహ్వానించేడు. కాంతమ్మా, బుచ్చమ్మా తమ పెళ్లినాటి పుటాల పట్టుచీరలు కట్టుకున్నారు. లక్ష్మి పరికిణీ, బాడీ వేసుకొని సందడిగా తిరుగుతూ ఎవరికేం కావాలో అందిస్తోంది... రామం, కామయ్యా అక్కడే ఉన్నారు.

అందరూ కూర్చున్నాక ఈ కబుర్లూ ఆ కబుర్లూ అయ్యేక అసలు సంగతి వచ్చింది... కాళిదాసు అన్నాడు, ''మన కుటుంబాలు రెండూ ఈ అగ్రహారంలో మన తాతల కాలంనించీ ఉంటున్నాయి. మన తరం అయిపోతోంది. పిల్లలు పెద్దవాళ్లవుతున్నారు. మన రెండు కుటుంబాల మధ్యా స్నేహ సంబంధాలు మనతో ఆఖరవ కూడదు...అందుకు దేవుడే ఓదారి చూపించేడు... మా పిల్ల శారదని, మీ పెద్దబ్బాయి కామయ్య కిద్దామన్న సంకల్పం కలగజేసేడు ఏడుకొండల వాడు... శారద పుట్టినప్పటినించీ అది అనుకుంటున్నదే... మన కుటుంబాల మధ్య బాంధవ్యం ఏర్పడడం అన్నివిధాలా శ్రేయస్కరం, మా పిల్లని మీ ఇంట వేస్తే మాకే బెంగా ఉండదు. మా ఇల్లెంతో, మీ ఇల్లూ అంతే దానికి... కాబట్టి మా మాటని మన్నించి మా పిల్లని మీ కోడలిగా చేసుకుందుకు ఇష్టపడతారని నమ్ముతున్నాను...''

కొండయ్య పకాపకా నవ్వేడు... ''దానికింత ఉపన్యాసం ఎందుకు బావా ! అది మనం ఏనాటి నించో అనుకుంటున్నదే... ఇవాళ స్థిరపరుచుకుంటున్నాం...'' నిన్న రాత్రి భార్య ఇచ్చిన వార్నింగు బుర్రలో తళుక్కుమంటూ ఉండగా అన్నాడు— ''మీరు ఏమాత్రమన్నా నసిగేరో సంబంధం తప్పిపోతుంది... అబ్బాయికి పిల్లమీద ఇష్టం ఉంది... నాకు ఈ సంబంధం తప్ప మరోటి వద్దు... కట్నం అదీ పట్టింపుఒద్దు... వాళ్లేమిస్తారో పుచ్చుకోండి... మనం ముష్టి వాళ్లం కాం...'' అని రాత్రి బుచ్చమ్మ చెప్పింది. దానిమీద ఇద్దరికీ అవవలసిన వాదోపవాదాలు అయేయి కాని మగాడు ఓడిపోయేడు.

కాళిదాసు ఆశ్చర్యపోయేడు. తుపాకులు పేలకుండానే కోట స్వాధీనం అయినందుకు.. ''చాలా సంతోషం బావా...! ఇంక కట్నకానుకల విషయంలో... మా సంగతి మీకు తెలీనిదేముంది. ఏదో ఉన్నంతలో ముద్దూ ముచ్చటా జరిపిస్తాం... సాంప్రదాయపరంగా లాంఛనాలు ఇస్తాం... మూడు రోజుల పెళ్లి చేస్తాం...''

''సరే కట్నకానుకలకేం బావా... మనకి ముఖం బంధుత్వం... ఒరే కాముడూ మన వాళ్లందరినీ ఒక కేకవెయ్యి...'' అన్నాడు కొండయ్య.

మనవాళ్లంతా రెక్కలు కట్టుకు వచ్చేరు. వృద్ధ బ్రాహ్మణులు. చెవులకి కుండలాలు... తలమీద పండు వెంట్రుకలు... ముఖాన ముడతలు. వాళ్ల సమక్షంలో ప్రధానం జరిగింది. సంస్కృతంలో శుభం పలికేరు పెద్దలు. చీరల చాపులు, అరటిపళ్ల గెలలు, కొబ్బరిబొండాలు, వెండి కంచాలలో తాంబూలాలూ అన్నీ క్షణంలో వచ్చేయి మధ్యకి... అంతా పద్ధతి ప్రకారం జరిగింది. బ్రాహ్మణులకి తలకి రూపాయి సంభావన, డజను అరటిపళ్ళు, తమలపాకులు, చెక్కలూ దొరికేయి.

వేసంగిలో పెళ్లి... తారీఖు నిర్ణయిస్తారు.

* * *

రామానికి సంతోషంగానే ఉంది. ఇంట్లో అందరికీ ఉత్సాహంగా ఉంది. పెళ్లి ప్రయత్నాలు మర్నాడే ఆరంభం అయిపోయేయి. పుల్లగుమ్మడి

కాయలు పెద్దవి నాలుగు ఇంట్లో వచ్చి పడ్డాయి. ధాన్యం ఇనకలో వేచి పేలాలుచేసేరు... పేలవడియాలు, గుమ్మిడి వడియాలు పెట్టేరు. అప్పడాల పిండి విసిరించి, పిండి కలిపి రెండు రోజులుపాటు ఊళ్లోని అమ్మలక్కలంతా వచ్చి కబుర్లు చెప్పుకుంటూ అప్పడాలు వత్తేరు. వెయ్యి అప్పడాలు... వెయ్యి వడియాలు...పెద్ద సైజువి దింపుళకి... చిన్న సైజువి వడ్డనకి.

కందులు, మినుములు, పెసలు, ధాన్యంవచ్చి వీధి కొట్టాంలో నిలవ ఉంది. ధాన్యం ఢెంకీల కిచ్చేరు. నెయ్యి సేకరణ జరుగుతోంది...నువ్వులు కొండయ్య పొలం నుంచి వచ్చినవి కాని గానుగ ఆడడానికిచ్చేరు.

ఈ ప్రయత్నాలకోసం వెయ్యి రూపాయలు కొండయ్య దగ్గరనించి తెచ్చేడు కాళిదాసు. కట్నం వెయ్యినూట పదహార్లు...వెండి చెంబూ, పట్టుబట్టలూ... అంతా కలిపి కట్నానికీ, సీళ్లకీ వాళ్లకీ బట్టలకీ రెండువేలు. పెళ్లికి భోజనాలకీ, బాజాలకీ, సంభావనలకీ, తదితర ఖర్చులకీ వెయ్యి... అంటే ధాన్యం, అపరాలు కొనకుండా ఉండబట్టి. రెండెకరాలు కొండయ్యకి అమ్మేసేడు ఆరువేలకి. పాత బాకీ చెల్లుకొట్టుకోగా నాలుగువేలు చేతి కొచ్చింది...

రామానికి చదువు సరిగా సాగడం లేదు ... పనులు ఎదుతున్నాయి. 'మే' నెలలో పెళ్లి నిశ్చయనుయింది. పదహారో తారీకు... తెల్లవారు జామున... రెండుగంటల ... పదినిముషాలకి ... శుభలేఖలు అచ్చువేయించి వచ్చేటపుడు తేవడం రామం పని.

శారద కోసం నగలు చెరిపించి చేయిస్తున్నారు. కనకరాజుని పిలిపించి పని బెత్తాయించేరు. వడ్డానాలూ అవీ పాతకాలంవి. అవి చెరిపించి మెడలోకి పాళ్లనెక్లేసూ... చెవులకీ ... ముక్కుకీ ఆభరణాలు చేయిస్తున్నారు.

శారద తెగసిగ్గు పడుతోంది. ఎవరు పడితే వాళ్లు హాస్యమాడుతున్నారు ... ఎగతాళి చేస్తున్నారు. బుచ్చమ్మ రోజుకొకసారన్నా వచ్చి కాబోయే కోడలిని చూసి వెళ్తోంది... కామయ్య రావడం తగ్గించేడు .. కాని తండ్రికి తెలియకుండా పొలంమీద వచ్చిన దినుసులెన్నో కాళిదాసు ఇంటికి పట్టించేడు... ఆ సంగతి కాళిదాసుకీ తెలీదు... కాబోయే అత్తగారికీ, అల్లుడికీ తప్ప.

## 11

పరీక్షలు పది రోజులున్నాయనగా రామం తిరిగి వచ్చేడు విశాఖపట్నం. రామం వచ్చేడన్న సంగతి తెలిసి ఆదినారాయణ వచ్చేడు. "ఏంరా... నేను ప్యాసవాలని నీకు లేదేంటి ?" అంటూ ఆరంభించేడు దీవనలు. "నీ కోసం నోట్సులన్నీ రాసిపెట్టే వెళ్లేను కదా? అవి చదువుతే చాలు" అన్నాడు రామం. "సరే... ఎప్పటినించి చదువు ఆరంభం అవుతుంది ?" "ఇవాళనించే ... నీ పుస్తకాలు పట్టుక వచ్చి ..."

కృష్ణుడు ఈ మధ్య వచ్చి మెసేజ్ ఇచ్చేడు... "మీనాక్షి నువ్వు రాగానే వాళ్ల ఇంటికి రమ్మంది..."

వెంకటేశ్వరులు 'భారతి' మరో నెల కాపీ తెచ్చిపడేసేడు ... "ఇవిగో మనం పంపిన గేయాలు... పంపగానే అచ్చయేయి ... పద్యాల కన్న గేయాలు రాయడంలోనే నాకు చెయ్యి తిరిగి ఉంది... అవి కష్టం లేకుండా కాయితం మీద పడుతున్నాయి ..." రామంకి తెలుసు అవిపడ్డ సంగతి. వెంకటేశ్వరులు రాసేడు. అందుకు, వాటిని అచ్చులో చదివి సంతోషించేడు.

విశాల వచ్చి రామంకి కావలిసిన సదుపాయాలన్నీ చేసింది. వీధి గదిలో ఉన్న తక్కిన సామానులన్నీ ఖాళీ చేసి ముగ్గురు చదువుకుందుకీ పడుకుందుకీ ఏర్పాటు చేయబడింది. అందరి గురించీ కుశల ప్రశ్నలయ్యేక పూర్ణమ్మ అంది... "నువ్వు మరెక్కడికీ వెళ్లక్కరలేదు... ఇక్కడే నీ భోజనం అన్ని రోజులూ విన్నావా ?" "ఎందుకండీ మీకు శ్రమ..." అన్నాడు రామం మాటవరసకి. ఆ రాత్రినించీ జాయింట్ స్టడీస్ ఆరంభం అయేయి. ఆదినారాయణ ఫ్లాస్క్ నిండా 'టీ' పోసి పట్టుకొచ్చేడు. ఒక సిగరెట్టు పేకెట్టూ, అగ్గిపెట్టె తెచ్చుకున్నాడు.

"ఇంగ్లీషుతో ఆరంభిద్దాం ..." అన్నాడు ఆది...

"లేదు. మాతృభాషతో ప్రారంభించడం శుభం ..." అన్నాడు వెంకట్.

"లెఖ్ఖలు చేద్దాం. నిద్రవస్తే లెఖ్ఖలు తెలివి తెప్పిస్తాయి... ఆల్జిబ్రా తియ్యి ..." రామం అన్నాడు.

"లెఖ్ఖలు మాత్రం ఇప్పుడొద్దు ... అది పొద్దున్నే... హిస్టరీ తీసి ఆరంభిద్దాం...అశోకుడి గురించి చదువుదాం ... అశోకుడు రోడ్లు వేయించెను, చెట్లు నాటించెను, సత్రవులు కట్టించెను... సులభం..." ఆది ఆఖరికన్నాడు.

పుస్తకాలు తెరిచేరు ... తెరవగానే ఆదినారాయణకి నిద్ర ఒచ్చింది...'టీ' తీసి తను తాగి, ఇద్దరికీ ఇచ్చేడు..."ఏంరా? ఇంటిమీద మనసు పోయిందేమిటి?" వెంకటేశ్వరులడిగేడు... "పోనీ ఇవాళకి ఒక్క అశోకుడ్ని గురించి చదివి ఆపేద్దాం...రేపట్నించి నిజంగా ఆరంభిద్దాం..." ఆది సజెషన్ ఇచ్చేడు. "నేను మీకు టూకీగా చెప్పేస్తాను వినండి. జ్ఞాపకం ఉండిపోతుంది." అని రామం ఒక పావుగంటసేపు అశోకుడి మీద రాగల ప్రశ్నలూ, వాటికి రాయవలసిన జవాబులూ చెప్పేడు. "ఇప్పుడు చెప్పు ఆదీ...బౌద్ధ ధర్మ ప్రచారానికి అశోకుడు ఏం చేసేడు? ఆరు పాయింట్లు..." ఆదినారాయణ చెప్పేడు... వెళిపోతానన్నవాడు కూర్చున్నాడు. రాత్రి పన్నెండుకి ఇంటికి పోయేడు ఆదినారాయణ. వెంకటేశ్వరులు పక్క పరుచుకొని నిద్రపోయేడు. అప్పుడు రామం లెఖ్ఖలుతీసి ప్రాబ్లమ్స్ చేసేడు రెండు వరకూ. రెండుకి లైటార్పబోతూ ఉండగా తలుపు తీసుకొని విశాల వచ్చింది... "ఇంకా చదువుతున్నావా?" అని అడిగింది ఆవలిస్తూ. రామం ఆశ్చర్యపోయేడు... "నువ్వెందుకు లేచేవ్ ఇప్పుడు?" "మీరు చదువుతున్నదీ లేనిదీ అమ్మ ఒక కన్నువేసి ఉంచమంది..." చిరునవ్వుతో అంది. "రామం... మీ చెల్లెలు పెళ్లా?" అని అడిగింది...

రామంకి నిద్రొస్తోంది..."వెళ్లి పడుకో... నాకు నిద్రొస్తోంది..."

విశాల గదిలోకి వచ్చి అడిగింది. "మీనాక్షి ఎందుకు కబురు చేసింది?"

"ఏమో నాకు తెలీదు...నువ్వు నిద్ర పోలేదా ఏం?"

"నువ్వు ఒక్కడివీ ఇంక దొరకవు. నీకు మరి పనులు చెప్పడం మానేస్తుందిట అమ్మ రేపట్నించీ ... మనిద్దరం మాట్లాడుకోడం ఎప్పుడు...? అందుకు నిద్రపోతూ, లేస్తూ పడిగాపులు పడ్డాను..."

రామంకి అర్థంకాలేదు...విశాల ప్రవర్తన వింతగా ఉంది ... "ఏమున్నాయి మాట్లాడుకుందుకి ?"



## రక్తస్రావం లేకుండా ఆపరేషన్ చేసే కత్తి !

మేరీలెండ్ యూనివర్సిటీ ఆస్పత్రిలో మెడికల్ ఇంజనీర్లు ఒక కొత్తరకం మైక్రో వేవ్ కత్తి తయారు చేశారు ఈ కత్తితో శస్త్రచికిత్స చేయటానికి చర్మాన్ని కోస్తూ ఉండగా రక్తనాళాలు మూసుకుపోతుంటాయి. ఆ విధంగా ఆపరేషన్ జరిగేటప్పుడు రక్తస్రావం జరుగదు.

ఈ ఆపరేషన్ కత్తి మార్కెట్‌లోకి రావటానికి ఇంకొక సంవత్సరం పట్టవచ్చు. క్లిష్టమైన ఆపరేషన్లు జరిగేటప్పుడు రక్తస్రావాన్ని నిరోధించటానికి ఈ శస్త్రచికిత్సా సాధనం బాగా ఉపయోగపడుతుందని సర్జన్లు భావిస్తున్నారు.

విద్యుచ్ఛక్తి ద్వారా జనించే వేడిమితో ఈ కత్తి పనిచేస్తుంది. రక్తంలోని ప్రోటీను రూపాన్ని, పదార్థాన్ని మార్చటం ద్వారా, శరీరంలో కోత పెట్టేటప్పుడు ఎప్పటికప్పుడే రక్తం గడ్డ కట్టుతుంది

ఈ శస్త్రచికిత్సా సాధనం, ఇప్పుడున్న ఆపరేషన్ సాధనాలు అన్నిటికంటే కూడా మేలైనదని మేరీలెండ్ యూనివర్సిటీ డాక్టర్లు అంటున్నారు. శారీరక అంగాలను పరిరక్షించటానికి శస్త్రచికిత్స చేయవలసి వచ్చినప్పుడు, ఈ సాధనంతో నిరాలస్యంగా ఆ పని చేయవచ్చు

ముఖ్యంగా, అత్యంత సున్నితమైన స్ప్లీన్‌పై జరిగే శస్త్రచికిత్సకు ఈ సాధనం బాగా ఉపయోగ పడుతుంది. గుల్మాన్ని పూర్తిగా తొలగించకుండానే ఈ సాధనంతో ఆపరేషన్ చేయవచ్చునని డాక్టర్లు అంటున్నారు

## ఉదయ సంధ్య

"మీనాక్షికి మాట్లాడ్డానికుంటే నాకూ ఉంటాయి కబుర్లు... మాడూ . ఇక్కడున్నన్నాళ్లూ నీ పనులన్నీ నేను చేస్తాను నీకేం కావాల్సినా నన్నడుగు..."

"సరే విశాలా. .వెళ్లి పడుకో..." హరికేన్ దీపం ఆరిపోబోతుంది ... కిరసిన్ అయిపోయినట్టుంది ..

"మాటియ్యి...చేతిలో చెయ్యి వెయ్యి..." చెయ్యి పట్టుకుంది కళ్లల్లోకి లోతుగా చూస్తూ, ఆ చూపులు రామంలో ఆందోళన రేపేయి. చాలా చిత్రంగా ప్రవర్తిస్తున్నది .

"ఇందులో పెద్ద మాటియ్యడానికేముంది ."

"నీ చెల్లెలికి అప్పుడే పెళ్లే! నాకన్న ఒకఏడు పెద్దది కామోసు అన్న చెప్పేడు ఎంతో బావుంటుందిట మీ చెల్లి ? ఆ పల్లెటూరి వాడికెందుకిస్తున్నారు ?" చెయ్యి వదలకుండా అంది

"ఆడది పెళ్లి చేసుకుని అత్తవారింటికి వెళ్ళిపోవాలికదా ఎపుడో ఒకప్పుడు పల్లెటూరులో పుట్టి పెరిగినది అక్కడే సుఖంగా ఉంటుంది ఇంక వెళ్లి పడుకో. ." చెయ్యి విడిపించుకున్నాడు. .

విశాల అప్పుడు చాలా సాధారణంగా అంది "నువ్వూ చాలా బాగుంటావు "

రామం ఉలిక్కిపడ్డాడు ఈ సంభాషణ మరో తోవ పడుతోంది దీపం ఆరిపోయింది ఒక్కసారిగా . విశాల రామం ముఖం ఆ చీకటిలో తడిమి "వెధవ దీపం ఆరిపోయింది " అంటూ రామం బుగ్గమీద ముద్దు పెట్టుకుని అంది "గుర్తుంచుకో మీనాక్షి ఏం చెప్పినా వినకు నేను అందరికన్నా ముందు చెప్తున్నాను నేను నిన్ను పెళ్లి చేసుకుంటాను మరెవ్వర్నీ చేసుకోను "

రామం కొయ్యబారిపోయేడు చెవిలో ఆ మాటలంది విశాల ఆమె పెదవులు చెవులకు తగుల్తున్నాయి ఆమె ఒళ్ళు తన ఒంటికి తగుల్తోంది యవ్వనాన్ని పొందబోయే ఆమె శరీరం ఆ సంగతి చాటుతోంది ఈ పరిస్థితిలో ఏం చెయ్యడం ? తన శరీరం స్వాధీనంలో ఉంచుకోవాలి విశాల నెలాగన్నా ఇక్కడనించి పంపాలి రామం విశాలని భుజం పట్టుకుని బైటకి తీసుకవచ్చి ఆమెతో మెల్లిగా అన్నాడు 'మీ అమ్మ లేస్తే నీకు నిజంగానే అవుతుంది పేముబెత్తం పెళ్ళి నువ్వు బాగా చదివి డాక్టర్‌వి అవుతావేమో ? ఇలాంటి వెర్రివేషాలు వేస్తే నీ చదువు చెట్టెక్కిపోతుంది . నువ్వు డాక్టర్‌వి అయ్యేక నా దగ్గరికొచ్చి ఇవ్వాళ్ళన్నమాట అను అప్పుడు తప్పకుండా అలాగే అంటాను " మెల్లిగా గొణిగి ఆమెని ఇంట్లోకి తోసి తలుపు గడ పైనుంచిపెట్టి గదిలోకొచ్చి పడుకున్నాడు

పెళ్లి పెళ్లి పెళ్లి ఈ ఆడపిల్లలకి పెళ్లితప్ప మరో గొడవలేదు మంచిపనే చెల్లెలికి సంబంధం కుదిరి పెళ్లి జరిగిపోవడం విశాల ఎంత చొరవున్న మనిషి ! ఈ క్షణానికి అలా అని అనిపించింది తను దగ్గరగా ఉండబట్టే దూరమవగానే మరిచిపోవడం జరుగుతుంది. ఇలా రాత్రిళ్లు గదిలోకి దూరొద్దని చెప్పాలి వెంకటేశ్వరులు లేచి ఉంటే ! అప్పుడు గుర్తుకొచ్చింది విశాల తన బుగ్గమీద ముద్దు పెట్టుకుంది ! గుండె ఒక్కసారిగా ఎగసింది

* * *

దుర్గమ్మగారి ఇంటికి వెళ్లేడు మర్నాడు మీనాక్షి ఇంట్లోనే ఉంది దుర్గమ్మ మామూలుగా అడిగింది "ఏమబ్బాయి ఇంటికివెళ్లి ఈ ఊరే మరిచిపోయేవ్ ?" "ఎలా ఉన్నారు అమ్మా, నాన్నా ?" అని ఏరా మాష్టారడిగేరు అప్పుడే అతను బయటకి పోబోతున్నాడు "బాగున్నారండీ మా చెల్లెలికి పెళ్లి నిశ్చయమయిందడీ 'మే' నెలలో. " రామం చెప్పేడు

మాష్టారు ఆశ్చర్యపోయేరు "అప్పుడే ! ఇంత చిన్న వయసులోనే పెళ్లేమిటయ్యా ?"

"అవతలవాళ్లు తొందర పడుతున్నారు కొండయ్యగారి పెద్ద కొడుకు కిస్తున్నాం వ్యవసాయం ఉంది. మీరంతా రావాలి ."

"ఓ తప్పకుండా ! మా ఆవిడా నా ప్రాణం తినేస్తోందయ్యా మీనాక్షికి పెళ్లి చేసేమని. ఇప్పటినించీ దానికి పెళ్లేమిటి చెప్పు ?"

ఇటీవల కరీంనగర్‌లో జరిగిన జాతీయ సమైక్యతా చలన చిత్రోత్సవ ముగింపు సమావేశంలో ప్రసంగిస్తున్న జిల్లా పరిషత్ ఛైర్మన్ శ్రీ కె. సాయిరెడ్డి. ఫిల్మ్ క్రిటిక్ శ్రీ గుడిపూడి శ్రీహరి, నవలా రచయిత శ్రీ నవీన్, ప్రభృతులను కూడ చిత్రంలో చూడవచ్చు.



# విధి నిర్ణయం




## ..ధర్మ పథం..

–బులుసు వేంకట రమణయ్య

మధురంగా పాడడం, సంతోషంతో దానం చెయ్యడం, రసవంతంగా కవిత్వం చెప్పడం పుట్టుకతో సహజంగా వస్తాయి కాని నేర్చుకుంటే వచ్చేవి కావు. కొన్ని పుట్టుకకు ముందే శిశువు గర్భంలో ఉండగానే సృష్టికర్త చేత నిర్ణయింపబడతాయి. వాటిని తప్పించ డానికి సృష్టి చేసిన బ్రహ్మకు కూడా సాధ్యం కాదని ''లలాట లిఖితా రేఖా పరిమార్జ్యుం నశక్యతే—నుదుటన్ వ్రాసిన వ్రాత మాయగలదే నూరేండ్లు చింతించినన్'' అని చెప్తూ ఉంటారు. గర్భస్థమైనపుడే మానవునికి నిర్ణీతమైనవి అయిదని చెప్పారు. అవి —

''ఆయుః కర్మచ విత్తం చ —
విద్యా విభవమేవ చ,
పంచైతాని విధీయంతే —
గర్భస్థస్యైవ జంతునః''

ఆయుర్దాయం, పుణ్య పాప కర్మ, ధనం, విద్య, ఐశ్వర్యం అనే అయిదూ శిశువు గర్భంలో ఉన్నప్పుడే నిర్ణయింపబడతాయి'' అని దీని అభిప్రాయం.

ఆయుస్సు మన చేతిలో లేదు. మనం శరీరాన్ని ఎంత కాపాడుకొన్నా, ఎప్పుడయినా అనారోగ్యం కలగవచ్చును. మందులవల్ల తాత్కాలికంగా ఉపశమనం కలుగవచ్చును. అది తీవ్రమైనపుడు చికిత్సలకు లొంగక పోవడంవల్ల ప్రాణం పోవచ్చును. ఏ రోగమూ లేనివారుకూడా ఆశ్చర్యం కలిగిస్తూ మరణించ డమూ ఉన్నది. అందువల్ల ఆయుస్సు విధి నిర్ణయమని చెప్పవలసియున్నది.

ఈ రీతిగానే పాపకర్మగాని, పుణ్యకర్మ గాని మొదట నిర్ణీతమైన రీతినే జరుగుతూ ఉంటాయి. పుణ్యకర్మలు చేయాలనే సంకల్పం ఉన్నా అవి జరగవు. పాప కర్మలు చెయ్యకుండా ఉండాలన్నా, మనస్సు ఆ కర్మలను చేయిస్తూనే ఉంటుంది.

ధనం కూడా పూర్వజన్మంలో చేసుకున్న సుకృతంవల్ల లభించవలసినదే! ధనయోగం లేనప్పుడు ఎంత శ్రమపడినా అది లభించదు. ఎలాగో చచ్చీచెడి సంపాదించినా అది చెయ్యిజారి పోతుంది.

విద్యకూడా విధి నిర్ణీతమైనదే! విద్య లభించే యోగం లేనప్పుడు బుద్ధిమాంద్య మయినా ఏర్పడుతుంది. బుద్ధిమాంద్యం లేకపోయినా అశ్రద్ధ అయినా ఏర్పడుతుంది. ఏ విధంగా అయినాసరే విద్యాప్రాప్తి ఉండదు.

విభవమంటే ఐశ్వర్యం. దీనికీ, ధనానికీ చాలా వ్యత్యాసం ఉన్నది. ధన విభవాలు సిరిసంపత్తులని ప్రసిద్ధి. లెక్కింపరాని ధనం ఉంటే ఉండవచ్చును. అది అనుభవించ గలిగినప్పుడే గృహస్థు సంపన్నుడవుతున్నాడు. ఈ అయిదూ విధి నిర్ణయాలేకాని ప్రయత్న సాధ్యాలు కావు. ★

---

దుర్గమ్మకి కోపం వచ్చింది. ''పిల్లలు ముదిరితే మనం చెప్పినమాట వింటారా? వాళ్ళు పెద్దవాళ్ళై ఉద్యోగాలు చేస్తూ ఉంటే కట్నాల దాహం మనం తీర్చలేం.''

ఎర్రా మాష్టారు వెళ్ళిపోయేరు. మీనాక్షి మేడమీంచి క్రిందకొచ్చి రామాన్ని చూసి మూతి ముడుచుకుని అంది..''ఇన్నాళ్ళకి గుర్తుకొచ్చేమా మేం ?''

''పనులుండి ఉండిపోయేను.'' ''మేడ మీదికి పద... నాకెన్నో పాఠాలు అర్థమవడం లేదు... నువ్వే చెప్పాలి...''

రామం మేడమీదికి వెళ్ళేడు. కుర్చీ చూపించింది మీనాక్షి. ''కూర్చో... నీతో మాట్లాడాలి...'' క్రిందికివెళ్ళి టిఫిన్ తెచ్చి ఇచ్చింది. రామం కూర్చొని తింటూ ఉండగా మీనాక్షి చెప్పింది... ''నాకు పెళ్ళి చేద్దాం అని చూస్తున్నారు మావాళ్ళు...'' ఆ మాటలని ఊరుకొని రామం కళ్ళలోకి చూసింది.

రామం ఆశ్చర్యపోయేడు. ఇప్పుడిప్పుడే మాష్టారు తన చెల్లెలికిప్పట్నించీ పెళ్ళి గురించి విముఖత వ్యక్తపరిచేరే ? ''మీ నాన్నగారి కిష్టమేనా ?''

''నాన్నకిష్టంలేదు... కాని అమ్మ రోజూ పోరుపెడుతోంది. మా మేనత్త కొడుకు ఒకడున్నాడ్లే రాజమండ్రిలో. వాడు ఇంటర్ చదువుతున్నాడు. వాడికిచ్చేద్దాం అని చూస్తున్నారు. వాడికి పెళ్ళి చేసేసి, వాడికింక పైచదువులు చెప్పించడానికి ప్లాను వేస్తోంది అమ్మ ...''

''నీ ఉద్దేశం ఏమిటి ?''

''నా ఉద్దేశం ఎవరికి కావాలి ? నాకసలు పెళ్ళే చేసుకోవాలని లేదు. నాకింకా చదువు కోవాలని ఉంది. పెళ్ళి చేసుకుంటేనో ? ఇంక అత్తగారు నామీద అథారిటీ చెలాయిస్తుంది. మొగుడుగారు అథారిటీ, చెలాయిస్తారు. ఇంటి చాకిరీ అంతా నా నెత్తిన పడుతుంది... ఎందు కొచ్చిన గొడవ ? అమ్మ అంటుంది గదా, పెళ్ళి చేసేస్తాం కాని, నువ్విక్కడే ఉంటావే అని. అదెలాగవుతుంది ? వాళ్ళు ఊరుకుంటారా ? ఒకటి రెండేళ్ళు ఊరుకోవచ్చు. కాని తరవాత ? పండుగలకీ పబ్బాలకీ వెళ్ళి వస్తూ ఉండాలి. వాళ్ళది పెద్ద సంసారం. ఏదో పూట గడుస్తోంది... కుర్రాడు నల్లగా వాళ్ళ నాన్నలాగే ఉంటాడు. చింకి కళ్ళు ... నాకిష్టం లేదు. నువ్వు లేనప్పుడు వచ్చి వెళ్ళేడులే ... వాడిని తప్పించుకొనేసరికి తలప్రాణం తోకకొచ్చింది ... వాడి పెళ్ళాన్నయిపోయినట్టే మిడుతూ మిడుతూ మని నవ్వేవాడు... ఒకరోజు...'' గొంతు తగ్గించింది. ''లెక్కలు చెప్తానని చెప్పి ... ఇక్కడికి తీసుకొచ్చి...నన్ను ముద్దు పెట్టుకోబోయేడు..''

రామం ఆశ్చర్యపోగా నవ్వింది... ''ఏమిటి అలా చూస్తున్నావ్... ఇంగ్లీష్ సినిమాల్లో ముద్దులు పెట్టుకుంటారు చూడ్లేదూ ? అలాగ... వాడి నోరు ఉల్లిపాయ కంపు కొట్టింది దగ్గరకి రాగానే .. వాడు పెళ్ళి అయేక ఇక్కడ ఉండనిచ్చి చదవనిస్తాడా ?''

ఏం చెప్పాలో రామానికి బోధపడలేదు. ''నీకా అబ్బాయంటే ఇష్టం లేదన్నమాట ...''

''అన్నమాట ... తమ్ముడిమాట ... నీ మొద్దు బుర్రకి.... నీది ఇటువంటి వాటిలో మొద్దు బుర్రేలే.... నీ మొద్దు బుర్రకి ఇప్పుడా అర్థమయింది ? ఎలా తప్పించుకొన్నానని అడగవేం ? సినిమాలోని విలన్‌లా నా నడుం చుట్టూ చెయ్యివేసి దగ్గరకి తీసుకొని ముద్దు పెట్టుకోబోయేడు... ఇలాగ...'' చేతులు గాలిలో తిప్పి చూపించింది ... ''నేను హీరోయిన్‌లాగ భయపడలేదు... కేకవెయ్యలేదు ... 'నీ నోరు ఉల్లిపాయ కంపూ...' అన్నాను ... దాంతో వెంటనే నన్ను ఒదిలేసేడు లెంపకాయ తిన్నట్టు.. నేను పరుగో... మరి వాడు ఒంటరిగా ఉన్నప్పుడు వస్తే ఒట్టు ...''

(ఇంకా వుంది)

వాలు కుర్చీలో కూర్చుని వీధివేపు చూస్తున్నాడు మునసబునాయుడు.

అతని ప్రక్కనే ఆ ఊరి బారికాడు వెంకన్నచేతుల్ని కట్టుకుని మౌనంగా నించున్నాడు.

మునసబునాయుడినోట్లో లంక పొగాకు చుట్ట కాల్తోంది. తెల్లటి పొగ బయటకు గాల్లోకి వదుల్తూ ఒక కాలిమీద మరో కాలు వేసుకుని విలాసంగా చుట్ట కాల్చసాగేడతను.

కళ్ళు మూసుకుని ఏదో ఆలోచిస్తున్న నాయుడు వీధి గేటు తలుపు 'కిర్రున' చప్పుడైతే కళ్ళు తెరచి చూసేడు. గేటు తలుపు తోసుకుని వస్తున్న పంచాంగం పంతులు అవధాన్లు కనిపించాడు. మనిషి సన్నగా, రివట కర్రలా ఉన్నాడు. మాసిపోయిన గావంచా కట్టుకుని యింత విభూతి నామంతో అపర కుచేలుడి పోజులో కనిపించిన అవధాన్లును చూడగానే మునసబు నాయుడికి అంతవరకూ లోపల దాగిన కోపం కట్టలు త్రెంచుకుని బయటకుబికింది. లేడిమీదకు పంజా విప్పి దుముకబోతున్న పెద్దపులిలా విరుచుకు పడ్డాడు.

"ఏవయ్యా పంతులూ!... ప్రొద్దుటనగా రమ్మని కబురుపెడితే యిప్పుడా తీరుబడిగా రావడం? మునసబు కబురెడితే ఏక్కుతూ — నీల్గుతూ వచ్చేవంటే నీ యవ్వారమేటో, నీ పొగరేటో తేల్చవలసిందే!"

ఉరుములతోకూడిన పిడుగులు వర్షంలా పడిన నాయుడి కోపశరాలకు తడబాటుపడుతూ ఒకింతసేపు వణికిపోయాడు పాపం అవధాన్లు. క్షణకాలం నోటివెంట మాట రాలేదు. చివరకు ఎలాగో తేరుకున్నాడు.

"తమరు కబురుపెట్టిన వేళకు యింటివద్ద లేనండి!! అలా ఊళ్ళోకి కొస్తే వమండి

# దానం

యం. ఉమామహేశ్వర రావు



వెళ్ళడం జరిగింది. ఇప్పుడే తిరిగి వచ్చాను. మీరు కబురుపెట్టేరని కబురు తెలిసీ, తెలీడంతో పరిగెత్తుకొచ్చాను.''

ఎంతో వినయంగా అన్నాడు మునసబుతో.

మునసబు అతనికేసి దీర్ఘంగా ఓసారి చూసేడు. ''అసలు ఈవేళ నిన్నెందుకు రమ్మని కబురు పెట్టేనో తెలుసా ? '' హూంకరించాడు.

''తెలీదు. పెద్దలు మీరే సెలవియ్యాలి !'' చేతులు రెండూ జోడిస్తూ అన్నాడు అవధాన్లు.

''నీకు తెలీదయ్యా, తెలీదు ... నీ పొగరుబోతు ఆవును ఊళ్ళోవాళ్ల పొలాలమీదకు విప్పి వదిలేయడం తెలుసు. దానికింత మేత కడుపు నిండా పెట్టలేనివాడివి దాన్నెందుకు కొన్నావు?'' నాయుడీసారీ మళ్లీ హూంకరించాడు చుట్ట కొసను కిసుక్కున కొరికి బయటకు ఊస్తూ.

ఎండుటాకులా గజగజలాడేడు అవధాన్లు.

''క్ష మిం చం డి మునసబుగారూ ! నా ఆవును ఊరివాళ్ల పొలాలపైకి విప్పి ఎప్పుడూ తోలలేదు నేను. కట్టిన త్రాడును తెంచుకుని అది వెళ్లిపోతే తిరిగి తిరిగి పట్టుకుని యింటికి తెచ్చుకుంటున్నాను. బ డు గు వాణ్ణి. బీద బ్రాహ్మణ్ణి. ఏదో ఇంట్లో వాడుకుందుక్కోసం పాలచుక్కలకు పనికొస్తుందన్న ఉద్దేశ్యంతో ఎవరో మీ వంటి మహానుభావులు దానమిస్తే స్వీకరించాను'' అన్నాడు అవధాన్లు.

ఈ సమాధానంతో మునబుకు చిరాకు పెరిగింది.

''ఆపవయ్యా ! ఆపు. ఇప్పుడు నువ్వు ఆ ఆవును ఏ ఉద్దేశ్యంతో, ఎవరిదగ్గర, ఎలా స్వీకరించావో నాదగ్గర రికార్డు వెయ్యక్కర్లేదు. నేను నిన్నది అడగనూలేదు ఈ ఊళ్లో వాళ్లంతా కలిసి నీ యావు మీదా నీ మీదా ఎన్నో ఫిర్యాదులు చేసేరు. వాళ్ల పొలాలు తినేస్తున్నదని, పంటలు నాశనమై పోతున్నాయనిన్నూ ... ... ఇదిగో పంతులూ ! నీకు చేతనైతే దాన్ని ఎక్కడో దగ్గర గట్టిగా కట్టుకుని జాగ్రత్తగా పెంచుకో లేకపోతే ఏ దూరంగానో తీసుకునిపోయి అమ్మిపారేసుకో. నీ ఇష్టం. అంతేకాని ఇవ్వాల్టి నుంచి నీ ఆవుమీద మళ్ళా ఏవైనా రిపోర్టులు వస్తే నేనసలే మంచిమనిషినిగాను...ముందుగా నీ ఆవును ఏ మాంసం గమేళాకో ఇచ్చేస్తాను. ఆనక ఈ ఊర్నుండి నిన్నూ తగిలేస్తాను... ఆ !!''

అంటూ వాలుకుర్చీలోంచి లేచినించున్నాడు మునసబు. అవధాన్లు కళ్ళవెంబడి కన్నీళ్ళు అలుముకున్నాయి. దెబ్బతిన్న పక్షిలా గిలగిల్లాడుతూ భారంగ అడుగులు వేస్తూ కదిలేడు.

అతను గేటు దాటేవరకూ చూసేడు మునసబు.

''ఒరే !... ఆ ఆవుగల పంతుల్ని పిలిపించి గట్టిగా చీవాట్లు పెట్టేనని యిందాక మనకు ఫిర్యాదు చేసిన వాళ్ళందరితోనూ చెప్పు. లేకపోతే ఈ ఊరికి మునసబునై ఉండికూడా ఏటీ చెయ్యలేదని నామీద 'ఆళ్ళు ఏడుస్తారు... వెళ్ళు.'' అన్నాడు బారికాడు వెంకడిని ఉద్దేశించి.

''అలాగేనండి బాబయ్యా... ఇదిగో యిప్పుడే ఎల్తున్నానండి !'' అంటూ అక్కడినుంచి కదిలేడు వెంకన్న.

*    *    *

అవధాన్లు మనసు మనసులో లేదు. కన్ను మూసుకున్నా తెరుచుకున్నా మునసబు నాయుడి మాటలే పదే పదే గుర్తుకురాసాగేయి. ఎంత మరిచిపోదామన్నా, వెంటాడుతూనే ఉన్నాయా మాటలు.

''ఛీ . ఛీ... వెధవ బ్రతుకు. బ్రాహ్మణ పుట్టుక పుట్టి, అంతలేసి మాటలు అనిపించుకు బ్రతక్కపోతే ఏ చెఱువులోనో పడి చావ గూడదూ ? ?'' అంతరాత్మ తిట్టింది కాస్సేపు.

''రామ...రామ... ఎంతెంత మాటలన్నాడని ?'' ఆ మాటలన్నీ వినికూడా తనింక బ్రతికే ఉన్నందుకు అవధాన్లుకు చాల బాధ కలిగింది. ఆ వెంటనే ఆవూ గుర్తుకొచ్చింది. లేచి ఆవును సమీపించాడు.

''పిచ్చిముండ ! ఆకలేస్తే నేను చాతకాని వాణ్ణయిపోయానని గ్రహించి ఊరివాళ్ళ పొలాల మీద పడ్డావు. ఇప్పుడు వాళ్ళందరూ నీమీదనూ, నామీదనూ కత్తికట్టేరు... ఎలాగే నీతో ??'' అంటూ ఆప్యాయంగా దాన్ని నిమిరేడు.

''ఆసలిదంతా మీ వ ల్ల నే వచ్చింది.'' అవధాన్లు భార్య అంతెత్తున లేచింది భర్తమీద.

''అవునే... నావల్లనే వచ్చింది. నోరులేని ఈ జీవానికి కడుపు నిండా యింత తిండి పెట్టలేని నా చాతకానితనం వల్లనే గదా యిది ఊరి వాళ్ళ పొలాలమీద మేస్తోంది?... ఆకలే... ఆకలి. మనుష్యులమైతే నోరు విడిచి అడుగుతాం, కాని నోరులేని ఈ పశువుకేం తెలుస్తుంది ?''

తల పట్టుకున్నాడు అవధాన్లు.

''అలా తల పట్టుకుంటే ఏమీ జరగదు. ముందు ఏదో ఒకటి చేయాలి ...'' సలహా యిచ్చింది భ్రమరాంబ.

''అవును... ఏదో ఒకటి చేయాలి ...'' అంటూ ఆలోచనలో పడ్డాడు అవధాన్లు. ఇలా ఉండగనే బయట చీకట్లు దట్టంగా క్రమ్ముకున్నాయి.

ఆవు ఆలోచనలతో రాత్రంతా కలత నిద్దర పోయాడు పాపం అవధాన్లు.

*    *    *

ఉదయం లేచీ లేవడంతోటే బ్రహ్మాండమైన ఆ లో చ న తట్టింది అవధాన్లుకు. హుషారుగా ప్రక్కమీద నుంచి లేచేడు. ఇన్నాళ్ళుగా, యిన్నేళ్ళుగా ఈ ఆలోచన రాక ఆవు గురించి అనవసరంగా తలకాయ బ్రద్దలు కొట్టుకున్నందుకు, ఊరి వాళ్ళందరి చేత వెధవ మాటలు అనిపించుకున్నందుకు సిగ్గుపడ్డాడు.

ఆలస్యం చేయకుండా భార్య భ్రమరాంబ చెవిలో వేసేడు. ఇన్నాళ్ళుగా భర్త తెలివితేటల మీద పెద్దగా నమ్మకంలేని ఆవిడ ఎంతో సంబరపడిపోయింది.

''ఇది చాల బాగుందండోయ్ ! మీ ఆలోచన బ్రహ్మాండంగా ఉంది. మీదీ తెలివైన బుర్రే.'' మెచ్చుకోలుగా అంది భ్రమరాంబ.

''అవునే... అలా చేస్తే ఈ ఊరివాళ్ళ బాధ తప్పుతుంది. ఆవు కడుపునిండా యింత మేతా దొరుకుతుంది. ఆపైన మ న కెం తో పుణ్యం వస్తుంది. అసలు దానం చేయడంవల్ల ఎంత పుణ్యం వస్తుందో పూర్వీకులు లెఖ్ఖలు గట్టి మరీ చెప్పేరు. ఈ బొందిలోంచి జీవి వెళ్ళిపోయేక వైతరిణి నదిని సునాయాసంగా దాటెయ్యడానికి ఆవు ఎంతో ఉపయోగపడుతుందని చెప్పేరు పెద్దలు.''



మురిసిపోయాడు అవధాన్లు కాస్సేపు కానీ ఆ వెంటనే మరో సమస్య

అసలీ యావును ఎవరికి దానం చెయ్యాలీ యని ? యాయవారం చేసుకునే ఏ బీద బ్రాహ్మడికో దానం ఇస్తే . తను తిండానికే యింతన్నం దొరక్క అతనేడుస్తుంటే ఆవుకు మేత ఎడ్కడినుంచి తెస్తాడు ? పోనీ దారంట బోయే ఏ దానయ్యకో దానంచేస్తే ? అమ్మో!! వాడు పెంచలేక ఏ కసాయి గమేళా వాడికో యిచ్చేయగలడు ఆ వెనక కసాయివాడు దాన్ని ముక్కలు ముక్కలుగా నరికి..

ఇక ఆపై ఆలోచించడానికి ధైర్యం చాల్లేదు అవధాన్లుకు "పోనీ ఏ దేవస్థానం వాళ్ళకో దానం చేసేద్దాం దేవుడికిచ్చినట్లూ వుంటుంది, పైగా బోల్డంత పుణ్యం కూడ వస్తుంది..." భార్య భ్రమరాంబ యిచ్చిన ఈ సలహా చంకలో కితకితలు పెట్టినట్టయింది.

"నువ్వు యిక్కడుండవలసిన మనిషిగావు ఏ ప్రధానమంత్రి దగ్గర పి. యే గా ఉండాల్సిన దానివి సుమా !!" అంటూ భార్యను మెచ్చుకుని, ఆ రోజే తమకు బాగా దగ్గర్లోనేగల ఓ ప్రముఖ దేవస్థానంవారికి ఉత్తరం వ్రాసేడు అవధాన్లు.

* * *

ఓ నాల్రోజుల తరువాత దేవస్థానం వారి నుంచి ఓ సమాధానం అందింది అవధాన్లుకు అందులో, దేవుడికి ఆవును దానం చేయాలని అనుకోవడం ద్వారానే అతని 'జన్మ' ఎలా తరించిపోయిందో వివరిస్తూ, ఆవును తెచ్చి దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగార్ని కలుసుకొమ్మని వుంది.

అవధాన్లు సంతోషానికి పగ్గాలు లేవు

తన వంశం, తన జన్మ ఈ ఉత్తమ 'గోదానం' వల్ల తరించిపోయిందనుకున్నాడు ఆ వెంటనే దేవస్థానం వారికో ఉత్తరం వ్రాస్తూ, గోదానం అనేది ఉత్తమమైన శుభకార్యం కాబట్టి ఎప్పుడు రమ్మనేదీ వ్రాస్తే ఆ రోజు సతీసమేతంగా, గోవును తీసుకుని దేవస్థానంకు రాగలవాడనని, ఏ విషయమూ లేఖ వ్రాయమని వ్రాసి పోస్టు చేసేడు

అవధాన్లు తన ఆవును దానం ఇచ్చేస్తున్నట్లుగా అందరికీ తెలిసిపోయింది అందరూ అతన్నిప్పుడు పొగిడేవాళ్ళే

"గోదానంవల్ల నీ కుటుంబం తరించి పోతుందోయ్ !!"

తెలిసిన పంతులు ఒహోయన పలకరించేడు

చిర్నవ్వు నవ్వేడు అవధాన్లు

"అటు ఏడు తరాలూ — ఇటు ఏడు తరాలూ నీ గోదానంవల్ల పుణ్యలోకాలు పొందుతారు." ఇంకొకాయన అన్నాడు

అందుకూ చిరునవ్వే సమాధానం అవధాన్లు నుంచి

"అసలీ గోదానంవల్ల యింత పుణ్యం వస్తుందని యింతకుముందే తెలిసుంటే ఈపాటికే దానం చేసి ఉండేవాళ్ళం గదూ !! ?"

అవధాన్లు భార్య భ్రమరాంబ అంది

దానికీ అవునవే తలూపేడు అవధాన్లు

"ఏవండోయ్ ! మనం చెయ్యబోయే ఈ గోదానంవల్ల వచ్చే పుణ్యం మీకెంత వస్తుందో మీ భార్యగా నాకూ అంతే వస్తుందిట సగం మీకూ — సగం నాకూనూ" మళ్ళీ అందావిడ చిర్రెత్తింది అవధాన్లుకు

"సగం కాకపోతే ఈ పుణ్యం పూర్తిగా నువ్వే తీసేసుకో, నాకేమీ అఖ్ఖర్లేదు." కసురుకున్నాడు అతని మనసు దేవస్థానం వారు ఉత్తరం ఎప్పుడు వ్రాస్తారా, ఎప్పుడు వెళ్ళి శాస్త్ర ప్రకారంగా తన ఆవును దానం చెయ్యాలాని ఆలోచిస్తోంది రాబోయే ఆ ఉత్తరం కోసమే చూడసాగేడు అవధాన్లు

* * *

ఆ రోజు ఉదయాన్నే యధావిధిగా అన్ని పనులూ పూర్తిచేసుకుని పంచాంగం చేతో పట్టుకుని వీధి అరుగు మీద కూర్చునేసరికి సుమారుగా పదకొండు కావచ్చింది అవధాన్లుకు. భ్రమరాంబ లోపల ఏదో పనిలో వుంది.

దీక్షగా పంచాంగం చూస్తున్న వాడల్లా ఎదురుగావచ్చి నించున్న మనిషి వేపు చూసి తొట్రుపడ్డాడు

"దండాలండీ పంతులుగోరూ...దండాలు" వినయంగా వంగి దండం పెట్టేడు బారికాడు వెంకన్న

ప్రొద్దున్నే ఈ ఫండాలవు వెధవ బోణి తగిలిందేవిటాని ఆశ్చర్యపోయాడు అవధాన్లు

"ఈడేటి పొద్దున్నె ఎలిపొచ్చేవాడను అనుకుంతన్నారా బాబూ ? ?" మనసులో మాటను పసిగట్టినట్లు అంటున్న వాడికేసి తొట్రుబాటుగా చూస్తూ —

'అబ్బే అదేంలేదురా వెంకా !! ఏదో పంచాంగం పనో, లేక జాతకం పనో, ఉండి ఉంటుందని భావిస్తున్నానే ! "

సర్దుకుని నవ్వుతూ అన్నాడు అవధాన్లు

"ఇయ్యి మీకిచ్చేమని మనూరి మునసబు నాయుడుగోరు సెప్పినారండీ !" బొడ్లోంచి రూపాయల కట్టొకటి తీసి అన్నాడు వెంకన్న ఆశ్చర్యం వేసింది అవధాన్లుకు

"మునసబు గారిమ్మన్నారా ? ఏవిట్రా విశేషం ?"

ఆ డబ్బును చూస్తూ అన్నాడు అవధాన్లు

"ఇసేసమేటుంటదండి పంతులుగోరూ? అక్కడికీ నట్టవే వచ్చినాదండి. అయినా అన్నకాడికి మీ ముకం సూసి తెచ్చినానండి . నాను మాటంటే అంతా కరక్టండి "

చేతులు కట్టుకుంటూ అన్నాడు వెంకన్న

అవధాన్లుకు అసలు మునసబు నాయుడు డబ్బెందుకు పంపేడో వీడికి నష్టం రావడమేమిటో బోధపడలేదు

"ఒరే ! మునసబు గారికేమైనా నాతో పని బడిందా ? ఎప్పుడు రమ్మన్నారు ? ఏవిటి వాళ్ళిట్లో విషయం ?"

ప్రశ్నమీద ప్రశ్న గుప్పించి అడుగుతున్న



ఇటీవల 'సాహితీ మిత్రులు' ఏర్పాటు చేసిన 'నా ఉదయం' కావ్యావిష్కరణ సభలో కవి శ్రీ నాగభైరవని ఇంటర్‌మీడియేట్ బోర్డు కార్యదర్శి శ్రీ కె పెంచలయ్య సన్మానిస్తున్న దృశ్యం ఆవిష్కర్త కళా ప్రపూర్ణ శ్రీ తుమ్మలవారినికూడా చిత్రంలో చూడవచ్చు

# The stove that not only glows but glitters




STAINLESS STEEL

# chetak

## Gas Stove

IS : 4246




**Highlights :**

* Perfectly Engineered.
* Swiss Technology Control Valve for Prevention of Gas leakage.
* Plated Burner Tops - Rust free.
* Better fuel efficiency
* Economically Priced.

**DISTRIBUTORS FOR ANDHRA PRADESH**

MADICON INDO-INTERNATIONAL
1-10-197/4, First Floor, Ashok Nagar X Roads,
Hyderabad - 500 020. A.P INDIA
Phone. 61286, 64757 Grams MADICON

**PRODUCT OF**
**JAINCO INDUSTRY**
NEW DELHI

MAYURA

ప్రసిద్ధి చెందిన హిందుస్తాన్ పెట్రోలియం, భారత పెట్రోలియం
మరియు ఇండియన్ గ్యాస్ డీలర్ల వద్ద కూడ లభించును.

## దానం

అవధాన్లు వేపు వె(్రిముఖం వేసి చూసె వెంకన్న.

"అసలు యిసయం మీకు తెలిసకే బారికోణ్ణి నన్నడుగుతున్నారేటి బాబయ్యా ? మరీ ఆశ్చర్యంగా అన్నాడు వాడు.

"ఒరే... ఈ పంచాంగం తోడు. నా నిజంగా ఏమీ తెలీదు. విషయం ఏమిటో ఒక్క ముక్కలో చెప్పేద్దూ, బాబ్బాబూ !!!" దీనం( బతిమాలుతున్నట్లుగా అడిగేడు అవధాన్లు

వాడికాశ్చర్యం, అయోమయం రెండు కలిగేయి

"రెం(డోజుల కితవే మీ యావు మ( మునసబు నాయుడుగోరి పొలంలోపడి ఆ( పెసరసేను పూరాగా మేసేసి, తొక్కేసినాదంట మునసేబుగోరు అగ్గయిపోయారాయేల నిన్న రా(త్రి అది ఈదిలో ఎక్కడో తిరుగుతా కనిపిత్తే అట్టుకుని నాక్కాబురు అంపినారండి పాతిక రూపాయలకి బేరం అయినాదండి .. ఇయ్యాల తెల్లారబోతలకే గమేలాలో ఏసేసినావండి ఇరవై వొచ్చిందండి మొత్తం అయిదూసట్టమే నమకోండి అయినా మనూరు మునసబుగోరు గదాని మాట్లాడకుండ పాతిక రూపాయలూ యిచ్చేయబోయానండి అరు ఆ ఎమ్మటే "ఒరే ! ఎదవా ! అది పరాయిసొమ్ము, నాకిత్తానంటావేటి ? ఎల్లి ఆ పంచాంగం పంతులుగోరి కిచ్చేసిరా !!" అన్నారండి అంతేనండి సొమ్మట్టుకుని మీ కిచ్చేదావని ఒచ్చినానండి .. తీసుకుండి బాబయ్యా !!"

వెంకన్న మాటలతో అవధాన్లు గుండె లొక్కసారిగా (బద్దలైపోయాయి పట్టరాని ఆవేశంతో పిడికిళ్ళు బిగుసుకున్నాయి ఏదో కోపం — ద్వేషం, పగ — ఒళ్ళంతా వ్యాపించింది కాని, అంతలోనే తన స్థితి గుర్తుకొచ్చింది కోపం స్థానే దుఃఖం కట్టలు తెంచుకుంది. ఉరకలు పెడుతూ పొంగుతున్న మహాసము(ద్రంలా ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు

"ఒరే !! వెంకా ! ఆ సొమ్ము నాకెందుకురా ? నాకు వద్దు అది అతనికే ఇచ్చెయ్యి ఊరివాళ్ళ రక్తమాంసాలు పిండి సంపాదిస్తున్నది చాలక, ఊళ్ళోని నోరులేని పశువుల రక్తమాంసాలూ కావలసివచ్చాయి ఆయనకి అవి పిండుకుని తినేస్తున్నాడు

ఒరే ! వెంకా !! మునసబుగారి ఆకలికి నా ఆవు చాలకపోతే, నేనూ సిద్ధంగా ఉన్నానని చెప్పరా ! నాలాటి బడుగువాని రక్తమాంసాలు కూడా తినేసి మరికొన్ని సంవత్సరాలపాటు సుఖంగా (బతకమని చెప్పు చెప్పరా వెళ్ళి చెప్పు !!"

అవధాన్లు గొంతు యిక పెగల్లేదు. మనిషి దుఃఖంతో విరుచుకుపడిపోయాడు. ★

## స్కాలర్‌షిప్‌లు స్వాహా!

వెనుకబడిన జాతుల విద్యార్థులకు ఇస్తామన్న స్కాలర్‌షిప్ డబ్బులు వారిచేతికి అందనే అందటం లేదని ఆంధ్ర రాష్ట్ర వ్యాప్తంగా యీ కథ వుందని ఆ జాతి విద్యార్థి సంఘ అధ్యక్షుడు కృష్ణయ్య అన్నారట. డిగ్రీ, జూనియర్ కాలేజీలలో మొత్తం లక్ష యిరవై వేలమంది, విశ్వ విద్యాలయాలలో 25 వేలమంది, స్కూళ్లలో ఎంతలేదన్నా 8 లక్షల మంది యీ స్కాలర్ షిప్‌లు రానివారున్నారని ఆయనన్నారట




## అత్తను చంపిన అల్లుడు!

మద్రాసుకు చెందిన వెంకటరమణ అనే అతనికి, శివకామి అనే ఆమెకు 1982లో పెళ్లయిందట. మరుసటేడు కూతురు కూడా పుట్టిందట. పెళ్ళయి రెండేళ్లయ్యాక వెంకట్రమణకు తన భార్య తనింటినుంచి కట్నంపేర కొంత డబ్బుతెస్తే ఏమని ఆలోచన వొచ్చి దాన్ని అమలు జరిపి, తెస్తే డబ్బుతే, లేపోతేఫో అని ఆమెను గెంటేశాడట. వెస్ట్ మాంబళంలో వుంటున్న తన తల్లి చెల్లెమ్మ యింటికి వెళిపోయిందటా శివకామి తన కూతురు అర్చనతో. ఆర్నెలలు గతించినా భార్య రాపోయేసరి కతను ఆమెపుట్టింటికి వెళ్ళి కట్నమూ వద్దు, కాకరకాయావద్దు. నువ్వొస్తేచాలు అని బతిమాలాడట. దానికామె వొప్పక, నీవద్ద పడ్డ బాధలు చాలు అందట. వెనుతిరిగిన వెంకట్రమణ మళ్ళీ తన భార్య యింట్లో లేనపుడు వెళ్లి, కూతుర్ని తెచ్చేస్తే పెళ్ళాం రాకేం చేస్తుందని కూతుర్ని భుజాన్నేసుకున్నాట్ట. కూతురు ఏడుపుతో యింట్లో వంట చేస్తున్న చెల్లెమ్మ బయటికి వచ్చి, అల్లుణ్ణి అడ్డుకుందట. కోపం రెచ్చిపోయిన వెంకట్రమణ ఆమెను కత్తిపీటతో నరికి చంపేశాడట.

# షాల్కుని షేరి

## ముప్పుతెచ్చిన మూఢనమ్మకం!

తమిళనాడు పెరుందొరై అనే వూరుకు చెందిన నిర్మలాదేవికి, బాలసుబ్రహ్మణ్యం అనే అతనికి వివాహమైన పదోరోజు వారిద్దరూ స్కూటరు మీద పోతూండగా జరిగిన విపత్తులో నిర్మలాదేవి కుంటిదైపోయిందట. తన కొడుకు బ్రతుకలా అయ్యిందేమో అని ఆతని తల్లి సుబ్బలక్ష్మి అతని జాతకం వో జ్యోతిష్కునికి చూపితే, ఆ నికృష్టుడు "నీ కోడలు మూలంగా నీ కొడుక్కి యింకా కష్టాలున్నాయి. ఆమె జాతకం మీ వాడి జాతకంతో కలవలేదు" అన్నాడట. తన కొడుకు భవిష్యత్తు బాగుండాలన్న వాంఛతో ఆ కన్నతల్లి పరాయమ్మ కన్నపిల్ల నిర్మలాదేవిని పచ్చడి బండతో బాది చంపి, ఆనక నూతిలో పారేసి, తాను పరారీ అయ్యి, ఆనక దొరికి తన తప్పు పరిశుభ్రంగా వొప్పుకుని, దానికి తన పుత్రానురాగమే కారణమని నిర్వచించిందట.

## భర్త నిరాదరణ-భార్య ఆత్మహత్య!

మెట్టూరుకు చెందిన నటరాజన్ మస్తుగా తాగివచ్చి భార్య 30 ఏళ్ళ పార్వతిని సాపుగా చావబాదేవాడట. ఇదిగాక ఓ వుంపుడు కత్తెను కూడా పెట్టుకుని, సదా అక్కడే కాలక్షేపన్నిస్తూ యింటిముఖం నెలకో రెండు మూడుసార్లు చూసేవాడట. ఈ జీవితాన్ని భరించలేక పార్వతి విషం త్రాగి ఆత్మహత్య చేసుకున్నదట.

## కలిసిరాని కల్యాణం!

ఇంటలీకి చెందిన ఆంటోనియో ఫ్రాంచి అనే వో యువకునికి చిలిపి ఆటలు మాని సుఖంగా పెళ్ళి చేసుకోబుద్ధి పుట్టి, బుద్ధిమంతుడై, పూర్వాశ్రమంలోని తన వైభవం, అనుభవం 1282 కాపీలుగా రాసి ఒక్కోదాన్ని వొక్కో సీసాలో పెట్టి ఆ సీసాలను మెడిటరేనియన్ సముద్రంలోకి గిరాటువేశాడట. ఒక సీసా దొరికిన వో సుందరాంగి విషయం చదివి, హా నా మనో నాధా అంటూ నచ్చి ఐ లవ్ యు అని యిటలీ భాషలో అందట. ఆతను విసిరిన, మిగిలిన 1281 సీసాలూ చేపలు పట్టువారి వలలను భీభత్సం చేసినందువల్ల ఆ విషయంలో కలుగజేసుకుని ఆ ఫ్రాంచీని అరెస్టు చేసి, ఫస్ట్ జెయిల్, మేరేజ్ నెక్స్ట్ అన్నారట.

## లండన్ నగరంలో కేశాల పోటీలు!

లండన్ నగరంలో పొడవాటి జుట్టుకు పోటీలుపెట్టి, కత్తిరింపు జుట్టు స్త్రీలు కూడా ఆ పనుల నుంచి విరమించేలా చేస్తున్నారట. ఈ పోటీలో లూసీ సజార్ అనే వనిత తన అయిదడుగుల మూడంగుళాల పొడవుగల పట్టు కుచ్చులవంటి జుట్టును ప్రదర్శించి ప్రథమ బహూమతి సంపాదించిందట. టీనేజి పిల్లల పోటీలో పదమూడేళ్ళమ్మాయి సారా బెన్నిక్ బహూమతి పొందిందట. మొదటి బహుమతి పదివేల రూపాయలట మన లెక్కలో. ఆహ్ జుట్టు పెంచినందుకింత మొత్తమా!




## అమెరికాలో మంజుల భరతనాట్యం స్కూలు!

ఒకనాటి నటి మంజుల యిటీవల ఒకటిన్నర సంవత్సరాలుగా మద్రాసులోని కన్నెమెరా హోటల్ అనే వో పెద్ద హోటలులో "బ్యూటీ పార్లరు" నడుపుతూ, ఇపుడు అమెరికా లాస్ ఏంజలిస్‌లో భరతనాట్య స్కూలుపెట్టి నడపడానికి తన ఇద్దరు పిల్లలతో, నటుడైన భర్త విజయకుమార్‌తో అమెరికా వెళ్ళారట. అక్కడావిడ భారీఎత్తున నాట్య స్కూలు ఆరంభిస్తారట. శుభమస్తు!

## క్రీస్తు పేర వీలునామా!

ఏసు ప్రభువు తిరిగి భువికి క్రైస్తవుల నమ్మక ప్రకారం పుట్టివస్తే, వచ్చి తానే ఏసునని నిరూపించుకుంటే తన ఎస్టేటు, నాలుగు లక్షల నగదూ ఆ ఏసుకు చెందుతుందని అమెరికా ఫోర్డ్స్‌మవుత్‌కు చెందిన 81 ఏళ్ళ ఎర్నెస్ట్ టిక్విట్ వో వీలునామా రాసి, అది కోర్టుకు వప్పగించాడట. ★

# శ్రీమతి కర్మయోగి

## డా॥ కె.వి. కృష్ణకుమారి

(గత సంచిక తరువాయి)

వంటరితనం మరచిపోయేలా పూర్తిగా ఆధ్యాత్మిక దృక్పథానికి అలవాటుపడ్డ కృష్ణప్రియ కాలగమనాన్నే మర్చిపోయింది.

ఐతే జరిగిపోయిన కాలాన్ని గుర్తుకుతెస్తూ జరగబోయే కాలంమీద ఆశలు పెంచే మార్పులు మానవ జీవితానికి సహజంగా వస్తూనే వుంటాయి.

భవిష్యత్ పైన ఆశలేని ప్రాణి అరుదు.

ఆ ఆశను కల్పించే జీవాలు భగవంతుని సృష్టిలో నూతన ప్రక్రియలకు నమూనాలు.

సత్యవతి పుట్టటంతో ఆ ఇంటికి నూతన చైతన్యం వచ్చింది.

ఎప్పుడో అత్తగారు అన్నారు— 'ఆడపిల పుడితే ఆ సతీ సత్యవతి పేరు పెట్టకుండా మని'—ఆ మాట మర్చిపోలేదు కృష్ణప్రియ.

తులసివనంలో చక్కని తులసి మొక్క తల ఎత్తింది.

నవనవలాడుతూ అందంగా పెరుగుతూ, తన ఉనికికి అర్ధాన్నీ ఆపాదించుకుంది.

ఏడాదిదాటి నాలుగో నెలరాగానే—చిటుకూ చిటుకూ పరుగులు తీస్తూ—తండ్రి ప్రక్కన కూర్చుని రెండు చేతులూ జోడించేది.

ఆ పసిమొగ్గను చూడగానే కృష్ణారావులో అనిర్వచనీయమైన స్పందన మొదలయేది.

''ఊ.. ఊ(...జేజి—''

తండ్రి రెండు చేతులూ కలిపి దణ్ణం పెట్టించేది.

''ప్రియా. ఇది కడుపులో వున్నప్పుడు ఏం చదివావు?—''

**జరిగిన కథ — 17 :** తులశమ్మగారు గత జీవితాన్ని శ్రీహరిగారితో చెప్పి హృదయభారాన్ని తగ్గించుకొంటారు. కృష్ణారావు తల్లి ఆవేదనని చూసి చలిస్తాడు. తల్లి కోరిక ప్రకారం పెళ్లి చేసుకొనుటకు అంగీకరిస్తాడు కృష్ణ. కృష్ణ పెళ్లి పద్మినితో నిశ్చయమవుతుంది. కృష్ణారావు, పద్మినిల వివాహం జరిగిన కొద్దిగంటలకే పద్మిని తల్లి యశోదమ్మ మరణిస్తుంది. యశోదమ్మ కర్మకాండ అనంతరం పద్మినితో కూడ కృష్ణప్రియను తమ దగ్గరకే పంపమని రామచంద్ర రావుకి చెప్పి తులశమ్మ కృష్ణారావులో కలిసి తమ ఊరు వెళ్లిపోతారు. పద్మిని, కృష్ణప్రియల రాకతో తులశమ్మగారి ఇంట్లో చైతన్యం వస్తుంది. కృష్ణారావు చర్చలకు అందరూ ఆకర్షితు లవుతారు. శోభనం నాటి రాత్రి మూర్ఛవచ్చి పడిపోయిన పద్మినికి సేవలు చేసి అనునయిస్తాడు కృష్ణ. గుండె నొప్పితో బాధపడుతున్న పద్మినిని మనస్సుకు ఉల్లాసం కలిగించే మాటలతో వూరడిస్తాడు కృష్ణ. మనువడి కోసం తాపత్రయ పడే తులశమ్మను చూసి పద్మిని కృంగి పోతుంది. కృష్ణారావుని గోష్టిలో అల్లరిపాలు చేయాలనుకున్న నారాయణ ప్లాను తలక్రిందు లవుతుంది తులశమ్మకు మనువడిని ఎత్తుకోవాలనే కోరిక రోజు రోజుకు బలపడుతోంది. కాని ఆమెకు కృష్ణ వైఖరి ఆందోళన కలిగిస్తుంది. పద్మిని ఆరోగ్యం ఇంకొంచం క్షీణించింది. పద్మిని మంటల్లోపడి మరణిస్తుంది. పద్మిని మరణం ఆ ఇంటి వాతావరణంలో పూర్తి మార్పు తెచ్చింది. లక్ష్మి బాధ్యతః విషయం గుర్తుచేయగా తన బాధ్యతల్ని తను నెరవేరుస్తానని వదినకు మాట ఇస్తాడు కృష్ణ. తల్లి కోరికపై కృష్ణప్రియను వివాహం చేసుకొనేందుకు అంగీకరిస్తాడు కృష్ణ. కృష్ణ, కృష్ణప్రియల వివాహం జరిగిపోతుంది. కృష్ణప్రియ గర్భవతి అవుతుంది. గోదావరి పుష్కరాలకని వెళ్లిన సరోజినమ్మ, తులశమ్మ, లక్ష్మిల శవాలు తిరిగి వస్తాయి. తల్లిపోయిన నారాయణని వూరడిస్తాడు కృష్ణ.

''మీరు చెప్తుంటే వినేదాన్నిగా శ్రీ కృష్ణ తత్వాన్ని—''

''అందుకే భక్తురాలు పుట్టింది.''

తనచేత దణ్ణాలు పెట్టిస్తున్న కూతుర్ని ఆపేక్షగా చూసుకునేవాడు కృష్ణారావు.

ఆ వాతావరణంలో పెంపకంలో క్రమ శిక్షణలో, సత్యవతి మనసు వయసునుమించి ఎదిగింది.

''సత్యా, పసిదానివికదా. అందర్లా టిఫిన్లు కావాలని అడగవేం?—చేసిపెట్టనా పోనీ—''

తల్లిని చూసి నవ్వేది సత్యవతి.

''ఎందుకమ్మా – రెండుపూట్లా అన్నం తింటున్నాంగా.''

''అన్నం తింటే మటుకు ? ఫలహార మక్కర్లేదా ? ''

''ఫలహారము ఆకలి తీరుస్తుందా ? ఆకలి కోసం అన్నం చాలదూ ? ''

తీర్పుకోసం తండ్రి దగ్గరకు వెళ్లేది సత్యవతి.

''నాన్నగారూ— మీరు చెప్పారుగా—జిహ్వను జయించటం సులభం కాదని— ఎందుకు కాదో—ప్రయత్నించ కూడదా ? ''

తన నీడలా పెరుగుతున్న సత్యవతి — తన కన్నా భగవంతునికి ఆత్మీయురాలౌతుందని ముందరే గ్రహించాడు కృష్ణారావు. అందుకే భగవంతుని వస్తువులా అపురూపంగా చూసు కుంటున్నాడు.

''నాన్నగారు చెప్పరెందుకు ? ''

''ప్రయత్నించాలమ్మా తప్పకుండా ప్రయత్నించాలి. అన్నిటికన్నా అతి కష్టమైంది జిహ్వను జయించటం. గాలినీ—నీటినీ తీసుకునేది కేవలం మన దేహధారణ కోసమే. అలాగే భగవంతుడిచ్చిన ఈ శరీరాన్ని బ్రతికించటం కోసం సాత్వికాహారం చాలమ్మా. మితంగా, పరిమితంగా చాలు. అవునూ చిన్నపిల్లవి అందర్లా తినాలని కాకుండా తినకూడదనే నియమాన్ని పెంచుకుంటున్నావు.''

''చిన్నైతేనేం నాన్నగారూ మంచిపనేగా. చిన్నప్పుడే చిన్న చిన్నవి తట్టుకుంటే పెద్దయాక మీలా పెద్ద పెద్ద వన్నీ తట్టుకోవచ్చు.''

''నాన్నగారూ— తననే నమ్ముకుంటే భగవంతుడు మనల్ని కాపాడతాడా ? ''

కృష్ణారావు పెదాలు సన్నగా విచ్చుకునేవి.

''ఆ( భార్యనూ, ఇంటినీ సర్వస్వాన్నీ వదిలి భగవంతునే నమ్ముకున్న వాడిని భగవంతుడెప్పుడూ విడిచిపెట్టడమ్మా ''

''మరి తాతగారూ, పెదనాన్నగారూ అలా చేశారు...మీరు మమ్మల్ని వదలి పెట్టలేదుగా— మరి భగవంతుడు మిమ్మల్ని వదిలిపెట్టేస్తాడా?''

అమాయకంగా అడుగుతున్న సత్యవతిని దగ్గరకు తీసుకున్నాడు కృష్ణారావు.

''... నాన్నగారూ బాధ పడుతున్నారా —



మీరున్నది మాదగ్గరైనా మీలో వున్నది ఆ దేవుడేగా—ఆయనకి నేను దణ్ణం పెట్టుకుంటాను లెండి—నాన్నగార్ని వదలద్దని.''

''తల్లీ—''

కృష్ణారావు కళ్లు చెమ్మగిల్లాయి. మనసు ఆర్ద్రమయేది.

తల్లి దగ్గర బుద్ధిగా కూర్చుని చెప్పించుకునేది సత్యవతి.

''మళ్లా చెప్పమ్మా''

''ఆ శ్రీకృష్ణుడే చెప్పాడమ్మా — మంచి భక్తుడు కావాలంటే సంసారాన్ని విడిచిపెట్టే అవసరం లేదని. నిజమైన భక్తుడు— కోరికలకు మనసులో స్థానమివ్వడు. సంసారాన్ని ధర్మం కోసం చేస్తాడు కానీ — మోహంతో కాదు. కోరికలు తీర్చుకోవటం కోసం కాదు. ఆయనకి శత్రువులూ, మిత్రులూ అందరూ ఒక్కటే — మానావమానాల యందు సమదృష్టితో గృహ ధర్మాలను ఆచరించాలేగానీ విడువకూడదు. అర్జునుడ్ని ఎందుకు యుద్ధం చెయ్యమన్నాడు ? — కేవలం ధర్మాన్ని రక్షించటానికే అంతేగానీ శత్రువుల్ని చంపటానికా ? కాదు. కాదుకదా.''

''అవునవును.''

సత్యవతి ఉత్సాహం పదింతలయేది. తల్లి చెప్పేదంతా అర్థం కాకపోయినా అర్థం చేసుకోటానికి ప్రయత్నించేది.

''ఐతే నాన్నగారు మంచి భక్తులమ్మా. నువ్వు చెప్పిన లక్షణాలన్నీ ఆయనలో వున్నాయిగా మరీ.''

తండ్రి మీదున్న ఆరాధనను మరింత పటిష్టం చేసుకునేది సత్యవతి.

''నీకు నాన్నగారంటే ఎందుకు సత్యా అంత ప్రేమ ? ''

తల్లికి సమాధానంగా నవ్వేది సత్యవతి.

''ఆయన అందర్లాంటి వారు కాదమ్మా.''

''అవును. ఆయనా కాదూ— నువ్వూ కాదూ— లేకపోతే నీ వయసేమిటే... ఈ ఆలోచన్లు ఈ ప్రశ్నలూ ఏమిటి?''

తన్లోతనే గొణుక్కునేది కృష్ణప్రియ.

''నాన్నగారూ— అందరూ చాలా కాలం పూజలు చేస్తూనే గడుపుతారుకదా— మడి బట్టలు కట్టుకుని మంత్రాలు చదువుకుంటూ వుంటారు కదా— మరి మీరు కూర్చున్నచోటే వుండి దణ్ణంపెట్టుకుంటూ వుంటారెందుకూ? మన కృష్ణ మందిరంలో పూజలు చెయ్యొచ్చు కదా...''

కృష్ణారావుకి అర్థమౌతోంది. సత్య రోజు రోజుకీ ఎదుగుతోంది. మనసు వయసునుమించిన పరిపక్వతను ఎన్నోరెట్లు సాధిస్తోంది. ప్రతి విషయాన్నీ విమర్శనాత్మకంగా ఆలోచిస్తోంది. తన ఆలోచనలకు తగిన సమాధానాన్నే తననుంచి ఆశిస్తోంది. నిజానికి తన వయసుకు వచ్చే ఆలోచనలా ఇవి ?

''చేసేవాడినమ్మా- నేనూ కృష్ణ మందిరంలో వుండి పూజలు చేసిన వాడినే— అయితే పోనుపోను విగ్రహారాధన కంతగా సుముఖుడ్ని కాలేకపోయాను. మనసు నిశ్చలంగా వుండేదాకా— ఆ పరమాత్మమీద భక్తి కుదిరే దాకా— విగ్రహపూజ అవసరమే. అయితే క్రమ క్రమంగా— ఆ భగవంతుని రూపము మనోగోచరమై— ఆ దివ్యాకృతి హృదయ పీఠాన్ని అలంకరించాక— మనసులోనే సకల పూజలనూ అందుకుంటున్న తరువాత— సర్వేత్రా వ్యాపించి యున్న భగవంతుడు కేవలం ఈ బొమ్మల్లోనే ఉన్నాడనుకుని పూజించటం— అంతగా అవుసరం అనిపించలేదు (రుచించలేదు). మనస్సులో ఆ దైవ సాక్షాత్కారమైనాక మనసు స్థిరవౌతుంది. శివకేశవుల అభేదమను జ్ఞానం కలుగుతుంది— శివకేశవులు ఒకటే గానీ వేరుకాదన్న భావం ఈ మానసిక పూజలోనే బలబడుతోందమ్మా. సర్వ దేవతా సమానత్వము నిశ్చలమైన మనసులో నిస్సందేహంగా పెరుగుతోందమ్మా—''

తన సహజ ధోరణిలో మాట్లాడుకుంటూ వెడుతూన్న కృష్ణారావు ఆగిపోయాడు.

సత్యవతి తీవ్రంగా ఆలోచిస్తోంది.

"అర్థమయిందా సత్యా—?"

"కొంత అర్థమవలేదు... నీలాంటివాళ్ళు పూజలు చెయ్యక్కర్లేదు. మరి నాలాంటివాళ్ళు అమ్మలాంటివాళ్ళూ చెయ్యాలికదా— నువ్వు చెయ్యలేదని మేమూ చెయ్యమనుకో—అప్పుడు?"

సత్యవతి అమాయకంగా అడిగినా— కృష్ణారావుకి ఛెళ్ళున కొట్టినట్లైంది. శ్రీకృష్ణుడు చిన్న సత్యలోంచి హెచ్చరిస్తున్నాడా ?

లేక సత్య ద్వారా తనని పరీక్షిస్తున్నాడా ?

తెల్సినవారు తొక్కినమార్గాన్నే ఇతరులూ అనుసరిస్తారు. సర్వం తెల్సు ననుకున్నవారి మార్గాన్నే నడవటానికి ప్రయత్నిస్తారు. లేకపోతే లోకాన్ని తప్పుదారిన పట్టించిన దోషం తప్పక తగులుతుంది. ఆ సర్వేశ్వరుడికి ఏ కోరిక తీరాలని ? ఏ ప్రతిఫలాన్నాసించి— సామాన్యుడిలా మానవుల్లో కల్సి కర్మ చేశాడు ? తనకోసమా— తన ననుసరించే ఇతరులకోసం కదూ—

"నాన్నగారూ— ఆలోచిస్తున్నారా? ఊరికే అన్నాను. మీకు మనసులో దేముదున్నాడు. మాకు బొమ్మల్లోకానీ కనపడడు... నాన్నగారూ మీ అంతదాన్ని ఎప్పుడౌతాను ?..."

సత్యవతిని గాఢంగా హృదయానికి హత్తుకున్నారు కృష్ణారావు.

"నా అంత దానివి కాదమ్మా... నాకన్నా ఎంతో పెద్దదానివౌతావు. నాకన్నా ముందే పెద్దదానివౌతావు..."

సత్యవతి కళ్ళల్లో నీళ్ళు నిండాయి.

"ఏమిటండీ ఇది— పసిపిల్ల— ఏదో తెలిసీ తెలియకా పెద్ద మాటలు చెపుతుంటే— మీరు ఏకంగా పెద్దదాన్నే చేస్తున్నారు."

సత్యవతి వెళ్ళాక చిన్నగా అంది కృష్ణప్రియ.

"నేనలా అనటం లేదు. దేముడే దాన్నలా పుట్టించాడు. నాకు పన్నెండేళ్ళ వయసులో నేనలా వున్నానా ?— లేను—"

"నాన్నగారూ — ఎవరొస్తున్నారో చూడండీ."

చెయ్యి పట్టుకుని పెద్ద మనిషిని తీసుకు వస్తుంటే ఆశ్చర్యంగా చూశాడు కృష్ణారావు.

"కృష్ణా— అలా చూస్తావేంరా—నేనూ?"

ఆత్రంగా వచ్చిన కృష్ణప్రియ మొహం వికసించింది.

"రండి మావయ్యగారూ — ఇదేనా రావటం..."

ఎంతో కాలం తరువాత హాయిగా నవ్వినట్టు నవ్వాడు శ్రీహరిగారు.

"అవునమ్మా ఇదే — కృష్ణనీ — నిన్నూ చూడాలనిపించింది — అన్నిటికన్నా ముఖ్యం — ఈయన వరాన్ని చూడకుండా వుండలేక పోయాను."

సత్యని దగ్గరకు తీసుకున్నారాయన.

సత్య పుట్టాక రెండు మూడు సార్లు



# కర్మ యోగి

వచ్చారు. ఇదివరకన్నా ఇప్పుడు రావాలని మనసు లాగుతోంది. కారణం కృష్ణ తోటి సహవాసం కావచ్చు — సత్యతో పెంచుకున్న అనుబంధం కావచ్చు.

"చాలా మారిపోయారు బాబాయ్... చూడగానే గుర్తే పట్టలేదు —" సంజాయిషీగా అన్నాడు కృష్ణారావు.

"అవును కృష్ణా — వార్ధక్యం మీద పడలేదూ — అదీకాక ఇంటికి పెద్దరికం కొడుక్కే కట్టబెట్టాను. కోడలు — కృష్ణప్రియలాంటిది కాదు మరి."

తేలిగ్గా నవ్వటానికి ప్రయత్నించారాయన.

"చూడగానే నేను గుర్తుపట్టేశాను నాన్నా..."

"నిన్ను గుర్తుపట్టలేదు చిట్టీ — పోతన కూతురేమో అనుకున్నా"

"ఆ తెలివీ — ఆ మాటలూ అలాగే వున్నాయి."

భారంగా వెడుతున్న కృష్ణప్రియను చూసి శ్రీహరిగారి కను బొమ్మలు ముళ్ళు పడ్డాయి.

"తాతయ్యా — మీరు కొన్నాళ్ళిక్కడే వుండాలి —"

సమాధానాన్నికూడా ఆశించకుండా పెద్ద పని వున్నట్టు వెళ్ళిపోయింది సత్య.

"కృష్ణా — ప్రశాంతంగా సాగుతోందా?" అనుమానం లేకపోయినా—అలవాటుగా అడిగారు.

"ఆఁ—సత్యే అనుమానాలుసృష్టిస్తోంది ?"

"ఎవరికి ?"

"నాకుకాదు బాబాయ్...సత్య అందర్లాంటి ఆడపిల్లా కాదేమోనని ప్రియ భయం. ఈడుకు మించిన తెలివితేటలూ — అంచనాలు దాటి పోయిన దైవభక్తీ — ఒక్కొక్కప్పుడు నాకే ఆశ్చర్యమేస్తుంది బాబాయ్. పూర్వజన్మలో ఏ భక్తురాలో — కర్మవశాన ఇక్కడ పుట్టినట్టుంది.

## లోకులు

తళ, తళ లాడే
టంబ్లర్లో
అంబలి తాగు—
పాయస మనుకుంటారు !
వెల, వెలబోయే
ఓల్డ్ పాట్లో
గోల్డ్ స్పాట్ తాగు
గంజినీళ్లంటారు !!

— చలప్

దానికి వాళ్ళ పెదనాన్న పోలికలొస్తాయేమోనని వాళ్ళ అమ్మ భయం."

ఎంతో తేలిగ్గా నవ్వుతూ అంటున్న కృష్ణారావుని వాత్సల్యంగా చూశారు శ్రీహరిగారు.

"రామకృష్ణయ్య పోలికలా ? — ఎందు కన్పిస్తుందలా ?"

"శ్రీకృష్ణుని బొమ్మని విడిచి పెట్టదు. 'కృష్ణా' అన్న పిలుపు వింటేనే తన్మయురాలవుతుంది. నాచేత కృష్ణతత్వాలూ — గీతా — కావాలని మరీ మరీ చెప్పించుకుంటుంది. అనుమానాలు తీర్చుకునేదాకా తల్లిని వేధిస్తుంది. బాబాయ్ — మొన్నేం జరిగిందో తెల్సా — ప్రియకు విసుగేసి — త్వరలో పెళ్ళిచేసి పంపేస్తానని బెదిరించిందిట — అప్పుడు సత్య ఏమందో తెల్సా ?"

"ఏమందేమిటి ?" కుతూహలంగా వంగారు శ్రీహరిగారు.

"ఈ మనుష్యుల్ని పెళ్ళి చేసుకునే మనిషి ననుకున్నావా ? — ఎప్పటికైనా ఆ జగన్నాధుడ్నే చేసుకుంటాను. పెళ్ళీ - సంసారం—చావులూ— ఏముందీ బ్రతుకులో. ఇంకెప్పుడూ — పెళ్ళి మాటెత్తద్దంది."

శ్రీహరిగారి కళ్ళు ఆశ్చర్యంతో వెడల్పయాయి.

"అలా అందా... ఇంత చిన్నపిల్లా...!!!"

"చిన్నపిల్లా... మీరే చూడండి బాబాయ్."

కృష్ణ కళ్ళల్లో మెరుస్తున్న తృప్తికి ఆశ్చర్యపోయారు శ్రీహరిగారు.

"నాన్నగారూ —"

ఏదో సంకోచంతో నిలబడిన సత్యవతిని చూసి మధురంగా నవ్వాడు కృష్ణారావు. ఆ లేతమనసులో ఎన్నో సందేహాలు మేఘాల్లా కమ్ముకుంటున్నాయి —

ఆ నిర్మలమైన కళ్ళల్లో ఏదో తెల్సుకోవాలన్న తపన స్పష్టంగా కన్పిస్తోంది.

"చెప్పమ్మా —"

"మరి... చిన్నికృష్ణుడూ—నోరు చూపించి బ్రహ్మండాలన్నీ చూపించాడు కదా — యశోదకు దేముడని తెలియలేదా ?... తెల్సి మామూలుగా ఎలా వుంది ? — అలా చూపించటంలో అర్థముందా ?"

కృష్ణారావు మనసారా నవ్వాడు.

సత్యవతి నూటికి నూరుపాళ్ళూ తన అడుగుజాడల్లోనే నడుస్తోంది. ఈ రోజుల్లో ఈ కాలంలో — ఈ వయస్సులో — రావల్సిన ఆలోచన్లు తనకి రావు. ఈ సందేహాలు తీర్చటం— తన కర్తవ్యం మాత్రమే కాదు. తనకెంతో సంతోషమైన విషయంకూడా —

"భాగవతం చదువుతుంటే... అనుమానమొచ్చింది నాన్నగారూ —"

ఎంతో వినయవిధేయతలున్న విద్యార్థినిలా నమ్రతతో తనముందు చేతులు కట్టుకుని కూర్చుంది సత్యవతి —

# క ర్మ యో గి

"నీకేమర్థమైందమ్మా —"

"నువ్వు వ్రాసిన కృష్ణతత్వం చదువు తుంటే — ఏదో అర్థమైనట్టే అన్పించింది — ఐనా నువ్వు చెప్తే ఇంకా బావుంటుంది —"

"అలా అని ఎవరన్నారమ్మా —"

"నా స్నేహితురాళ్ళందరూ అన్నారు — వాళ్ళకి రోజూ నేనీ సంగతులే చెపుతూ వుంటాను... చెప్పాలంటే — బాగా తెలియాలి కదూ..."

కృష్ణారావు కళ్ళల్లో వాత్సల్యం నిండింది.

"బాగా తెలియటానికి నీ వయసు సరిపో తుందా సత్యా —"

"మీరే చెప్పారుగా — చనిపోటానికి — వయసుతో పనిలేదని — ఉన్నంతలో అర్థమై నంతలో ఏదో చెప్పాలన్పిస్తోంది నాన్నగారూ—"

రెప్పల చాటున దాక్కున్న ఆ కళ్ళలోని భావాలను చదవగలిగే ప్రయత్నం చెయ్యలేదు కృష్ణారావు.

ఆ భగవంతుడు వెలిగించిన ఈ చిరుదివ్వె ప్రకాశవంతంగా వెలగాలి. అందుకు తగిన చమురును సమకూర్చాలి — అది భగవంతుని చేతుల్లో వుంది. ఈ వెలుగులో నడవగల అవకాశాన్ని కల్పించే శక్తి ఆ భగవంతునికే వుంది.

వయసు చిన్నదైనా — ఊహ పెద్దది.

గ్రహింపు ఎక్కువ. గ్రహించాలనే తలపూ సామాన్యమైంది కాదు.

"...చిన్నికృష్ణుడినోట్లో— సకల బ్రహ్మాం డాలూ కన్పించాయి ఆ దృశ్యం చూడగానే — యశోద భయంతో వొణికిపోయింది. ఒక విధమైన తన్మయావస్థలో — 'ఇదీ' అని నిర్ణయించలేని స్థితిలో కళ్ళు మూసుకుని — యోగసమాధిలో వున్నట్టుండిపోయింది — అది — కొద్దిక్షణాలే. ఈ బాలకృష్ణుడు తన కొడుకు కాదనీ—సాక్షాత్తూ ఆ జగన్నాధుడేననీ తెల్సు కున్నది చాలా తక్కువ కాలంలోనే. చాలా తక్కువ కాలం వరకే—ఆ తరువాత భగవంతుని మాయ కమ్మేసింది...ఎందుకని కదూ అడిగేది? లేకపోతే ఎలా? ఈ చిన్నవాడు దేముడేనన్న భావం ఆవిడలో వుండిపోతే—ఆవిడ తిరిగి మామూలు మనిషి కాగలదా? అందర్లా సామాన్యంగా వుండగలదా? అలా వుండలేనప్పుడు ముందుముందు శ్రీకృష్ణుడు తననుకున్న పన్లన్నీ ఎలా చెయ్యగలడు?...ఎలాగైనా చెయ్య గలడు — ఐనా — లోకుల దృష్టిలో తను సామాన్యుడిలా వుండాలికదా—బాలకృష్ణలీలలతో తన తత్వాన్ని బోధించాలికదా..."

శ్రద్ధగా వింటోంది సత్యవతి.

"తిరిగి మాయకమ్మేసే పక్షంలో సకల బ్రహ్మాండాలూ ఎందుకు చూపవల్సి వచ్చిందని కదూ నీ అనుమానం .."

బుద్ధిగా తలవూపింది సత్య.

"చూడూ — పుట్టిన వాళ్ళందరూ— పోయేదాక ఏమనుకుంటారు?—"

సందేహంగా చూసింది సత్య.

"చెప్పమ్మా—నువ్వు చెప్పగలవు. నాకు తెల్సు—"

"ఎప్పుడూ బ్రతికే వుంటామను కుంటారు."

"మరి నిజానికి..."

"అది తప్పు నాన్నగారూ—ఎవరెప్పుడు పోతారో ఎవరికీ తెలేదు..."

కృష్ణారావు మొహం వికసించింది.

"అది చెప్పటానికేనమ్మా — కృష్ణయ్య లోకాలన్నీ చూపించిందీ—"

"ఎలాగా?—"

"చెప్పనా? కృష్ణుడు నోరు తెరవగానే— ఊహాతీతమైన బ్రహ్మాండాలన్నీ కన్పించాయి. కొన్ని క్షణాలు నోరుముయ్యగానే—అవన్నీ క్షణంలో మాయమైపోయాయి. అంటే సర్వం క్షణాలలో నాశనమయేవీ—ఆయన ఆ౦నంలో వుండేవనీ తనలోనే సర్వమూ వుందనీ—సర్వేత్రా తనే వున్నాననీ- చెప్పటానికి ఈ శరీరాలే స్థిరమని నమ్ముకునే వాళ్ళకీ—కన్పించిన ఈ బ్రహ్మాండము లన్నీ అస్థిరములనే చెప్పాడు. తనూ—తన శరీరం తుచ్ఛసుఖాలూ— సత్యాలనుకుని— ఆ భగవంతుని మరచి విషయ వాంఛల్లో కొట్టుకులాడటం ఎంత పిచ్చితనమో తెల్సుకునేలా చేశాడు పిల్లలూ, స్నేహితులూ, ఇతర బంధాలూ-- ఏ మాత్రం సాయపడేవి కావు. కేవలం భగవంతుని ధ్యాన మొక్కటే జీవికి సహాయపడేది... శ్రీకృష్ణుని ప్రతి అడుగుకీ — ప్రతీ లీలకీ — ఏదో ఒక నిగూఢ ప్రయోజనమూ— అర్థం చేసుకోలేని మాయా వుంటుంది ..."

సత్యవతి ఆలోచనలో పడిపోయింది.

"సత్యా... ఏమిటంత ఆలోచన ?"

"పొద్దున నాతో చదువుకునే పిల్లలు పాట్లాటకి వచ్చారు నాన్నగారూ — ,తెలుగు మాస్టారు శ్రీకృష్ణలీలలు చెపుతున్నారు — ఆయన చెప్పటం అయాక — కొంతమంది పని గట్టుకుని నా దగ్గరకొచ్చారు — మాస్టారూ — లీలలు చెప్పారే ... అందులో గోపికలందరూ — కృష్ణుడ్ని అడ్డమైన తిట్లూ తిట్టి, తల్లికి అప్పజెప్పారు కదా— మరి ధేముడైతే— అంత తిడుతూంటే ఎలా వూరుకుంటాడు ? ఐనా అసహ్యంగా ఆ అల్లరి పన్లేమిటి ?— ఎప్పుడూ— అల్లరి చిల్లరిగా తిరిగేవాడు దేముడే మిటని ?— తెలుగు మాస్టారి చేతే చెప్పిద్దామని తీసుకువెడితే— మీకర్థంకావు పొమ్మన్నాడు ... వాళ్ళందరూ కృష్ణుడినలా అనటం బాధ న్పించింది.."

సత్యవతి కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరిగాయి.

క్షణం మౌనంగా వుండిపోయాడు కృష్ణారావు.

"... కృష్ణుడు చేసే ప్రతీ అల్లరి పనికీ అర్థముంటుందనీ— అది మిమ్మల్నడిగి చెప్తాననీ చెప్పి..."

"ఏడుస్తూ వచ్చేశావు— అవునా ?"

కన్నీళ్ళు లేత బుగ్గలమీద మెరుస్తూంటే— రోషంగా తలూపింది సత్యవతి.

"అవును మరి... అందరూ కృష్ణుడు మామూలు వాడనుకుంటారు... తెలీదు కదా. తెలీని వాళ్ళకి మనం చెప్పద్దా?— లేకపోతే — మన కృష్ణుడ్ని తిట్టుకోరా ?"

ఆ పాల బుగ్గలు తుడుస్తున్న కృష్ణారావు చెయ్యి కంపించింది.

అభం శుభం తెలియదనుకున్న ఈ పసిదాని వయసెక్కడ ? ఆ ఆలోచన్లెక్కడ ? వయసును మించిన ఈ పరిపక్వతా— భగవంతునితో పెంచు కున్న ఈ అనుబంధం— ఈ అనుభూతీ— ఎంత గాఢమైనవి ?

ఇంత గాఢమైనవా ?



భవిష్యత్తు— పర్యవసానం, భగవ తుని చేతులో వుంది.

నిర్వికారంగా చూశాడు కృష్ణారావు.

"మన కృష్ణుడా తల్లీ —"

"కాదా ? మన కృష్ణుడు కాబట్టే — ఎప్పుడూ మనింట్లో కన్పిస్తాడు. అందుకే — నువ్వెప్పుడూ— ఆయన గురించే వ్రాస్తావు ఆయన గురించే మాట్లాడుతావు. మన కృష్ణుడు కాబట్టే— ఎప్పుడూ నా కలలో కన్పిస్తూ వుంటాడు. నాతో ఆడుకుంటూ వుంటాడు... వాళ్ళకెంత చెప్పినా అర్థం కాదు నాన్నగారూ — ఎప్పుడూ తిండి గురించీ — బట్టల గురించే తప్ప—" సత్యవతి ఆవేశం నవ్వు తెప్పించింది.

"ఇంకొకళ్ళని అనే అధికారం మనకు లేదమ్మా..."

"మామూలుగా అనను... మరి దేవుడ్ని తిడుతుంటే అనాలిగా... తెల్సింది చెప్పాలిగా — అలా చెప్పాలని మీరే వ్రాశారుగా —"

మౌనంగా వుండిపోయాడు కృష్ణారావు.

"... చెప్పండి నాన్నా— నా స్నేహితుల్నందర్నీ కూర్చోపెట్టి చెప్పాలని వుంది —"

కృష్ణారావు ఆశ్చర్యాన్ని దాచుకున్నాడు. ఇది క్రొత్త కాదు. ఐనా ఎప్పటికప్పుడు క్రొత్తే.

చెప్తానమ్మా .. ముందర నువ్వు చెప్ప ... ఒకొక్కటె చెప్ప— ఆ బాలలీలలు "ఏమిటి?"—

అమృతం త్రాగుతున్నంత మహదానందంగా వుంది కృష్ణారావుకి.

అమృతాన్ని పంచియిస్తున్న తృప్తి ఆ కళ్ళల్లో మెరుస్తోంది.

"పిల్లలకి పాలు కావాలని గోపికలందరూ గొడవ చేస్తున్నా వినకుండా శ్రీకృష్ణుడు పొదుగుల దగ్గరకు దూడలను విడిచి గొడవ చేశేవాడా ?"

కృష్ణారావు హృదయంలో ఒక ఉద్వేత్తు తరంగం లేచింది.

గోపబాలుని లీలామహా కృత్యాలు అత్యద్భుతాలుగా కళ్ళముందు స్పష్టంగా కన్పించటం మొదలుపెట్టాయి.

"సత్యా— ప్రతీ జీవుడూ— కర్మ బద్ధుడు. కర్మానుసారము తన ఆహారము ముందు పుట్టిన తరువాతే జీవి పుడుతుంది. ఒక జీవిని సంరక్షించాలన్నా — కాపాడి పెంచి పెద్ద చెయ్యాలన్నా— ఆహారాన్ని సమకూర్చి పెట్టాలన్నా — అన్నిటికీ— కర్తలం తామే అనుకుంటారు తల్లిదండ్రులు. నిజానికి ఎవరికెవరు రక్షకులు ? ఎవర్ని ఎవరు రక్షించగలరు ? తల్లి పాలమీద బిడ్డకు ఎంత హక్కుందో — మరి దూడలకు మటుకు అటువంటి హక్కు వుండదా ? మీ స్వార్థంకోసం మరికొన్ని అమాయక ప్రాణులను అన్యాయం చెయ్యటం — కడుపు కొట్టటం ధర్మమా ? ప్రతీ జీవికీ ఆహారాన్ని సమకూర్చిపెట్టగల లోక నియంతనూ నిజమైన పాలకుడనూ నేను—ఈ విషయము గ్రహించలేని అజ్ఞానులకు సున్నితంగా అర్థమయేలా చేశాడు చిన్నికృష్ణుడు. తన సుఖంకోసం ఇతరుల్ని ఎప్పుడూ కష్టపెట్ట కూడదు. అంతకుమించిన అధర్మముండదు -- అది చెప్పటానికే ఈ లీల. అప్పటికి శ్రీకృష్ణుడూ పసివాడేకనుక — బోధలు చెయ్యలేదు అల్లరిలో మహా తత్వాన్ని ఇమిడ్చాడు..."

సత్యవతి కళ్ళు ఆశ్చర్యంతో - వెలుగుతో విశాలమయాయి.

"నాన్నగారూ —మరి కృష్ణుడు కడవల్లో వున్న పాలను ఏడుస్తున్న పిల్లలకుపోసి — నిండు పాలకుండను పగలగొట్టేశాడుట కదా — దాచుకోవల్సింది పగలగొట్టటం అజ్ఞానమంటున్నారు పిల్లలు... మాస్టారుకూడా అదొక అల్లరి పనన్నారు..."

భావగర్భితంగా నవ్వాడు కృష్ణారావు.

"నువ్వేమనుకుంటున్నావమ్మా..."

"చెప్పండి నాన్నా..."

కుతూహలంతో ముందుకు జరిగింది సత్యవతి.

"సత్యా — ఈ క్షణంలో మనం వున్నాం, మరో క్షణంలో వుండకపోవచ్చు. ఎవరెవరు ఎంతవరకు వుండాలో నిర్ణయించేది భగవంతుడు శాసించేదీ భగవంతుడే. అటువంటి పరిస్థితుల్లో అజ్ఞానంతో ఇవాళ కడుపులు నిండగా— రేపటి కోసం పాలను దాచుకోటం అందులోనూ అన్యాయంగా లేగదూడల నోళ్ళు కొట్టటం సహించలేకపోయాడు భగవంతుడు. అత్యాశ అనర్థదాయకం. అత్యాశకుకూడా దూరమైనప్పుడే తను

# కర్మయోగి

దగ్గరవాడనౌతానని – ఇతరులు గ్రహించటం కోసమే అలా చేసింది – అంతేగానీ ఇవి కేవలం బాలచేష్టలు కావుతల్లీ.''

సత్యవతి కళ్ళల్లో సంతృప్తి స్పష్టంగా కన్పిస్తోంది.

''మరి కృష్ణుడు అల్లరిగా పరాయివాళ్ళింట్లోకి పాలు త్రాగటానికి వెళ్ళినప్పుడు గోపికలు పాలకుండలు దాచినప్పుడు. కృష్ణుడికి కోపం ఎందుకు వచ్చింది ? గోప బాలకుల్ని ఎందుకు కాలితో తన్ని గొడవ చేసినట్టు ?''

సత్యవతి పసిదానిలా అన్పించటంలేదు.

పూర్వజన్మ జ్ఞానంగల యోగిని అడుగుతున్నట్టుగానూ– భగవంతుడాదేశించి మాట్లాడుతున్నట్టుగానో వుంది.

''చిట్టితల్లీ– సర్వజ్ఞుడైన భగవంతునికి ఎక్కడేది దాచారో తెలియకుండా వుంటుందా ? ఐనా ఆ సర్వేస్వరుడి కన్నుగప్పి దాయటం సాధ్యమౌతుందా ? 'ఈ గోపాలకులు నా సేవకులేగానీ– మీ పిల్లలా ? నా పాద స్పర్శతోనే వీరికి ముక్తి వస్తుందని మర్చిపోయారా?' ఈ భావమే ఈ కోపమే ఆ భగవంతుని ప్రవర్తనకు కారణం కాదా ?''

తృప్తి పడినట్టే కన్పించింది సత్యవతి.

అప్పటిదాకా శ్రద్ధగా వింటున్న కృష్ణప్రియ చిన్నగా నవ్వింది.

''ఆ పసిదానికి అంతంత పెద్ద మాటలేమర్థమౌతాయనీ–అది అడగటం మీరు చెప్పటం –రెండూ బాగానే వున్నాయి.''

ఎప్పటిలాగే చిరునవ్వునవ్వాడు కృష్ణారావు.

ఏదో ఆలోచిస్తున్నట్టున్న సత్యవతిని లాలనగా అడిగాడు.

''ఏమ్మా ఏదైనా అడగాలా ? ''

సత్యవతి చిన్నగా అంది.

''అవున్నాన్నగారూ మీరు సంస్కృతంలో వ్రాస్తున్నారు – కృష్ణతత్వాన్ని తెలుగులో వ్రాస్తే పిల్లలకీ చివరికి మా మేష్టర్లక్కూడా అర్ధమౌతుందిగా...''

వెడుతున్న కృష్ణ సత్యవతి వంక తెల్లబోయి చూశాడు.

''ఏమిటలా చూస్తున్నారు ? ''

కృష్ణప్రియని చూస్తూ తల పంకించాడు.

''సత్య పసిదైనా నాకు జ్ఞానం వచ్చేలా చెప్పింది. నిజమే. పదిమందికీ అర్థమై – ఉపయోగపడని నా రచనల ప్రయోజనమేముంది ?''

ఆరోజు నుంచే తెలుగులో వ్రాయటం మొదలైంది.

*   *   *

ఇప్పుడు కృష్ణారావుకి ఇరవైనాలుగ్గంటలు చాలటంలేదు. తన ఏకైక ధ్యేయంగా ఈ రచన పూర్తికావాలి. కొందరికైనా స్వాంతత చిక్కాలి. మనశ్శాంతి కలగాలి. భగవన్నామమహిమ ఎంత ఉత్కృష్టమైనదో, ఎంతటి మహిమాన్వితమైనదో తెలియజెప్పాలి. నిత్యం కులమత ద్వేషాలతో, ఈర్ష్యాసూయలతో, పరదేవతా దూషణలతో, పీఠాధిపత్యపు అహంకారంతో, బూటక వేషాలతో, సంకుచితత్వాన్ని పెంచే మతాధికారుల నిర్విరామ కృషితో పతనావస్థ వైపుకు దారి తీస్తున్న సోదరులకు ఉపయోగమైనవిగా రూపులు దిద్దుకోవాలి.

ఈ భావన భగవంతుని ఆశీర్వాదం–
ఈ కృషి ఆ భగవంతుని ప్రసాదం--
ఫలితం ఆ భగవంతునికే అర్పితం.

కృష్ణారావు రచనలు నిర్విరామంగా సాగుతున్నాయి. వ్రాసింది వ్రాసినట్టు తల్లి చేత చదివించుకుంటోంది సత్యవతి. అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తోంది. అర్థం చేసుకునే వయసు కాకపోయినా కృష్ణ భక్తిని ఉగ్గుపాలతో త్రాగింది. గీతాసారాన్ని గోరుముద్దల్లా తినిపించాడు తండ్రి భారత, భాగవతాలను కథలు కథలుగా చెప్పించుకుంటూ తన మనసును పంచుకుంది. అందుకే వయసును మించి మనసు పెరిగిపోయింది. ఏ క్షణాన్నైనా ఆయువు తరిగిపోవచ్చన్న సత్యం సత్యహృదయంలో బలంగా నాటుకుపోయింది. కాలం భగవత్స్వరూపమని తండ్రి హెచ్చరించాడు. ప్రతీ క్షణంలోనూ భగవంతుని చూట్టానికలవాటుపడ్డ సత్యవతి క్షణాన్ని కూడా వృధాచెయ్య దల్చుకోలేదు.

*   *   *

పరమేశ్వర శర్మ మాష్టారు మొహం ఇంత చేసుకుని లోపలికి అడుగు పెడుతుంటే ఆశ్చర్యపోయింది సత్యవతి. విషయం అర్థం చేసుకుంది.

''నమస్కారం మాష్టారు.''

సత్యవతి వంక వాత్సల్యంగా చూశారాయన.

''నాన్నగారూ – శ్రీహరి తాతయ్యగారూ గీతా మందిరంలో వున్నారు రండి –''

## వరం – శాపం

దేవుడు మానవులకు
ఇచ్చిన ఒకే ఒక్క
వరం
భవిష్యత్‌ను గూర్చి
తీయని కలలు కనడం !
అదే శాపం కూడా !
భవిష్యత్‌ను ఊహిస్తూ
వర్తమానాన్ని పాడుచేసుకోవడం.

— నగేష్

కాస్త తటపటాయించారు పరమేశ్వరశర్మ గారు.

"వన్లో వున్నారామ్మా..."

"ఫరవాలేదు రండి —"

వినటమేగానీ ఆయన ఆ ఇంట్లోకి అడుగు పెట్టటం అదే మొదలు. పవిత్రమైన దేవాలయంలోకి అడుగుపెడుతున్నామన్న భావనతో నిలువెల్లా పులకించింది.

"రండి మాస్టారూ — ఇది కృష్ణ మందిరం..."

బృందావనాన్ని మరపింపజేసే—ఆ మందిరం ముందు చేతులు జోడించి నిలబడిపోయా రాయన.

"మాష్టారూ తీర్థం పుచ్చుకుంటారా ?"

ఉద్ధరిణతో — కడిగిన ముత్యంలా — దైవ పూజకు వినియోగించిన పుష్పంలా—ఆ మందిరం లోని పవిత్రతకు వారసురాలిలా నిలబడివుంది సత్యవతి.

ఆ కళ్ళల్లో నిర్మలత్వమే చోటు చేసుకుంది.

ఆ నిర్మలత్వంలో భగవంతుని ప్రతిరూపం మెరుస్తోంది.

'అవును... అందుకనే అందరిలాంటిదీ కాదీ చిరంజీవి —'

ప్రసాదం కళ్ళ కద్దుకుంటూ అనుకున్నారు పరమేశ్వరశర్మగారు.

గీతా మందిరంలో అడుగులు తడబడ్డాయి.

"నాన్నా .. మా మాస్టారొచ్చారు—"

ఆ మందిరం గీతకు నిలయంలా వుంది.

ఎదురుగా కన్పిస్తోంది నిలువెత్తు పాలరాతి గీతోపదేశ దృశ్యం.

గదంతా శ్రీకృష్ణమయం.

ఎక్కడ చూసినా నిర్వికారతత్వం — చూసినకొద్దీ చూడాలన్పించే ఆ యోగీశ్వరుని లీలామానుషాకృతులు.

ఇంతకుమించిన పవిత్రత ఎక్కడా కన్పించ లేదాయనకు —

రెండు చేతులూ జోడించి నమస్కరించాడు.

"రండి మాస్టారూ —"

కృష్ణారావు ఆదరంగా ఆహ్వానిస్తుంటే — శ్రీహరిగారినీ నమస్కరిస్తూ ఎదురుగా కూర్చున్నారాయన.

"ఏం మాస్టారూ ?..."

కులాసానా ? అన్న భావం ఆ కళ్ళల్లోనే కన్పిస్తోంది.

నిజానికి కృష్ణారావుకన్నా రెట్టింపు వయసు తనదిలా అన్పిస్తోంది.

జుట్టు నెరిసి — పళ్ళు వూడి — ముడతలు పడి — కళ్ళల్లో కాంతి తగ్గి —శరీరంలో పటుత్వం పోయి — శక్తి క్షీణిస్తున్నట్టున్న ఈ పిడికెడు గుండె ఏ క్షణంలో ఆగిపోతుందోనని అనుక్షణం చచ్చి బ్రతుకుతూకూడా — ఈ సంసారంలో మునిగి తేలుతున్నాడు. బాధ్యతలు పూర్తిచేసు కున్నా — ఇంకేదో కావాలనీ — ఇంకా ఎంతో కాలం బ్రతకాలనీ — శక్తి వున్నంతవరకూ సంసారం చెయ్యాలనీ — శక్తి క్షీణించేదాకా భార్యతో రమించాలనీ — అదే జీవిత పరమావధిగా — అదే సంసారిగా తన ధర్మంగా ఊహిస్తూ—సాహిస్తూ వస్తున్న తన జీవితం — ఆ వాతావరణంలో — అసహ్యంగా అపవిత్రంగా అన్పించింది. మైల సోకిన మనిషి గర్భగుడిలోకి అడుగుపెట్టినట్టే అన్పిస్తోంది.

కారణం — కోరికలు చావని తన శరీరం రాత్రంతా ఎందుకు శ్రమపడుతుందో తెల్సు — శ్రమ తరువాత నిద్రలోనూ — క్లాసులో — శృంగార ఘట్టాలలోనూ తనని తను అదుపులో తెచ్చుకోలేని తన బలహీనత కూడా తెలుసు.

బట్టలు మార్చుకుని స్నానంచేసి రావల్సింది— అన్పించింది.

అంత మాత్రాన మనసు మాలిన్యం పోతుందా ?

క్షణిక దౌర్బల్యాని కలవాటుపడ్డ మనసు క్షణాలమీద మారిపోతుందా ?

"ఏమిటి మాష్టారూ ఆలోచిస్తున్నారు."

ఉలిక్కిపడ్డారు పరమేశ్వరశర్మగారు.

కొంపతీసి ఈయనకి మనసుల్ని చదవగల శక్తి కూడా లేదు కదా.

భయం భయంగా కృష్ణారావువంక చూశా డాయన. చూస్తూనే వుండిపోయాడు.

ఆ తేజస్సు—ఆ నిర్మలత్వం—ఆ పవిత్రతా మానవునికి సాధ్యమా ?

ప్రతివారిలోనూ దైవాన్నే వెతకగల ఆ వ్యక్తిత్వం సామాన్యులకు సుసాధ్యమా ?

వయసును మరిపించే విరాగిలా

మనసును పంచిచ్చే మహామనీషిలా—

దైవత్వాన్ని తలపింపజేసే తేజోమూర్తిలా కన్పిస్తున్న కృష్ణారావుని చూస్తుంటే పరమేశ్వరశర్మగారికి అన్పించింది—

నా జీవితాన్ని ఎంత వృధా చేసుకున్నాను.

ఎంత కళ్ళు మూసుకుపోయి బ్రతుకు తున్నాను.

వయసుతోపాటు ఎదగని తన మనసు నేమనుకోవాలి ?

లోపం ఎక్కడుందనుకోవాలి ?

"మాష్టారూ—పనిమీదవచ్చినట్టున్నారు."

శ్రీహరిగారు చిరునవ్వుతో అడుగుతుంటే వచ్చిన పని గుర్తుకు వచ్చిందాయనకి—

"అవునవును...చిరంజీవి సత్యవతి విషయం మాట్లాడిపోదామని వచ్చాను... కానీ వచ్చాక నా ఆలోచన తెలివితక్కువ దన్పించింది."

కొద్దిగా సిగ్గుపడుతున్నట్టున్నాడు.

"అసలు విషయమేమిటి ?"కుతూహలంగా అడిగారు శ్రీహరిగారు.

"అహఁ... తులసి విత్తుకు తులసి మొక్కే పుడుతుంది..."

"ఇంతకీ—"

అర్థవంతంగా కృష్ణారావు వైపు చూశారు శ్రీహరిగారు.

ఈ ఉపోద్ఘాతం సత్యవతికి అర్థమైంది. తల్లి చూపుల్ని తప్పించుకుంటూ తలవంచు కుంది. "...చెప్తాను. అసలు సత్యవతి పిల్లే మాణిక్యం లాంటిది. ఆ మనిషిగానీ, మనసుగానీ గుణంకానీ..."

"అసలు విషయం చెప్పండి మాష్టారూ."

శాంతంగా అన్నా గంభీరంగా వుంది కృష్ణా రావు గొంతు.

"విషయమేమిటంటే... చెప్పటమెందుకూ మొన్న తెలుగు పరీక్షలో రెండు ప్రశ్నలకి అమ్మాయి వ్రాసిన జవాబులు చదువుతాను. ఊహించుకోండి. ఆ వయసుకి అలా వ్రాస్తారా ఎవరైనా ? వ్రాయగలరా అసలూ."

పరమేశ్వర శర్మగారు కాగితాలు తీస్తుంటే శ్రీహరిగారిలో ఉత్కంఠ పెరిగిపోయింది.



"అయ్యా—శ్రీకృష్ణలీలలు వివరింపుము— ఇది మొదటి ప్రశ్న. అందరూ ఏం వ్రాశారు? శ్రీకృష్ణుడు, శ్రీరాముడిలా కాక అల్లరి పిల్లవాడు, గోపికల పెదవులు కొరికెడివాడు. పెళ్ళయిన గోపస్త్రీలను పెళ్ళాడమని వేధించే వాడు. పాలకుండలు పగులగొట్టేవాడు. అతని బాల్యమంతా అల్లరితోనే గడిచిపోయినది—"ఇలా వ్రాశారు— మన అమ్మాయి ఏం వ్రాసిందో వినండి.

"శ్రీకృష్ణ లీలలు వివరించుటా? అది సాధ్యమా? గోలోక నాయకుని మహిమను వర్ణించగల శక్తి ఎవరికున్నది? త్రిమూర్తులకు కూడా నశక్యములే వేదములు కూడా తెలుసుకో లేని అశక్తతతో ఉన్నవే. మహనీయులు తెల్సుకో లేని ఆయన లీలలు వివరించుట సాధ్యమా? ఆదివరాహమూ, వామనమూర్తి, కల్కి, బుద్ధుడు, ఆయన అంశలు మాత్రమే 'శ్రీరామ' నృశింహ కూర్మములు అతని అంశలే శ్రీకృష్ణుడు పరిపూర్ణుడు. గోలోకమున రాధాసమేతుడై నను మహాయోగి పుంగవుడై వుండును. ఆయన తేజస్సునే కదా నిత్యమూ మహోన్నతులూ యోగులూ స్మరించి ధన్యులయే ది— ఆయన తేజస్సునే కదా— మహనీయులు ధ్యానించేది— ఆయన లేని పదార్థ మెక్కడిది? గర్భ నరకమనుభవించక — ప్రసవ సమయమున యశోద గర్భమున నింపబడిన గాలిని గర్భముగా భ్రమింపజేసి, గోలోకమునుంచే పసిబాలుడిగా ఉదయించిన ఆ శ్రీకృష్ణ పరబ్రహ్మ లీలలు ఏ విధంగా చెప్పిన తృప్తి దీరును? ఆయన లీలల అంతరార్థము వ్రాయ నెవరితరము? గ్రహింప నెవరితరము? చిన్నికృష్ణుడి లీలలు చూపరులకూ, వినువారికి, కేవలం బాల లీలలుగానేవుండును. కానీ అంతరార్థములు అగమ్యములు కదా ..."

పరమేశ్వరశర్మగారు చదువుతున్నది క్షణం ఆపారు.

కృష్ణారావు కళ్ళుమూసుకుని నిశ్చలంగా

# కర్మయోగి

వున్నాడు. ఆ పెదాల చిరులాస్యమే అర్థంకాని భావాలను గుప్తంగా దాచుకున్నట్టున్నాయి.

శ్రీహరిగారి చూపుల్లో గర్వం తొంగి చూస్తోంది.

ఆప్యాయంగా చూస్తున్న ఆయన చూపుల్నుంచి తప్పించుకుంటూ తలదించుకుంది సత్యవతి.

"ఆపారేం మాస్టారూ చదవండి. వింటుంటే అసలిది చిట్టితల్లి వ్రాసిందేనా అన్పిస్తోంది ..."

శ్రీహరిగారి సంతోషం మాస్టారి ఉత్సాహాన్ని రెట్టింపు చేసింది.

"ఉదాహరణకొక పేరు చదువుతాను ... వయసు పెరిగినా — నాకే బుద్ధి తెప్పించేలా వ్రాసింది ... చిన్నికృష్ణుడు ఒక గోపిక ఇంట్లో ఎంగిలి చేతుల్తో నిలబడివుంటే — గోపిక కోపంతో మందలించిందిట–ఇది ఆ పరమేశ్వరుని ఇల్లు ... అంటుంటే కృష్ణుడు నవ్వుతూ — ఆవిడకు ఎంగిలి పూసి, 'ఎవడా దేముడని' ఇంటిని అపవిత్రం చేసినట్టు ఒక అభియోగం — ఐతే ఇది తుంటరి పనికాదు. అపరిపక్వ మనసుతో మనుష్యులు నిర్మించుకుని— స్వయంగా తయారు చేసుకున్నవి దేవతా విగ్రహాలు. అందులో తేజస్సు లేదు. కేవలం భక్తి కుదరటం కోసం చేసుకున్న బొమ్మలు దేవుళ్ళుగా అనుకుంటూ అసలైన పరబ్రహ్మ ఎదురుగావున్నా గ్రహించలేకపోవటం అవివేకం కాదా — అంతేకాదు. ఎదువంటి వారినైనా పవిత్రులను చెయ్యగల భగవంతునికి— ఎంగిలి అంటుతుందా? ఇప్పటికైనా అజ్ఞానం మానమని హెచ్చరించాడంతే."

శ్రీహరిగారి కళ్ళల్లో నీళ్ళు నిండాయి. అవి భాష్ప సుమాల్లా — సత్యవతి పాపిట్లో జారిపడుతున్నాయి.

కృష్ణప్రియ కళ్ళల్లో ఆశ్చర్యం, ఆనందం కొట్టొచ్చినట్టు కన్పిస్తోంది. ఎప్పుడూ అమాయకంగా, ముగ్ధలా, తను చదివింది వింటూ, తండ్రిని అంటిపెట్టుకుని తిరిగే, ఈ పసిదానిలో ఇంత ఊహ ఇంత భక్తి నిక్షిప్తమైవుందా?

ఇది సాధ్యమా!!!

"అయ్యా!" కాగితాలు మడుస్తూ, చెమ్మగిల్లిన కళ్ళను తుడుచుకున్నారు పరమేశ్వర శర్మగారు.

"మార్కులు వేద్దామని మామూలుగా చదవటం మొదలుపెట్టిన నా మతిపోయింది. ఈ తల్లికి మార్కులు వెయ్యటానికి నేనెంత వాడిని? ఈ ఊరువచ్చిన దగ్గర్నుంచీ తమ కుటుంబం గురించి వినటమేగానీ, ఏనాడూ ఇక్కడకు వచ్చే ప్రయత్నం చెయ్యలేదు. ఈ సంసార కూపంలో కూరుకుపోతున్న నాకు చిరంజీవి ఆశాజ్యోతిలా కన్పించింది ... ఇక్కడికి వచ్చాను. దైవత్వాన్ని చూశాను. బహుశా నా జీవితంలో ముఖ్యమైన మలుపు ఇవాళ నుంచే మొదలైందనుకుంటాను ... అప్పుడప్పుడు మీ దగ్గరకు రావచ్చంటారా?"

సందేహంగా అడుగుతున్న మాస్టారి భుజం తట్టారు శ్రీహరిగారు.

"మంచి నిర్ణయం తీసుకున్నావయ్యా! మండుటెండలో మాడిపోతున్నవాళ్ళకి, అతిచల్లని నీడ దొరుకుతుంది ఇక్కడ. గమ్యం దొరకక కొట్టుకునేవారితో ఆశాజ్యోతి గమ్యం చూపిస్తుంది ఇక్కడ. నేనొచ్చి ఇన్నాళ్ళైనా వెళ్ళలేకపోవటానికి కారణం ..."

"బాబాయ్!"

కృష్ణారావు చూపుల్ని అర్థం చేసుకున్న శ్రీహరిగారింక మాట్లాడలేకపోయారు.

"మంచిది మాస్టారూ! మీరు రావటానికి అభ్యంతరమెవరు చెపుతారు..." ఆ మాత్రానికే ఆనందపడిపోతున్న మాస్టారివంక తృప్తిగా చూసింది సత్యవతి.

[ఇంకా వుంది]




## బి. యస్. కె. — సింగవరపుకోట

నా వయస్సు 30 సంవత్సరములు. కుడివైపు కడుపు నెప్పిగా వుండుటచేత 3 సంవత్సరముల క్రితం డాక్టరుకి చూపించుకున్నాను. 'బేరియం మీల్' ఎక్సరే తీసి 'క్రానిక్ డుయోడినల్ అల్సర్' అని చెప్పినారు. మూడు నెలలు మందులు వాడినాను. అల్సర్ వలన సరిగ్గా జీర్ణము అవదా ? కారము, పులుపు తగ్గించినాను. అల్సర్‌కి తప్పక ఆపరేషన్ చేయించుకోవలెనా ?

★ ప్రతి డుయోడినల్ అల్సర్‌కీ ఆపరేషన్ అవసరం లేదు. క్రమబద్ధమైన ఆహార అలవాట్లతో, మందులతో చాలామటుకు నయమవుతాయి. అరుదుగా అంటే నెప్పి చాలా కాలంగా అధికంగా ఉన్నా, ఎక్కువగా వాంతులు మొదలయినవి ఉన్నా మాత్రమే ఆపరేషన్ అవసరం అవుతుంది.

## పి. యస్. జి. — చంద్రగిరి

మాటలు స్పష్టంగా రావటానికి 'స్పీచ్ తెరపీ' ఒక దానివల్ల సాధ్యమవుతుందన్నారు. 'ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పీచ్ అండ్ హియరింగ్' మైసూర్‌లో వుందన్నారు. కాని నాకు మైసూర్ వెళ్ళి ఆ వైద్యము చేయించుకొనే స్థోమత లేదు. దీనికి వేరే ఏమైనా వైద్యము వున్నదా ?

★ స్పీచ్ తెరపీ మినహా నత్తిని పోగొట్టటానికి ఇతర మార్గాలు లేవు. స్పీచ్ తెరపిస్టులు ఒక మైసూరులోనేగాక, ఇతర పట్టణాలలో కూడా ఉంటారు. హైదరాబాదు, మద్రాసు, విశాఖపట్నం మొదలయిన చోట్ల వీరు ఉంటారు.

## పి. కె. ఆర్. — కలకత్తా

నాకు 3 సంవత్సరాల క్రితం కడుపుమీద 3, 4 కాయలు లేచినవి. నెప్పిలేదు. అలాగే వున్నవి. డాక్టరుకి చూపిస్తే ఏమీ పరవా లేదన్నారు. నాకు భయముగా ఉన్నదీ ?

★ ఆ కాయలు పెరగనంత వరకు ఏ ఇబ్బందీ ఉండదు. వైద్యులు పరీక్షచేసి ఏమీలేదని చెప్పిన తర్వాత భయపడడం అనవసరం.

## పి. ఎస్. — ఆదోని

నా వయస్సు 16 సంవత్సరములు. నాకు 5 మాసములనుండి మూత్రము పసుపుగా పోవుచున్నది. నాకు ధూమపానము చేయటం అలవాటు వున్నది. దీనివలన మూత్రము ఇలా పోవుచున్నదని అనుమానముగా వున్నది.

★ ధూమపానానికి, మూత్రం పసుపుగా పోవటానికీ ఏ సంబంధమూ లేదు. మూత్ర పరీక్ష చేయించుకుంటే కామెర్లు ఉన్నదీ లేనిదీ తెలుస్తుంది. బి–కాంప్లెక్స్ మాత్రలు వాడుతూ ఉన్నప్పుడు మూత్రం పసుపుగా పోవటం సహజం.

# హైదరాబాద్ నోట్‌బుక్

## రెండు అపూర్వ శాసన గ్రంథాలు :

డబ్బో దస్కమో, ప్రాపకమో, పరపతో ఆశించి పుస్తకాలు అంకితం చేయడం చూస్తున్నాము దానికి విరుద్ధంగా అంకితమిచ్చారు సుప్రసిద్ధ శాసన పరిశోధకులు శ్రీ బి ఎన్ శాస్త్రి. ఆయన ఎంతో శ్రమకోర్చి పరిశోధించి స్వయంగా ప్రచురించిన రెండు గ్రంథాలలో ఒకదానిని—త్రిపురాంతక దేవాలయ శాసనములు—సర్వసంగ పరిత్యాగులైన పుష్పగిరి పీఠాధిపతులు శ్రీ విద్యా నృసింహ భారతీస్వాములకు, రెండవ దానిని—కందూరు చోళుల శాసనములు, చరిత్ర—సంస్కృతి—కీర్తిశేషులు శివలెంక శంభుప్రసాద్ గారికి అంకితమిచ్చి, ఆదర్శప్రాయమైన పని చేశారు ఈ అంకిత ఆవిష్కరణోత్సవం ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో మే 20 వ తేదీ సాయంకాలం వైభవోపేతంగా జరిగింది రాష్ట్ర సాహిత్య అకాడెమీ అధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావు అధ్యక్షత వహించారు రాష్ట్ర పురాతత్త్వశాఖ డైరెక్టర్ శ్రీ వి వి కృష్ణశాస్త్రి ఆ రెండు గ్రంథాలను ఆవిష్కరించారు. తెలుగులో సాంఘిక చరిత్రలు రెండు మూడు కన్నా ఎక్కువ లేవని, శ్రీ బి ఎన్ శాస్త్రి ప్రచురించిన ఈ గ్రంథాలలో సాంఘిక విషయాలు చాల వున్నవని, ఇవి చాల విలువైనవని, కందూరు చోళులు కాకతీయులకు సమకాలికులని, వారు పానగల్లులో నిర్మించిన శివాలయం చాలగొప్పదని, నల్లగొండలో మ్యూజియం స్థాపనకు పురాతత్త్వశాఖ పూనుకున్నదని శ్రీ కృష్ణశాస్త్రి పుస్తకాలను ఆవిష్కరిస్తూ అన్నారు రాష్ట్ర పురాతత్త్వశాఖ డిప్యూటీ డైరెక్టరు పుచ్చా పరబ్రహ్మశాస్త్రి త్రిపురాంతక దేవాలయ శాసనములు గ్రంథంపై ప్రసంగిస్తూ విష్ణుకుండినుల అపూర్వశాసనాలు కనుగొన్న ఘనత శ్రీ బి. ఎన్ శాస్త్రిదే నన్నారు నల్లగొండలోని అప్రకటిత శాసనాలను ఆయన ప్రచురించారని పరబ్రహ్మశాస్త్రి అన్నారు త్రిపురాంతకం శ్రీశైలానికి పూర్వ ద్వారం దానిలో దాదాపు 150 శాసనాలున్నాయి వాటిలో 33 శాసనాలను శ్రీ బి. ఎన్ శాస్త్రి ప్రచురించారు వాటి పునరుద్ధరణలో ప్రాచీనాంశాలను శ్రద్ధాసక్తులతో కాపాడడం శ్రీ శాస్త్రి ఘనత. కందూరు చోళుల దేవాలయాల విశిష్టత దేవాలయాలు నక్షత్రాకారంలో వుండడం కందూరి చోళులు రుద్రమదేవి కాలంలో స్వతంత్రులయ్యారని అంబదేవుడు త్రిపురాంతకంలో 1289లో కాకతీయుల ప్రసక్తిలేక వేయించిన శాసనంవల్లతెలుస్తుంది శ్రీ బి ఎన్ శాస్త్రి, ప్రతి శాసనచరిత్ర, దాని విశేషాలు, చివర సాంఘిక చరిత్ర రచించారు ఇది చాల ప్రయోజనకరం. శ్రీశైలంలో ప్రతాపరుద్రుని శాసనం ఒక్కటే కనిపిస్తుంది. అప్పుడు కాలాముఖులకు, పాశుపతులకు జరిగిన మత విప్లవంలో కాకతీయుల శాసనాలు ధ్వంసమయి వుంటాయి—అని డాక్టర్ పరబ్రహ్మశాస్త్రి అన్నారు శ్రీ గడియారం రామకృష్ణశర్మ కందూరు చోళులు — అనే గ్రంథాన్ని గురించి ప్రసంగిస్తూ "కందూరు చోళులు రేనాటి చోళుల వంశ వారు. కందూరు వనపర్తి తాలూకాలో వుంది వీరు తమిళ చోళులుకారు. పల్లవులు చోళులను జయించిన పిదప, చోళులు తెలుగుదేశాని వచ్చారు. వీరిది సింహ లాంఛనం తమిళచోళుల వ్యాఘ్రలాంఛనములు, వీరి శాసనాలు ఆధారంగ సాంస్కృతిక, వాణిజ్య, పరిపాలనాది విషయా లను శ్రీ బి ఎన్. శాస్త్రి గొప్ప కృషిచే తెలిపారు — అని అన్నారు అజ్ఞాత శాసనా సాహిత్యంలో తెలుగువారు పరిశోధనల జరుపడంలేదని, కన్నడులు చేస్తున్నార శ్రీ శర్మ అన్నారు శ్రీ పుష్పగిరి పీఠాధిపతి గ్రంథాన్ని అంకితం చేసుకుంటూ పుష్పగిరికూడ శ్రీశైలద్వారాలలో ఒక్కటిగనుక, చరిత్రకు వేదాంతానికి చాల దూరమైన, ఈ కృతి అజర మరమైంది కనుకే అంకితం పుచ్చుకుంటున్నా నన్నారు. కీర్తిశేషులు శివలెంక శంభుప్రసాద్ గారికి అంకితమిచ్చిన గ్రంథాన్ని ఆయనపక్షాన ఆయన జ్యేష్ఠపుత్రులు, ఆంధ్రపత్రిక, సచిత్ర వారపత్రిక, భారతి మాసపత్రికల సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణ స్వీకరించారు. శ్రీ బి ఎన్ శాస్త్రి పుస్తకాలను అంకితమిస్తూ, శ్రీ శివలెంక శంభుప్రసాదుగారు రాష్ట్ర విధాన పరిషత్తు సభ్యులుగా వున్నప్పుడు, తరచు ఆయనను కలుసుకొనేవాడినని, ఆయన రచయిత లకు, పరిశోధకులకు ఇస్తున్న ప్రోత్సాహం అపారమని, ఆయనకు తనపైగల అపార ఆదరానికి చిహ్నంగా కందూరు చోళులు గ్రంథాన్ని అంకిత మిచ్చానని అన్నారు. గ్రంథాన్ని స్వీకరించినందుకు శ్రీ శివలెంక రాధాకృష్ణకు, శ్రీ పుష్పగిరి పీఠాధిపతులకు కృతజ్ఞత తెలిపారు. శ్రీ బి.ఎన్ శాస్త్రి, అంకితం స్వీకరించినవారిని, ఆవిష్కర్తని, వక్తలను, మొదట వైదిక ప్రార్థన చేసిన చిరంజీవులుగూడా శ్రీనివాసశర్మ, కందర్ప శ్రీనివాసశర్మను, సరస్వతీ ప్రార్థనచేసిన సుప్రసిద్ధ కవి శ్రీ నీలా జంగయ్యను నూతన వస్త్రాలతో సత్కరించారు. ఈ అంకితోత్సవం ఏర్పాటు చేసిన వైదిక హరిహర సంఘం అధ్యక్షులు శ్రీ బొంగులూరి రామమూర్తి, శ్రీ బి.ఎన్. శాస్త్రిని, ఆయన సతీమణిని నూతన వస్త్రాలతో సత్కరించారు.

## ◆ ప్రశ్రుతి :

రాజకీయ విభేదాలను గురించి పత్రికలవారు వ్రాయడం మరీ విపరీతమైపోయిందండీ ? — అన్నారు నాతో ఒకరు. పత్రికలేంచేస్తాయయ్యా? పత్రికలు ప్రజల భావాల ప్రతిధ్వనులు. ధ్వనుల కంటే ప్రతిధ్వనులు తీవ్రంగా వుండడం సహజం — అన్నారు ఒక ధ్వనివాది.

— తిరుమల రామచంద్ర ★

త్రిపురాంతక దేవాలయం శాసనములు, కందూరు చోళుల శాసనములు అనే గ్రంథాలను ఆవిష్కరిస్తున్న రాష్ట్ర పురాతత్వశాఖ డైరెక్టరు డా వి. వి. కృష్ణశాస్త్రి (ఎడమ), గ్రంథకర్త శ్రీ బి. ఎన్ శాస్త్రి



రోజూ స్కూలు అయిపోగానే, మా స్నేహితులతో
కలిసి, గ్రౌండ్‌కి వెళ్ళి ఫుట్ బాల్ ఆడుకుంటాను.
ఒకసారి గ్రౌండ్‌లోకి వెడితే, అలిసిపోయి, కదలలేనంత
వరకు ఆడతాము. అయితే ఏం? ఇంటికి వెళ్ళగానే మా
అమ్మ నాకు ఒక కప్పు హార్లిక్స్ యిస్తుంది. అహా! శక్తినిచ్చే
పానీయం, హార్లిక్స్! నిజంగానే బలే రుచిగా ఉంటుంది.

మాల్టెడ్ బార్లీ, వెన్నతో కూడిన పాలు, బంగారు వన్నె గోధుమలలోని పోషక శక్తుల మంచితనమంతా చక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికరమైన పానీయం.

పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్మేరు. 100 సంవత్సరాలకు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముకున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?







మంచి పుష్టికరమైనది

HTD-HMM-8074 TEL

## గ మ ని క

వ్యక్తులపేర మీ రచనలు పంపితే వాటి పరిశీలనలో ఆలస్యం జరిగే ప్రమాదాలెక్కువ కనుక మీ రచనలన్నీ కూడా శీర్షిక పేరు కవరుపైన లేదా కార్డుపైన ఉదహరిస్తూ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520 003 అన్న చిరునామాకి పంపండి.

—సం.





# అవీ ఇవీ అన్నీ

## మచిలీపట్నం మహిళా సేవామండలి 44వ వార్షికోత్సవం

మచిలీపట్నంలోని మహిళా సేవా మండలి 44వ వార్షికోత్సవం మే 27న బందరు టౌన్ హాలులో జరిగింది. సభకి రాష్ట్ర సమాచార శాఖ డెప్యూటీ డైరెక్టరు శ్రీ వి. రామలింగారెడ్డి అధ్యక్షత వహించారు. సినీ దర్శకుడు శ్రీ నందం హరిశ్చంద్రరావు ముఖ్య అతిథిగా విచ్చేశారు. శ్రీయుతులు మల్లాది సూరిబాబు, జె. సత్యనారాయణ, తంగిరాల రాఘవరావు, శ్రీమతులు ఇంద్రగంటి జానకీబాల, తురగా సీతారామమ్మగార్లు ప్రసంగించారు. మండలి స్థాపకురాలు, అధ్యక్షురాలు అయిన శ్రీమతి దుల్ల వెంకట రమణమ్మగారిని 'సహస్ర చంద్ర దర్శిని'గా సంస్థ కమిటీ మెంబర్స్ తరఫున శ్రీమతి పురాణం సీత సన్మానించారు.

ప్రారంభంలో మండలి కార్యదర్శి శ్రీమతి రావినూతల సువర్నాకన్నన్ స్వాగతం పలికారు.

అనంతరం వినోద కార్యక్రమాలు, శ్రీమతి సువర్నాకన్నన్ రచన, దర్శకత్వం నిర్వహించి నటించిన 'పతివ్రత' నాటిక ప్రదర్శన జరిగాయి.

## ఉ త్త రా లు

[ 4వ పేజీ తరువాయి]

### న్యూఢిల్లీ లేఖ

8–6–84 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో డా॥ జయదుబాషీగారి 'న్యూఢిల్లీ లేఖ' 'అశోకా హోటల్ నుంచి చూస్తే ఏమి కనుపడుతుంది?' ఏదైనా గొప్ప విషయమేమో అనుకొని చదివితే చాలా అసహ్యమనిపించినది. మన పవిత్ర భారత దేశమునకు ముఖ్య నగరమైన ఢిల్లీలో ఇంత అసహ్యముగా ఉందంటే చాలా సిగ్గుగా ఉన్నది.

డి. మనోహర్, రాయగడ.

* * *

8–6–84 నాటి పత్రికపై 'మేనక' ముఖచిత్రం ఎంతో రమణీయంగా చూడ ముచ్చటగా ఉంది. డా॥ జయదుబాషీగారు 'న్యూఢిల్లీ లేఖ'లో పాలరాయితో నిర్మించే అత్యాధునిక భవనాలతో నైమరపించే రాజధానీ మహానగరంలో అపరిశుభ్రతను గూర్చి ఎన్నో విషయాలు తెలియపర్చారు. ఈ వ్యాసం చదివి నేనెంతో ఆశ్చర్యపోయాను.

సమ్మెట వేంకటేశ్వర్లు, యస్. సుజనాదేవి, ఇతరులు, మహబూబాబాదు.

### గుట్టు – రట్టు

18.5.84 సంచికలో 'న్యూఢిల్లీ లేఖ'లో డా॥ జయదుబాషీగారు బొంబాయి వ్యాపార మార్కెట్ రాజకీయ మార్కెట్‌గా మలచి అసభ్య అధిక ప్రవర్తనా ఉపముఖ్యమంత్రి శ్రీ శ్రీ శ్రీ రామారావ్ ఆదిక్‌గారి సీసా మహాత్యం గురించి అధికారాన్ని వ్యాపారంతో భావించి వృత్తిపరంగా అవగాహన చేసుకొను బడా నాయకుల గుట్టు రట్టు పరోక్షంగా చేసిన ఎమర్జన్సీలో. జె.ఆర్.డి. తాతగారు ఎమర్జన్సీ మంచిదే అన్న మాటలు విస్మయం కల్గించకమానదు. రాజ్యసభ ఎన్నికల్లో అదుపులో ఉంచాలంటే మదవతుల్నీ మద్యాన్ని ఆశ చూపి అదుపు చేస్తారంటూ అజ్ఞానపు నాయకుల గురించి క్లుప్తంగా వ్రాశారు. జయదుబాషీగార్కి మా ధన్యవాదములు.

పి. భగవంతరెడ్డి, కౌసల్యాదేవి, పెంచుకలపాడు.

### అద్భుత వ్యక్తులు

ది 25–5–84 సచిత్ర వార పత్రికలో శ్రీ పట్టాభిరామ్‌గారు కీ॥ శే॥ పి. సి. సర్కారు గూర్చి వ్యాసం చాలా తక్కువ వ్రాశారు. పి. సి. సర్కారు ఒక ఇంద్రజాలికుడు మాత్రమే కాదు. ఆయన ఒక గొప్ప రచయిత. ఆయన ఎన్నో పుస్తకాలను, ఎ. ఎమ్. సి. అనే పత్రికను కూడ నడిపేవారు. ఈ పత్రికలో ఆయన విదేశాలలో పర్యటన అనుభవాలు, చిన్న చిన్న ట్రిక్కులు ఎ.ఎమ్. సి. మెంబర్లకుతెలిపి ఈ పత్రిక ద్వారా ఎందరో మేజిక్ ఔత్సాహికులను ప్రోత్సహించేవారు.

ఎవరైనా ఒక ట్రిక్కును ఒక విధంగా చేయగలరు కాని ఆయన ఒక ట్రిక్కును ఎన్నో విధాలుగా ప్రదర్శించే ప్రతిభాశాలి.

ఈయన కీర్తి శిఖరాలకి కన్నుకుట్టి విదేశాలలో ఆయన ప్రదర్శనిచ్చేటప్పుడు ఆయన చేసే ట్రిక్కులు తాలూకు రహస్యాలను కర పత్రాలు వేసి ఆయనను అవమానింప జూసేవారు. వారు ఈ సంగతి ముందుగానే తెలుసుకొని ఆ ట్రిక్కులను మరొక విధంగా ప్రదర్శించి ప్రేక్షకులను, మెజీషియనులను ఆశ్చర్యచకితులు గావించేవారు.

పి. సి. సర్కార్ మేజిక్ ప్రదర్శన తిలకించుచున్న ప్రేక్షకులను మరో ఊహాలోకానికి తీసుకొని వెళ్లి ఆనంద భరితులను చేసేవారు. ఆయన చేసే ప్రతి ట్రిక్కు ఒక కథగా చెప్పి ప్రదర్శించేవారు. ఆయన మేజిక్ ప్రదర్శన చూస్తుంటే ఒక హాలీవుడ్ చిత్రం చూస్తున్నట్టుగా వుండేది.

బోడా నాగవెంకటజగన్నాధరావు, అనకాపల్లి.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3, Editor : S. Radhakrishna

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIK